# జ్యోతిష భావ ఫలచంద్రిక

ద్వాదశ భావములలో ఆరు భావములకు మాత్రమే
ఫలితములు ఇవ్వబడినవి.

గ్రంధకర్త :
యం. సత్యనారాయణ సిద్ధాన్తి, తెనాలి

ద్వాదశ భావములకు ఫలితాలతో

# జ్యోతిష శాస్త్ర చిట్కాలు

గ్రంధకర్త :
యం. సత్యనారాయణ సిద్ధాన్తి, తెనాలి

వెల : 99/-

ఓం

శ్రీ శివాయ గురవే నమః

## ముందు మాట

అతి ప్రాచీనము సనాతనమునగు జ్యోతిశ్శాస్త్రము వేదములకు నేత్రాంగముగా భాసిల్లుచున్నది. ఈ శాస్త్రము సిద్ధాంత, హోరా, సంహితలను త్రిభాగాత్మకమైయున్నది. ఇందలి హోరా విభాగమునకే జాతకభాగమని పేరు ప్రసిద్ధమైనది.

**శ్లో॥ జ్యోతిశ్శాస్త్రే వినిశ్చిత్య హొరికం ఫలమీరితం ।**
**ఇష్టాఽనిష్ట పరిజ్ఞానా దనిష్టస్య ప్రశాంతయే ।**
**ఇష్టసాధన సిద్ధ్యర్థ ముపాయోయం ప్రదర్శితః ॥**

సకల జీవులకు భూత భవిష్యద్వర్తమానకాలము లందలి శుభాశుభ ఫలితములను తేటతెల్లముగా తెలియజేయుటయే గాక ఈ శాస్త్రము ఇష్టఫల సిద్ధికి అనువగు కాలమును గుర్తించుటకు, అరిష్ట ప్రాప్తి గల కాలము నెరుంగుటకు–గ్రహభావాదులవలన ఆయా యరిష్ట ములను నివారించుకొనుటకు తగిన ఉపాయములను గ్రహించుటకు ఉపయోగార్హమై యున్నది. నక్షత్ర, రాశి, అపురూపమైన ఈ శాస్త్రము – సూర్యుడు, బ్రహ్మ మొదలుకొని శౌనకుని వరకుగల పదునెన్మిదిమంది మహర్షులచే విస్తరించబడియున్నది.

**శ్లో॥ సప్తవింశతి తారాణా మశ్వాదీనాం పృథక్పృథక్ ।**
**పాదైశ్చతుర్భిర్గగనే శింశుమారం ప్రతిష్ఠితమ్ ॥**
**పా క్చాగ్గతోడు చక్రం తదష్టోత్తర శతాం ఘ్రికం ।**
**ప్రత్యఙ్ముఖం చలత్యేన మేరోర్నిత్యం ప్రదక్షిణమ్ ॥**

భగవంతునిచే ఆకాశమందు "శింశుమారచక్రము" ప్రతిష్ఠించ బడినది. ఆ చక్రము ఒక్కొక్క నక్షత్రమునకు నాల్గు భాగములు (పాదముల) కల్గి మొత్తం నూట ఎన్మిది నక్షత్రపాదములతో నలరారు చుండి మేషాది మీనాంతనామములతో పదిరెండు సమవిభాగములు గలదై పశ్చిమ ముఖము ప్రాగ్గతిగా మేరు పర్వముచుట్టూ ప్రతిదినము ప్రదక్షిణ క్రమంలో పరిభ్రమింపు చున్నది. ఈ చక్రము ననుసరించియే గ్రహ కక్ష్యలన్నియూ నెలకోని యుండుట వలన – సమస్త గ్రహములు ఈ చక్రానువర్తినులై యున్నవి.

**శ్లో॥ తదధశ్శని గురుర్వార సూర్యశుక్ర బుధేందవః**
**ప్రాగ్యాయినోపి చక్రేణ యాంతి భూమేః ప్రదక్షిణమ్ ॥**

శని – గురు – కుజ – సూర్య – శుక్ర – బుధ – చంద్రులయొక్క కక్ష్యలు తూర్పు గమనములు గల్గి భూమికి ప్రదక్షిణ క్రమంలో పరిభ్రమింపుచున్నవి. ఈ విధముగా ఆకాశమునందుండెడు గ్రహ గోళముల యొక్క, భూగోళము యొక్క గుణముల కలయిక వలన పృథివ్యాది పంచభూతముల గుణ ధర్మములు పలు విధములుగా పరివర్తనము జెంది మనుష్యాది వివిధ ప్రాణులయొక్క గుణ, రూప, క్రియా విశేషములు భేదింపుచుండగలవు.

**శ్లో॥ తత్త త్కర్మ విపాకస్య సూచకం గోళ లక్షణం ।**
**జ్ఞాత్వా తదను సారేణ జన్మాది ఫలమున్నయేత్ ॥**

అను ప్రమాణము ననుసరించి పూర్వ జన్మ కర్మల ననుసరించి ఆయా గోళలక్షణములుత్పన్నములై ప్రాణికోటి యొక్క జనన వృద్ధి క్షయములకు – వాటియొక్క జీవన లక్షణములకు కారణమగు చుండుట వలన, జాతక ఫలములు దెలిసికొనుటకు శింశుమార చక్రానువర్తన ములగు గ్రహగోళ లక్షణములు తెలిసికొనుట ముఖ్యము.

ప్రాచీనులగు మహర్షులు తమ తపశ్శక్తిచే దివ్యదృష్టినంది జ్యోతిశ్శాస్త్ర విజ్ఞానమును గ్రంథస్థమొనర్చి భారతీయులకు మహోపకార మొనర్చిరి. అనంతమగు వారి ఖగోళ శాస్త్ర విజ్ఞానమును పూర్వులగు వరాహ మిహిర – కాళిదాసాది దైవజ్ఞులు వర్తమాన కాలానుసరణముగా సంస్కరించి తమ గ్రంథములందు విశదీకరించి యుండిరి. ఈ గ్రంథము లన్నియు సంస్కృత వాఙ్మయము నందుండుట వలన అందలి అనేక ముఖ్యాంశములు – గణిత విధానములు నేటి కాలమున సామాన్యుల

కందుబాటులో లేక మరియు అసంపూర్ణ శాస్త్ర పరిజ్ఞానముగల కొందరు వ్రాసిన గ్రంథములు (తెలుగు లిపిలో) సంపూర్ణ శాస్త్రార్థములను ప్రతిపాదించ లేకపోవుటవలన నేటికాలమున ఈ శాస్త్రమర్ధ సందిగ్ధమై, ఫలానుభవ శూన్యమై యున్నదనుట అతిశయోక్తి కాదేమో ?

శ్లో॥ విధాత్రా లిఖితా యాసా లలాటాఽక్షర మాలికా ।
దైవజ్ఞస్తాం పఠేత్ప్రాజ్ఞో హోరా నిర్మల చక్షుసా ॥

ప్రతి జీవికి బ్రహ్మదేవుని ద్వారా లలాటమునందు వ్రాయబడియుండు సుఖ దుఃఖమయము యోగావయోగములతోను కూడిన జీవనవిధానమునను హోరాశాస్త్రాను సారముగా (జ్యోతిశ్శాస్త్ర) గుర్తెరుంగుటకు విశేషశాస్త్ర పరిజ్ఞానమేగాక తగినదివ్య దైవశక్తి కూడా చాలా అవసరమై యున్నది. ఫలనిర్ణయమునకు ప్రధానాంగములు గ్రహములు. ద్వాదశ భావములు నగుటవలన – ఆ ద్వాదశ భావములకు – నవగ్రహములకు కల్గు అనే కానేక సంబంధములను పురస్కరించుకొని శాస్త్రవేత్తలు దెల్పిన బహువిధములగు ఫలితములను సరళముగా ఈ “జ్యోతిష భావఫల చంద్రిక”యను గ్రంథమునందు విపులీకరించడమైనది. గ్రంథస్థ విషయముల నన్వయించుకొనుటకు తగిన గ్రహ శీలము. భావ శీలము. కారతత్వములు. ఆధిపత్యములు శుభాశుభ నిర్ణయములు–భావ ఫలసిద్ధి కాలమువంటి అతిముఖ్య విషయములు సంగ్రహముగా దెలుపబడినవి. జననకాలమునకు సరియగు గ్రహ–భావ స్ఫుటములు –సప్తవర్గ–అష్టకవర్గ బలములు– దశాంతర్దశాకాలములు గల్గిన జన్మ పత్రిక ద్వారా (జన్మకుండలి) ఇందలి ఫలితముల నెల్లరు సులభముగా గ్రహించుటకు వీలుగా ప్రత్యేక శ్రద్ధగైకొని–పూర్వ గ్రంథముల ఆధారముగా ఇందలి ఫలితములు సప్రామాణికముగా వ్రాయబడినవి–ప్రమాదముచే సంభవించిన పొరపాట్లను హంసక్షీర న్యాయమున పరిత్యజించి – గుణములను గ్రహించి పాఠకులు, పండితులు ఈ గ్రంథమును సమాదరించిగలరని విశ్వసించెదను.

ఇట్లు
గ్రంథకర్త





ఓం
శ్రీ శివాయ గురవేనమః

# జ్యోతిష భావఫల చంద్రిక

శ్లో॥ శరాంధనుః పాశసృణీ సృహస్తై ।
ర్దధాన మారక్త సరోరుహస్థం ।
వివస్త్ర పత్న్యాం సురత ప్రవృత్త ।
ముచ్ఛిష్ఠ మంబాసుతమాశ్రయేహమ్ ॥

శ్లో॥ గుంజాఫలా కల్పిత హారరమ్యా ।
శృత్యోస్మి ఖండం శిఖినోప హస్తం ।
కోదండబాణేదధతీం కారాభ్యాం ।
కటిస్ధవల్కాం శబరీం స్మ రేహమ్ ॥

శ్లో॥ అఖణ్డ మణ్డలాకారం వ్యాప్తంచేన చరాచరం ।
తత్పదం దర్శితంయేన తస్మై శ్రీ గురవే నమః ॥
“త్రిస్కంధం జ్యోతిషం హోరాగణిత సంహితేఽతిచ”

అను ప్రమాణానుసారముగా “జ్యోతిశ్శాస్త్రము” మూడువిభాగములుగా దెలుపబడినది. ఇందు హోరావిభాగమునకు జెందినదే శుభాశుభఫలములను దెల్పునట్టి శాస్త్రము. వాడుకలో “జ్యోతిషం” అనగానే ఫలితములను దెల్పు శాస్త్రమనియే అందరి యభిప్రాయమునైయున్నది. కానీ యదార్ధమునకు 1 గణితవిభాగము (ఖగోళవిజ్ఞానము) 2. హోరా విభాగము (శుభాశుభఫల నిర్ణయము) 3. సంహితా విభాగము. (వాస్తు, ప్రశ్న ముహూర్తాది అనుబంధ విషయములు) అను మూడు విభాగములకు సంబంధించిన శాస్త్రమే “జ్యోతిషశ్శాస్త్రము” అనబడుచున్నది.

హోరా విభాగాంతర్గతమైన ఫలనిర్ణయములకు ముందు గణితావశ్యకత అధికముగా నున్నది. ప్రతిమానవుని యొక్క జన్మకాల సమయమున కేర్పడియున్న గ్రహ–నక్షత్రములయొక్క సరియైన ఖగోళస్థితి ననుసరించి మరియు ఆ గ్రహ నక్షత్రములయొక్క నైసర్గిక–తాత్కాలిక పరస్పర స్థితి, గతుల ననుసరించి శాస్త్రములందు ఫలితములు దెలుపబడియున్నది. ఈ ఫలితములను గుర్తించుటకు–కాలగమనము భూగోళస్వరూపము ఖగోళగ్రహ

వర్తనము భ చక్రమునందలి నక్షత్రస్థితి, రాశ్యోదయాదులు ముఖ్యముగా తెలిసియుండవలెను-ఈ తెలుపబడిన విషయములన్నియు ఇంతకు పూర్వమే నాచే రచింపబడిన "ప్రాథమిక జ్యోతిషము" "సర్వార్థ జ్యోతిషము" "రాజయోగ రత్నావళి" యనుగ్రంథములందు వివరణాత్మక ముగా వ్రాయబడి యుండుట వలన, ప్రస్తుతము వాటినివదలి మానవజీవితములకు ముఖ్యహేతు భూతము లైన పదిరెండు భావములయొక్క ఫలితములనుమాత్రము దెల్పుచుంటిని.

జననకాల గ్రహస్థితినిదెల్పు జన్మపత్రిక. (జాతకచక్రము) సమగ్రముగా ఏర్పరచుకొనవలెను. అనగా నిరయనగ్రహ స్ఫుటము, నిరయన భావ స్ఫుటము గ్రహములకు, భావములకు దశవర్గ బలము - షడ్బలము - దశవిధావస్థలు అష్టకవర్గము - దృష్టిప్రసార చక్రము - చలిత గ్రహ - భావ చక్రములు, మరియు ఆయా వయోకాలములందు చంద్రరాశి ననుసరించి ఏర్పడు గోచార చక్రములు ఫల నిర్దేశమునందు ముఖ్యమగు ప్రాధాన్యత నంది యున్నవి-పరిశీలకులకు "రాశి శీలము" అనగా గ్రహముల, రాశుల, నక్షత్రముల, భావములయొక్క నైసర్గిక స్వరూప-స్వభావ- గుణ ధర్మములు-మిత్ర-శత్రు-సమత్వములు-ఉచ్ఛ-నీచలు ఆధిపత్య కారకత్వ ములు క్షుణ్ణముగా తెలిసియుండవలెను.

## గ్రహములకు మిత్ర శత్రుత్వములు

| గ్రహములు | మిత్రులు | శత్రువులు | సములు |
|---|---|---|---|
| రవి | చంద్ర-కుజ-గురు | శుక్ర-శని | బుధ |
| చంద్ర | రవి-బుధ | - | కుజ-గురు-శుక్ర-శని |
| కుజ | రవి-చంద్ర-గురు | బుధ | శుక్ర-శని |
| బుధ | రవి-శుక్ర | చంద్ర | కుజ-గురు-శని |
| గురు | రవి-చంద్ర-కుజ | బుధ-శుక్ర | శని |
| శుక్ర | బుధ-శని | రవి-చంద్ర | కుజ-గురు |
| శని | బుధ-శుక్ర | రవి-చంద్ర | గురు |
| రాహు | శుక్ర-శని | రవి-చంద్ర-కుజ | బుధ-గురు |
| కేతు | రవి-చంద్ర-కుజ | శుక్ర-శని | బుధ-గురు |



## కేంద్రాది స్థానములు

| | |
|---|---|
| 1-4-7-10 | కేంద్రస్థానములు (కంటకములు) |
| 1-5-9 | త్రికోణ స్థానములు (కోణములు) |
| 2-5-8-1 | పణఫర స్థానములు |
| 3-6-9-12 | అపోక్లీబ స్థానములు |
| 3-6-10-11 | అపచయ స్థానములు |
| 1-2-4-5-7-8-9-12 | ఉపచయ స్థానములు |
| వీనిలో-3-6-11 | స్థానములకు "త్రిషడాయము" లనిపేరు. |
| 6-8-12 | స్థానములకు "త్రికము" లని పేరు. |
| త్రికములగు 6-8-12 | స్థానములకు దుష్టప్రదమైనవి. |
| 2-3 | స్థానములు కూడా చెడును కలిగి యుండగలవు. |
| | 11 వస్థానముమిశ్రమము. |
| 1-4-5-7-9-10 | స్థానములు శుభ ప్రదమైనవి. |






ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

**గ్రహములకు - ఆధిపత్య - ఉచ్ఛ నీచలు**

| గ్రహములు | ఆధిపత్య రాశులు | ఉచ్ఛ రాశులు | పరమోచ్ఛ భాగలు | నీచ రాశులు | పరమనీచ భాగలు | మూలత్రికోణ రాశులు |
|---|---|---|---|---|---|---|
| రవి | సింహము | మేషము | 10 | తుల | 10 | సింహరాశిలో 20 భాగలవరకు |
| చంద్రుడు | కర్కాటకం | వృషభం | 3 | వృశ్చికం | 3 | వృషభంలో 4 to 30 |
| కుజుడు | మేషం వృశ్చికం | మకరం | 28 | కర్కాటకం | 28 | మేషం 0 to 12 |
| బుధుడు | మిధునం కన్య | కన్య | 15 | మీనం | 15 | కన్యలో 16 to 25 భాగలు |
| గురువు | ధనుస్సు మీనము | కర్కాటకం | 5 | మకరం | 6 | ధనూరాశిలో 20 భాగల వరకు |
| శుక్రుడు | వృషభం తుల | మీనం | 27 | కన | 27 | తులలో 20 భాగల వరకు |
| శని | మకరం కుంభం | తుల | 20 | మేషం | 20 | కుంభంలో 20 భాగల వరకు |
| రాహు | కన్య స్వక్షేత్రం | మిధునం | – | ధనుస్సు | – | కుంభము |
| కేతువు | మీనం స్వక్షేత్రం | ధనుస్సు | – | మిధునం | – | సింహము |





## శుభాశుభ గ్రహములు

నైసర్గికముగా (సహజసిద్ధముగా) గురుడు, శుక్రుడు, పూర్ణచంద్రుడు, శుభుల యొక్క సంబంధము గల బుధుడు–శుభగ్రహములు – రవి,కుజ, శని, రాహు, కేతు క్షీణ చంద్రుడు. పాపసంబంధముగల బుధుడు నైసర్గిక పాపగ్రహములు, కేంద్రస్థానములకు ఆధిపత్యము కల్గిన నైసర్గిక శుభగ్రహములు పాపులగుదురు కోణస్థానములకాధిపత్యము గల నైసర్గిక పాపులు శుభులగుదురు. నైసర్గిక శుభులైనను, పాపులైనను, 3–6–8–11–12 స్థానములకాధిపత్యము కల్గియున్న వారు పాపులేకాగలరు. లగ్నాధిపతికి 8వస్థానాధిపత్య దోషము కలుగదు. ఒక గ్రహమునకు రెండాధిపత్యములు కల్గిన యెడల రెండవ ఆధిపత్యమునకు తగిన ఫలమొసంగగలడు. 2–7 స్థానములు మారక స్థానములుగా దెలుపబడినవి.

1. శుభ గ్రహములకు కేంద్ర స్థానాధిపత్యము అత్యంత దోషప్రదము ముఖ్యముగా గురు, శుక్రులకి దోషము చాలా అధికము.
2. గురువు, పూర్ణచంద్రుడు, సంపూర్ణ శుభులు, శుక్రుడు మూడు వంతులు శుభుడు, బుధుడు అర్థ శుభుడు.
3. శని, రాహువులు పూర్ణపాపులు, కుజుడు, కేతువు, పాపసంబంధిత బుధుడు మూడువంతులు పాపులు, క్షీణచంద్రుడు, రవి అర్థపాపులు.
4. రెండవ స్థానము అస్వతంత్రము గలది. లగ్నాధిపతికే ఈ రెండవ స్థానాధిపత్యము కల్గిన ఆ లగ్నాధిపతి విశేష శుభుడగును. (మకర–కుంభ లగ్నములకు మాత్రమే ఈస్థితి కల్గును.)
5. పదునొకండవ స్థానాధిపత్యమున్న గ్రహములకు మంచిదికాదు. కానీ ఈ స్థానము నందుండుట మాత్రము గ్రహములన్నిటికి మంచిది.
6. కోణాధిపత్యముచే శుభులైనను వారికి 3–6–11. స్థానాధిపత్యము కూడా కల్గిన పాపఫలములనే నొసంగ గలరు.
7. కేంద్రాధిపత్యముచే శుభులైనను వారికి 3–6–11 స్థానాధిపత్యము కూడా కల్గిన దోషప్రదులు కాగలరు.

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

8. గురు, శుక్రులు, పూర్ణచంద్రుడు. శుభ సంబంధిత బుధుడు, చరరాశి యందున్న కేతువు సౌమ్య గ్రహములుగా దెలియవలెను.

9. రవి, కుజ, శని, రాహువులు, క్షీణచంద్రుడు, పాపసంబంధిత బుధుడు స్థిరలేక ద్విస్వభావ రాశి యందున్న కేతువు. క్రూర గ్రహములుగా పరిగణింపబడినవి.

10. కేంద్రాధిపత్యము కల్గిన సౌమ్య గ్రహములలో లగ్నాధిపతికంటె చతుర్థాధిపతి. చతుర్థాధిపతి కంటె సప్తమాధిపతి విశేష పాప ఫలితముల నొసంగ గలరు.

11. క్రూర గ్రహములకు కేంద్రాధిపత్యము కల్గిన యెడల రవి, క్షీణచంద్ర, పాప సంబంధిత బుధుడు, కుజుడు, శని, రాహు, కేతువులు వరుసగా ఒకరికంటె మరొకరు అత్యధిక శుభములనొసంగగలరు.

12. సౌమ్య గ్రహములకు కేంద్రస్థితి కూడా మంచిదికాదు. అయితే కోణాధిపత్యము కల్గిన సౌమ్యగ్రహములు కేంద్రస్థానములందు శుభము నొసంగగలరు.

13. క్రూర గ్రహములు కేంద్రాధిపతులై కేంద్రములందుండుట సామాన్యము. వీరు కోణస్థానము లందున్న శుభ ఫలితముల నివ్వగలరు.

14. బుధ, గురు, శుక్రులకు కేంద్రాధిపత్యము కల్గివారు 6-8-12 స్థానములందున్న యెడల వారి పాపత్యము నశించి శుభఫలితముల నొసంగ గలరు.

15. స్వక్షేత్రములందున్న శుభులు శుభ ఫలితములను పాపులు పాప ఫలితమును అధికముగా నొసంగ గలరు.

16. మేషాదిగా గల బేసి రాశులు స్వతంత్ర ఫలద్రములు సమరాశులు ఆ స్వతంత్రము కలిగి యుంటవి.

17. రాహు, కేతువులు వారున్న స్థానము ననుసరించి లేక ఇతర గ్రహకలయిక, దృష్టి ననుసరించి ఫలితముల నొసంగ గలరు.

18. ముఖ్యముగా రాహు, కేతువులు, శుభ సంబంధముచే శుభమును, అశుభ సంబంధముచే అశుభ ఫలమును నొసంగగలరు.



19. పదిరెండవ భాగమునందున్న రాహువు అనేక యోగములను భంగపరచును.

20. తృతీయ వ్యయ భావములందున్న కేతువు స్వతంత్ర యోగ కారకుడగును. కేతువులో కలసి శుక్రుడున్న కళత్రభావము చెడి పోగలదు-త్రికోణ స్థానములందున్న కేతువు నైసర్గిక శుభగ్రహ సమానుడు కాగలడు.

21. 2-7 స్థానాధిపతులు మారకులగుదురు. ఈ స్థానాధిపతులతో కలసిన గ్రహములు విశేషమారకు లగుదురు. 2-7 స్థానములందున్న పాప గ్రహములు కూడా మారకులు కాగలరు.

## గ్రహ స్థితి-యుతి-దృష్టి

### 1. స్థితి

ఒక రాశి 30 డిగ్రీల పరిమితి కల్గి యుండగలదు. ఇందు భావము ఏర్పడిన డిగ్రీ భావ మధ్య కేంద్రమనబడును. ఈ భావ మధ్యమునకు సమీపముగానున్న గ్రహము (ముందు వెనుకలందు సుమారు 5 డిగ్రీ లోపు) భావస్థితి గల గ్రహమగును. భావమునకు వెనుకనున్న గ్రహము ఆరోహణ స్థితి గలది. ముందునున్న గ్రహము అవరోహణ స్థితి గలది. భావ మధ్యగ్రహము సంపూర్ణ ఫలమును, ఆరోహణ గ్రహము అర్థ ఫలమును అవరోహణ గ్రహము నాల్గవ వంతు ఫలమును నొసంగ గలదు.

### 2. యుతి

ఒక గ్రహము మరొక గ్రహముతో కలసియుండుట యుతి యనబడును. గ్రహమునకు-గ్రహమునకు 10 డిగ్రీల లోపు అంతరమున్న పుడు మాత్రమే యుతి ప్రాప్తించగలదు. రవి గ్రహముతో యుతి నందిన గ్రహమునకు అస్తంగత దోషము ప్రాప్తించి తానొసంగదగిన ఫలితము నొసంగుటకు బలహీనము కాగలదు.

### 3. దృష్టి

అన్ని గ్రహములు తామున్న రాశినుండి ఏడవరాశి అందలి గ్రహములను పూర్ణ దృష్టితో చూడగలవు. విశేషముగా శనితానున్న రాశి

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

నుండి 3–10 రాశులను, గురువు, 5.9 రాశులను, కుజుడు, 4.8 రాశులను చూడగలరు. సప్తమ దృష్టి 180 డిగ్రీలపైన. పంచమదృష్టి. 120 డిగ్రీలపై. నవమదృష్టి 240 డిగ్రీలపైన తృతీయ దృష్టి 60 డిగ్రీలపైన, దశమదృష్టి 270 డిగ్రీలమీద. చతుర్థ దృష్టి 90 డిగ్రీలమీద, అష్టమ దృష్టి 210 డిగ్రీలమీద ప్రసరించగలదు.

గురు గ్రహమునకు పశ్చాద్గతియందలి దృష్టి–బలమధికము. శని గ్రహమునకు ఋజుగతి యందు దృష్టి బలమధికము - కుజునికి శత్రు క్షేత్రమునందున్నను, శని, శుక్రులకు అస్తంగతత్వము ప్రాప్తించినను దృష్టిబలము తగ్గదు–బలము కల్గియుండును. శుక్లపక్షమునందు నైసర్గిక శుభగ్రహములకు పాక్‌దృష్టి. పాపగ్రహములకు పశ్చాత్ దృష్టి యుండ గలదు. కృష్ణ పక్షమునందు శుభులకు పశ్చాద్గతి గల దృష్టి పాపులకు ప్రాగ్గతి గలదృష్టి యుండగలదు.

శని గ్రహమునకు 3–10 స్థానములందు గల దృష్టి విశేష బలప్రదము
గురుగ్రహమునకు 5–9 స్థానములందు గల దృష్టి అధిక బలప్రదము.
కుజగ్రహమునకు 4–8 స్థానదృష్టి బలాధికము–మిగిలిన గ్రహములకు సప్తమ దృష్టియందు బలమధికము–

## గ్రహ గమనములు

వక్రము, అతివక్రము, కుటిలము, మందము, మందతరము, సమము, శీఘ్రము, అతిశీఘ్రము, అను ఎనిమిది విధములగు నడకలు గ్రహములకు కల్గుచుండ గలవు. ఇందు రవి–చంద్రులకు వక్రగమన ముండదు–రాహు–కేతువులు ఎల్లవేళలందు వక్రగమనమే కల్గియుందురు.
రవి గ్రహమునకు రెండవ రాశిలో నున్న గ్రహము శీఘ్రగమనముగలది.
రవి గ్రహమునకు మూడవ రాశిలో నున్న గ్రహము సమానగతి గలది.
రవి గ్రహమునకు నాల్గవ రాశిలో నున్న గ్రహము మందగతి గలది.
రవి గ్రహమునకు 5–6 రాశులలో నున్న గ్రహము వక్రగతి గలది.
రవి గ్రహమునకు 7–8 రాశులలో నున్న గ్రహము అతివక్రము గలది.



రవి గ్రహమునకు 9–10 రాశులలో నున్న గ్రహము కుటిలగతి గలది.
రవి గ్రహమునకు 11–12 రాశులలో నున్న గ్రహము అతి శీఘ్రగమనముగలది.

సూర్యగ్రహమున్న రాశిలోనున్న గ్రహము మందతరగమనము గలది. సూర్యుని సమీపించిన గ్రహము అస్తంగత గ్రహము.

వక్రగమన మనగా వెనుకకు నడచుట–ఈ వక్రగమనము కుజునికి సుమారు 2 మాసముల 6 దినములు, బుధుడు 21 దినములు, గురువు 4 మాసములు శుక్రుడు ఒక్కమాసం 22 దినములు శని 4 మాసముల 15 దినములు వక్రసంచారము గావింపగలరు. శుక్రగ్రహము, పశ్చాదు దయాది 7 మాసముల 23 దినములకు వక్రించ గలడు.

## గ్రహ యుద్ధము

రవితో కలిసిన గ్రహమునకు అస్తంగతము ప్రాప్తించగలదు. చంద్రునితో కలసిన సమాగమ మేర్పడగలదు. బుధ, గురు, శుక్ర, శనులలో నెవ్వరైనను కుజునితో కలసిన గ్రహయుద్ధ మనబడును. కుజుడున్న నక్షత్రమునకు వెనుక గల నక్షత్రమునందున్న గ్రహము పరాజిత గ్రహము. ముందుగల నక్షత్రమునందున్న గ్రహము జయగ్రహము. ఒకే నక్షత్రమునందు కుజుని కూడియున్న గ్రహము యుద్ధ గ్రహము. పరాజిత యుద్ధ గ్రహములు శుభఫలితముల నొసంగ జాలవు. జయగ్రహము సత్ఫలితముల నొసంగును.

## గ్రహ కారకత్వములు

### 1. రవి గ్రహము :-



తండ్రి–ఆత్మ ధైర్యము శరీరము మనశ్శుద్ధి రాజ్యము ఉద్యోగము బంగారము శౌర్యము దుర్గము శివోపసాన జ్ఞానోదయము రక్తము కఫము పిత్తము సాత్త్విక గుణము శిరస్సు నేత్రములు కడుపు యజ్ఞము దుర్వ్యయము హృదయ శిరోనేత్ర వ్యాధులు అగ్నిమాంద్యము (జీర్ణశక్తిలోపించుట) అతిసారము అను వ్యాధులు ప్రభుత్వము నుండియు దైవికముగాను ప్రాప్తించు శ్రమలు బాధలు రవి గ్రహము వలన ప్రాప్తించగలవు.

## 2. చంద్ర గ్రహము




తల్లి, మనస్సు, బుద్ధి, సౌందర్యము, చిత్తవృత్తి, (తలంపులు) నిద్ర, భోజనము, కీర్తి, నూతన (పట్టు) వస్త్రములు, ఇంద్రియపుష్టి, సంతోషము, స్త్రీ సుఖము, ఉదరము, బాహువులు, యాత్ర, కామిలా (పసిగర్లు) పీనస (జలుబు) అపస్మారము (కోమా) ఇతర జలసంబంధిత వ్యాధులు స్త్రీల వల్ల ప్రాప్తించు రోగములు చంద్రుని వల్ల ప్రాప్తించగలవు.

## 3. కుజ గ్రహము




తమ్ములు చెల్లెళ్ళు జ్ఞాతులు శత్రువులు ఋణము, రోగము భూమి వ్యవసాయము, పరాక్రమము, యుద్ధము, కోపము, మూర్ఖత్వము, సైన్యాధిపత్యము, దొంగతనము, దారిద్ర్యము, అంతర్గత భయము, వాగ్వాదము ఉష్ణము, పిత్తము, వృషణములు, పరదూషణ కామము గణితము, ఉద్యానవనములు, ఆయుధధారణ, యంత్ర పరికరములు, వ్రణములు కంతులు, కణుతులు, గాయములు, దెబ్బలు, అగ్నిపీడ (వడలుకాలుట) క్షయ మూత్రకృచ్ఛము అనువ్యాధులు పరదేశ గమనములనునవి కుజుని వలన ప్రాప్తించగలవు.

## 4. బుధ గ్రహము




మేనమామ, బంధువులు, వివేకము, విజ్ఞానము, ప్రజ్ఞ, నిర్మలత్వము సాధు స్వభావము, జ్యోతిష వాణిజ్య శిల్ప వేదాంత పురాణ వ్యాకరణ గణిత విద్యలు, సేవకులు, యుక్తిప్రయుక్తులు, నపుంసకత్వము, విష్ణు ఆరాధన, వాత పిత్త శ్లేష్మములు, మృదువచనములు, దాయాదులు, కంఠము వామకర్ణము, నాభి గుహ్యము మైధునము, రత్నపరీక్ష, ఉదర వ్యాధులు మూలవ్యాధి. అజీర్ణబాధలు, భార్యద్వారా సంక్రమించెడు రోగములు పెద్దల ఆగ్రహమువల్ల కల్గు కష్టములు బుధునివల్ల ప్రాప్తించగలవు.



## 5. గురు గ్రహము




పుత్రులు, మేనమామకొడుకు, ధనము, దేహపుష్టి,సంపదలు మృదుభాషణము, మేడలు, పల్లకీ, సింహాసనము, మనుమలు, జ్యేష్ఠ సోదరుడు, పశుసంపద. ఆచారము,దాతృత్వము, వాచాలత, హృదయము, తపస్సు, సత్కర్మలు, కీర్తి, గౌరవము, బంధువులు, బంగారము, కావ్యజ్ఞానము, నిధి నిక్షేపములు, సద్వ్యయము, మంత్రపుష్ప వేద వేదాంత శాస్త్రీయ సనాతన విద్యలు శ్రద్ధ విద్య, మోకాళ్ళు, తొడలు, వాతము శ్లేష్మము, అజీర్ణము, గుల్మవ్యాధి పొట్టపెరుగుట, గురు భూసుర శాప దోషములచే కల్గు పుత్రశోకము, ధర్మ కార్యాచరణ, యజ్ఞాదులు, మంత్రిత్వము, రాజసన్మానము, అనునవి గురుని వల్ల ప్రాప్తించగలవు.

## 6. శుక్ర గ్రహము




భార్య,వివాహము, సౌందర్యము, వాహనము, సరస సల్లాపములు స్త్రీ సౌఖ్యము, కామము, రతిక్రీడ, క్రయవిక్రయములు, వంశము, జారత్వము గాంభీర్యము, కవిత్వము, నృత్యగీత వాయిద్యాది విద్యలు, లలితకళలు సుగంధద్రవ్యములు, వెండి, ముత్యములు, రాజముద్రాది కారం శ్వేతచ్ఛత్రము భరత శాస్త్రములు, జలసంచారము, కళానిపుణత్వము, పశుసంపద, రత్నములు, వస్త్రములు, వివిధ ఆభరణములు, వెండి, వేద, విద్య భోగము సుఖము, మేహము, మర్మాంగములు, అతిమూత్రము, మధుమేహము, దుష్ట స్త్రీ సాంగత్యముచే కల్గు వ్యాధులు, సింహాసనము, ప్రభుత్వాధికారము భార్యా సౌఖ్యము, శుక్రునివల్ల ప్రాప్తించగలదు.

## 7. శని గ్రహము




(రాత్రివేళ జన్మించిన పితృకారకత్వము) ఆయుర్దాయము ఔదార్యము, జీవనము, మృత్యువు, అపృతము, గద్గదస్వభావము, భయము, దరిద్రము, బంధనము, దుఃఖము,జూదము, కుచ్ఛితము, పాపము, వ్యసనము కిరాతత్వము, కార్యభంగము,



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

మూర్ఖత్వము, నపుంసకత్వము, నరకము, అనాచారము, అరణ్యసంచారము, అన్యదేశ విద్య, భయము ఒక సమూహము నకు నాయకత్వము, వృత్తి, మనోవ్యాధి, కీళ్ళు, నరములు, వాతము, శూల రోగము, వాతవ్యాధులు, కీళ్ళు, పట్టుకొనిపోవుట, పక్షవాతము పైశాచిక, పీడ చోరబాధలు, నల్లని వస్తువులు, మహిషసంపద, దుష్ట సహవాసములనునవి శనిగ్రహమువల్ల ప్రాప్తించగలవు. (పినతండ్రి పెదతండ్రుల సంపదలు ప్రాప్తించుట లేక వారివల్ల ఆపదలు)

**8. రాహువు**




తల్లి తండ్రి, (తాత) తండ్రి తండ్రి, హూణ విద్య పరదేశగమనము నీచాశ్రయము, అన్యభాష, ధైర్యము, ప్రతాపము, ఛత్రచామరములు, సింహాసనము, ధనార్జన, రాజ్యప్రాప్తి,జూదము, ప్రేతత్వము, కర్మ, ధూమము స్మశానము, దొంగ తనము, భేదము, మోసము, కుటిలతత్వము, వంచన, బలాత్కారము, భ్రష్టత్వము, మహారణ్యము, ఘోరయుద్ధము, మహోత్పాతము దుష్టమృగములు, సర్పము, విషము, బలవన్మరణము, ఉరిశిక్ష, ఖైదు, సంకెళ్ళు, వ్యవహారముల, చెట్టునుండి పడుట, రాళ్ళు, జ్వరముచే వడలు తెలియనిస్థితి, విషూచి, సంకోచం, మశూచికము, సర్పవిషశత్రు భయము త్వరితముగా వ్యాపించెడి అంటువ్యాధులు, వ్యభిచారము, కుట్ర, హత్య వైధవ్యములను రాహువు ప్రాప్తింప జేయును.

**9. కేతువు**



తాత, మోక్షము,వైరాగ్యము, గంగాస్నానం, తీర్థయాత్రలు, మూఢభక్తి, వేదాంతజ్ఞానము, అతీంద్రియ శక్తి, గారడీ మంత్ర తంత్ర విద్యలు క్షుద్రకర్మలు, అన్యభాష, మ్లేచ్ఛ సహవాసము, శైవదీక్ష, చపలత్వము డంభము, నటనము, స్నేహితులు, పాషాణములు, మతోన్మాదం, భిక్షాటనము వికారము, కీర్తి, ప్రతాపము, కపాలము, మిత్రభేదము, ఐశ్వర్యము, భోగము భాగ్యములు, సన్యాసము, జాత్యల్పత్వము, కర్మరాహిత్యము, మార్జాలభయము చర్మవ్యాధి భార్యా వైషమ్యము శూలరోగము వ్రణబాధలు విషూచి స్ఫోటకము, శత్రుపీడలనునవి కేతువువల్ల ప్రాప్తించగలవు.



## ద్వాదశ భావములు - కారకత్వములు

**1. తను భావము**

శరీరము ఆకారము స్వభావము, బలము, ఆధారము, జన్మభూమి సౌందర్యము, ఆత్మ, గుణము, జ్ఞానము, కీర్తి, ఆయువు, రాజనీతి, మొదటి భావమునకు సంబంధించి యుండగలవు.

**2. ధన భావము**

ధనము, కుటుంబము, వాక్కులు, భోజనము, సంపదలు, ప్రయాణము, నాలుక, పలువరుస, వాక్పటుత్వము, ధైర్యము యాచన దక్షిణ కర్ణ నేత్రములు భుక్తి, మృత్యువు, ఈ భావమునకు జెందినవి.

**3. భాతృ భావము**

కనిష్ట సోదర సోదరీలు, మిత్రులు, భటులు, మైత్రి ధైర్యసాహసములు, కంఠధ్వని, భుజబలము, వీర్యశక్తి, కోపము, దాస దాసీజనులు, కంఠాభరణములు, వివిధ ఆభరణధారణము, విషభక్షణము ఆయువు, తండ్రి యొక్క మరణము.

**4. మాతృ భావము**

తల్లి, గృహము, భూములు, వాహనము, వంశము, విద్య, కృషి, సర్వ సౌఖ్యములు, హృదయసౌలభ్యము, బంధువర్గము, స్థానభ్రంశము, జలము భూగర్భ సంపదలు, వాపీ కూప తటాకములు, తోటలు, పాడి పంటలు ఔషధము, మిత్రవర్గము, కుటుంబవృద్ధి, వివాదములు, సింహాసనము మంత్రము, రాజ్యము, పురాణము పుస్తక ప్రియత్వము, శయ్యా సౌఖ్యము బాహువులు, 4 వ భావ సంబంధితములు.

**5. పుత్ర భావము**

పుత్రులు, సంతానవృద్ధి, పితృభక్తి, దైవభక్తి, దైవోపాసన, మంత్రదీక్షలు, మనస్సు బుద్ధి విద్య విజ్ఞానము ప్రజ్ఞా పాటవములు ఆలోచనాశక్తి పాండిత్య ప్రతిభ, రహస్య విషయములు, ఆత్మశక్తి, దానము, యాత్రలు క్షేమము, రాజ్యము రాజ్యాధికారము, కార్య విఘ్నము, 5వ భావమునకు జెందినవి.

**6. శత్రు భావము**

శత్రువులు రోగములు ఋణములు వాటివల్ల కల్గు బాధలు లోభగుణము జ్ఞాతులు (దాయాదులు) అకాల భోజనాదులు వ్యసన లంపట, కలహములు, జనవిద్వేషము, ఆయుధములు, శౌర్యము, భీతి, కారాగృహము గండములు ఆపదలు పోట్లాటలు విఘ్నములు చోరత్వము చోరబాధలు పాపకృత్యములు, శత్రుపీడ, అంగవైకల్యము, మనోవ్యాధి, దుఃఖము అపవాదులు, ఉష్ణప్రకోపము, క్షయ, స్ఫోటకము, అతిసారము, మూత్ర రోగములు గర్భ వ్యాధులు 6వ భావమునకు జెందినవి.

**7. కళత్ర భావము**

భార్య, వివాహము, ఆధారము, భోగము, బ్రతుకుతెరవు, వీర్యము శృంగారము, సంసారము, వాణిజ్యము, క్రయ–విక్రయములు, కేళివిహారము దాంపత్య సౌఖ్యము, ఉపాయములు, చలనము, జ్ఞాతులు, జూదము, వ్యభిచారము, తాంబూలము, పాలు, యాత్రాచరణ, దంతములు, మృతి (చావు) స్వర్గప్రాప్తి అను విషయములు 7వ భావమునకు జెందినవి.

**8. ఆయుర్భావము**

ఆయుర్దాయము, మోక్షము, జీవనోపాయము, పరాభవము, కలహము, ఋణప్రాప్తి, క్రూరము, దుఃఖము, దండన, శిక్షలు, దారిద్ర్యము, అంగహీనత్వము, అపమృత్యువు, గండములు, రోగపీడలు, నాశనము, మృతి హేతువులు, మృత్యువు, శిరశ్ఛేదము, మేహజాడ్యము, గుహ్యరోగబాధలు 8వ భావమునకు జెంది యున్నవి.

**9. భాగ్య భావము**

తండ్రి గురువు దైవభక్తి పుణ్యము తపస్సు ధర్మము ఆశ్రయము పితృభాగ్యము–బలవర్గీయుల సహాయము–విశ్రాంతి స్థానబలము–గృహము దయ–ఆనందము, విద్య–సహాయము,జన్మాంతర ఫలితము–పుత్రులు–వాహనాది వివిధ భాగ్య సందలు–కీర్తి ప్రతిష్ఠలు 9వ భావమునకు జెందినవి.

**10. రాజ్య భావము**

క్రియాత్మకశక్తి, చేయుపనులు, వృత్తి, ఆజ్ఞ, ఉద్యోగము, రాజ్యము వ్యాపారము, గౌరవ మర్యాదలు, జీవన సరళి– కృషి, స్వకీయ ఆచార



వ్యవహారములు–రాజసన్మానము–దత్తపుత్రుడు–సత్సాంగత్యము–పుణ్యాధిక్యత వస్తు వస్త్రవాహన భరణములు 10 వభావమునకు జెందినవి.

**11. లాభ భావము**

అన్నలు–అక్కలు, ధనప్రాప్తి, హేతువులు, లాభనష్టములు, పినతండ్రి పెదతండ్రులు, నష్టద్రవ్యము, దుర్లాభము – జయము, అనేక విధములుగా కల్గు ద్రవ్యము, ఆయువు, లాభము, వామకర్ణము, పృష్ఠము జంఘము బాధలు, 11వ భావమునకు జెందినవి.

**12. వ్యయ భావము**

విదేశగమనము, శయనసుఖము, ధన వ్యయము, అందుకు హేతువులు మోక్షము, పాపము, నరకము, వివాహహాని, మనోవ్యాధి, జారత్వము, చిత్త వికలత్వము, శృంఖలము, శత్రువులు, హాని, నాశము. 12 వ భావమునకు జెందినవి.

**భావ పరిశీలన**

పది రెండు భావములుగల రాశ్యాత్మక చక్రమునందు మానవులకు ప్రాప్తించు సకల శుభా శుభఫలితములు హోరాశాస్త్రమునందు దెలుపబడినవి. భావములన్నియు గ్రహములవల్ల నక్షత్రములవల్ల ప్రభావితములై పలు విధములగు ఫలితములకు కారణమగుచున్నవి. ఈ భావ ఫలితముల నెరుంగుటకు శాస్త్రవిధానములు పలుసిద్ధాంతములను ప్రతిపాదించి ఏఏ గ్రహసంబంధాదులచే ఏవిధమగు ఫలితముల నొసంగునది సూక్ష్మ దృష్టితో దెల్పియున్నప్పటికీ ఈ శాస్త్ర రహస్యార్థ విజ్ఞానము కల్గుటకు జ్యోతిష్కునికి దైవ శక్తి చాలా అవసరము.

శ్లో॥ **విధాతా లిఖితాయాసా లలా టేఽ క్షర మాలికా ।**
**దైవజ్ఞ స్తాం పఠే త్ర్వా జ్ఞో హోరా నిర్మల చక్షుషా ।**

జీవులు మాతృ గర్భమునందు ప్రవేశించిన తోడనే బ్రహ్మదేవు నిచే వాని లలాటము నందే విధముగా శుభాశుభములు వ్రాయబడినవో అవియెల్ల హోరాశాస్త్రమును పఠించెడు జ్యోతిష్కుడు నిర్మల నేత్రములద్వారా చదివి,

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

దైవ ప్రాప్తమగు దివ్యదృష్టి వలన గ్రహించగలడు. అట్టి దైవదృష్టి ద్వారా భగవన్నిర్ణయములను తెలుసుకొనెడి వారే "దైవజ్ఞులు" అనబడగలరు.

**శ్లో॥ ధాతావేత్తి స ఏక ఏవ నిఖిలం భావ్యంశ మస్మాత్పరో ।**
**యః కో వాసి నవేత్తి నిశ్చయ మిదం తస్మా ద్వశిష్ఠాదిభిః ॥**

భవిష్యత్‌కాల విషయముల నాపరమేశ్వరుడు దప్ప నెవ్వరును తెలుసుకొనజాలరు. భగవదంశ దివ్యమగు దైవిక శక్తిగల వశిష్ఠాది మహర్షులు కొందరు మాత్రము, ఇట్టి మహత్తర భవిష్యత్ ఫలనిర్ణయములను దెల్పు జ్యోతిశ్శాస్త్రమును రూపొందించియుండిరి. ఈ శాస్త్రము లందు దెలుపబడిన విషయములు శాస్త్రములను చదువుటవల్లనే తెలియు ననుకొనుట యవివేకము-గురు ప్రాప్తమగు విద్యవల్ల శాస్త్రార్థ రహస్యములు క్లిష్టమగు పద సంకేతముల విశ్లేషణలు తెలియబడగలవు. దైవోపాసనవల్ల పూర్వజన్మ సుకృతమువల్ల గురు భూసురానుగ్రహమువల్ల సకల ఫలితములు భూత భవిష్యద్వర్తమాన విషయములు చక్కగా మనసు నవగతముకాగలవు. కావున దైవ నిర్ణయమును గుర్తెరుంగుటకు తగిన దివ్యజ్ఞానమును స్వయం సాధన ద్వారా సముపార్జించి, దైవికశక్తి కలిగియున్నప్పుడే ఈ శాస్త్రగ్థి విషయముల యొక్క యదార్థస్థితి బోధపడగలదు.

(ఈ గ్రంథమునందలి విషయములు పరిశీలించుటకు ముందు ప్రాథమిక శాస్త్ర పరిజ్ఞానము కల్గి యుండవలెను. మా "ప్రాథమిక జ్యోతిషము" పుస్తకము చూడగలరు.)

పది రెండు రాశులలో ఏదో ఒకటి జన్మలగ్నమని పిలువబడగలదు. అట్టి లగ్నరాశికి ఏ గ్రహమధిపతియో అతడే జన్మలగ్నాధిపతిగా వ్యవహరించ బడగలడు. జన్మ లగ్నమునుండి రెండవ రాశ్యాధిపతిని ద్వితీయాధిపతి యందురు. ఈ విధముగా పది రెండు రాశులకు అధిపతులేర్పడగలరు. వీరు జన్మలగ్నాధిగా స్థానాధిపతులుగా దెలుపబడిరి. (భావాధిపతులు కావచ్చు-కాకపోవచ్చు) ముందుగా వీరి యొక్క నైసర్గిక - ఆధిపత్య శుభా శుభములను పరిశీలించుట ముఖ్యము.

భూచక్రము 360 డిగ్రీలు గలది. (12×30=360) ఇది మేషరాశి ప్రారంభంలో "0" డిగ్రీ నుండి ప్రారంభమై సవ్యగతిలో మీనరాశి యందలి



సమాప్తి యందు 360 డిగ్రీ వద్ద అంత్యముకాగలదు. ఇట్టి భూచక్రమను (కాలపురుష స్వరూపము) స్థిర మండలమునందు - మేషాదిరాశి నామములతోటి 12 విభాగములుగలవు ప్రతిభాగమునందు 9 అంతర్భాగములుగలవు. వీటినే అంశలు అని చెప్పెదరు ఒక అంశకు $3^{0}$ -20' డిగ్రీల పరిమితి. నాల్గు అంశలు ఒక నక్షత్రముగా దెలుపబడినది. నక్షత్రం ఒకటికి $13^{0}$-20' డిగ్రీలు-రాశి ఒకటికి $30^{0}$- 0' డిగ్రీలు భూ చక్రం మొత్తం 360 డిగ్రీలు జాతకుని జన్మ సమయమునకు భూగోళము నందే రాశివిభాగమునకు జెందిన డిగ్రీలు ఏర్పడుచున్నవో ఆ డిగ్రీలే జాతకుని యొక్క తనుభావ మధ్య కేంద్ర మనబడుచున్నది. ఇది అన్ని భావములకు ప్రాణమువంటిది. ఇదే విధముగా సూర్యగమనము ననుసరించి జన్మ సమయమునకేర్పడు దశమ భావ డిగ్రీలు కూడా భావములన్నింటికీ జీవము వంటివి. లగ్నభావమునకు 180 డిగ్రీలు కలిపిన సప్తమ భావము దశమ భావమునకు 180 డిగ్రీలు కలుపుటవలన చతుర్థభావము ఏర్పడ గలవు. లగ్న చతుర్థ సప్తమ భావముల ననుసరించి మిగిలిన భావముల నేర్పరుచు కొనవలెను. దీనినే భావస్ఫుటమని శాస్త్రము దెల్పుచున్నది. కొన్ని స్థానములందు (లగ్నాదిగాగల రాశులలో) భావము ఏర్పడక పోవచ్చు. కొన్ని రాశులందు రెండు భావములేర్పడవచ్చు-కావున స్థూలముగా నిర్ణయించిన రాశి చక్రమునందలి స్థానములను గాక భావచక్రమును మాత్రమే పరిశీలించ భావ ఫలితములను తెలుసుకొనవలెను.

## ముఖ్య విషయములు

భావముల యొక్క ఫలితములు కొన్ని భావసంబంధిత గ్రహములవల్ల-మరికొన్ని లగ్నాదిగాగల స్థాన సంబంధములవల్ల కల్గుచుంటవి-భావమునకు స్థానమునకు గల భేదమును ముఖ్యముగా గుర్తించవలెను. స్థానమనునది 30డిగ్రీల పరిమితిగలది. భావము మాత్రము సుమారు 10డిగ్రీల పరిమితిగలది లగ్న, ద్వితీయ, తృతీయాదిగా గలస్థానములే భావములని భ్రమించుట తగదు.

1. నైసర్గిక శుభగ్రహములగు (బుధ) గురు, శుక్ర, పూర్ణచంద్రులు పాపగ్రహ సంబంధ రహితులై భావము నందుండుట లేక భావమును

చూచుటవల్ల ఆభావము బలము కల్గి దానికి దెలుపబడిన ఫలితములను పూర్తిగా నొసంగగలదు.

2. భావాధిపతిశుభుడైనను పాపియైనను - తన భావమునందుండుట చూచుటవలన భావము ఫలప్రదమగును.

3. భావాధిపతి-భావకారకుడు భావాధిపతియున్న రాశ్యధిపతియను వారు తమయొక్క స్వక్షేత్ర మూలత్రికోణ ఉచ్చ క్షేత్రములందుండిన యెడల భావము బలోపేత మగును.

4. పైమూడు గ్రహములు శుభగ్రహముల మధ్య నుండుట లేక భావనక్షత్రమునకు (జన్మ నక్షత్రము అనగా లగ్నభావ నక్షత్రము) సంపత్, క్షేమ, సాధన, మిత్ర, పరమమిత్ర తారల యందుండుట వలన భావము ఫలప్రదము కాగలదు.

5. పై మూడు గ్రహములు భావమునకు కేంద్ర కోణస్థానము లందున్నను-శుభగ్రహదీక్షితులైనను, స్వేచ్ఛ మూలత్రికోణాది వర్గులు పొంది యున్నను భావము బలవత్తరము కాగలదు.

6. భావాధిపతి పాపగ్రహ సంబంధరహితుడై శుభస్థానములందుగానీ, భావమునందుగానీ యుండగా లగ్నాత్ కేంద్రకోణస్థానములందు నైసర్గిక శుభగ్రహములున్న యెడల ఆ భావము బలోపేతమై సంపూర్ణ ఫలితముల నివ్వగలదు.

7. ముఖ్యముగా భావమునకు-భావాధిపతికి పాపగ్రహ సంబంధము లేక యున్న ఆ భావము ఫలప్రదము కాగలదు-కారకుడు కూడా పాపగ్రహ సంబంద వర్జితుడైన సంపూర్ణ ఫలదాయకమగును.

8. భావాధిపతిగానీ- ఆ భావాధిపతికి మిత్ర గ్రహములుగానీ, ఆ భావాధిపతియొక్క ఉచ్ఛ రాశ్యధిపతిగానీ- ఆ భావమునకు 2-3-11 స్థానములందున్న యెడల ఆ భావమునకు బలము ప్రాప్తించగలదు. అయితే ఆ 2-3-11 స్థానములాగ్రహములకు నీచ శత్రు క్షేత్రములై యుండకూడదు.

9. భావాధిపతి-కారకుడు లగ్నాదిగా గానీ భావాదిగా గానీ 6-8-12 స్థానములందున్న ఆ భావ ఫలితములు నశించగలవు.



10. పై రెండు గ్రహములు నీచ రాశులందు-శత్రు క్షేత్రములందు-వాటి అంశలయందు నుండినను-భావ నక్షత్రమునుండి లేక లగ్న భావ నక్షత్రమునుండి జన్మ విపత్, ప్రత్క్, నైధవతారా నక్షత్రము లందున్నను భావనాశనము కాగలదు.

11. భావమునందు 6-8-12 స్థానాధిపతులున్నను (భావ-లగ్నములకు) వారు చూచినను లేక పాపగ్రహములు భావమునందున్నను, వీక్షించినను-భావాధిపతి యొక్క నీచశత్రు రాశ్యధిపతులు భావము నందున్నను, చూచినను ఆ భావము ఫలహీనమగును.

12. ఏ భావాధిపతియైనను ఆ భావ కారకగ్రహమైనను, ఆ భావమునకు అష్టమస్థానము నందుండినను, అస్తంగతులైనను, నీచ-శత్రుస్థానము లందున్నను - పరాజయ స్థితి యందునన్నను, అట్టి భావము పరిపూర్ణ ముగా నాశనము కాగలడు.

13. భావమునందు శుభగ్రహములున్నను వాటి కాభావ రాశి శత్రుక్షేత్రమై యుండిన ఫలప్రదము కానేరదు.

14. భావమునందు బలవత్తరమగు గ్రహమున్నను, భావాదిపతి శత్రు నీచాస్తంగతాది దోషములు కల్గినగానీ లేక దుస్థాన స్థితుడై (6-8-12 స్థానములు) యుండినగానీ ఆ భావము ఫలప్రదముకాదు.

15. భావాధిపతి కాక ఇతర సంబంధిత గ్రహములు 6-8-12 స్థానములందున్నను, లేక పాప గ్రహాంశలయందున్నను ఆ రాశులు వారికి స్వక్షేత్రములై యుండిన యెడల శుభమునే ప్రసాదించగలరు.

16. భావాధిపతి యున్న రాశ్యధిపతి దుష్ట స్థానములందున్న భావము దుర్బలముకాగలదు.

17. భావము-భావాధిపతి, భావాధిపతియున్న రాశ్యధిపతి భావకారకుడు అను వారు శుభ-పాప మిశ్రమ సంబంధముకల్గి యున్నను, లేక భావమునకు కేంద్ర కోణస్థానములందు శుభ-పాప మిశ్రమగ్రహము లున్నను అట్టి భావముయొక్క ఫలితములుకూడా శుభా శుభమిశ్రమ ఫలదాయకములుగా నుండగలవు.

18. ఏ గ్రహమైనను భావ మధ్యముననున్న పూర్తి ఫల మొసంగును. భావ ఆరోహణ అవరోహణలయందున్న గ్రహములు వాటికి భావ మధ్యము నకు గల దూరముననుసరించి ఫలితము లివ్వగలవు. భావ సంధుల యందున్న గ్రహములు ఫలిత మొసంగజాలవు.

19. ప్రతి భావమునకు భావాధిపతికి-కారకునికి నైసర్గిక శుభగ్రహ దృష్టి-యుతి శుభమును-బలమును నొసంగ గలవు. పాపగ్రహదృష్టి-యుతి వల్ల భావము బలరహితమగును.

20. భావము-భావాధిపతి-కుపకార గ్రహములయొక్క దశ వర్గ బలానుసారముగా ఆ భావము యొక్క ఫలితములను గ్రహించవలెను.

## లగ్నాధి స్థానములు - అంగ విభాగము

ప్రతి జాతకునికి అతని జన్మలగ్నము శిరస్థానముగా దెలుపబడినది. అదేవిధముగా

| | |
|---|---|
| ద్వితీయ స్థానము - కుడికన్ను | ద్వాదశ స్థానము - ఎడమ కన్ను |
| తృతీయ స్థానము - కుడిచెడి | ఏకాదశము-ఎడమ చెవి |
| చతుర్థ స్థానము-కుడినాసారంధ్రము | దశమస్థానము-ఎడమనాసారంధ్రము |
| పంచమ స్థానము కుడి చెంప | నవమ స్థానము-ఎడమ చెంప |
| షష్ఠ స్థానపము కుడి మూతి | అష్టమ స్థానము-ఎడమ మూతి |
| సప్తమస్థానము నోరు - | ఈవిధము లగ్న ప్రథమ ద్రేక్కాణము నకు ఏర్పడగలవు. |

జన్మలగ్నము ద్వితీయ ద్రేక్కాణమునందున్న యెడల

| | |
|---|---|
| లగ్నం - కంఠము | ద్వితీయము-కుడి భుజములు శిరోదక్షిణభాగము |
| ద్వాదశస్థానము | ఎడమ శిరస్సు - ఎడమ భుజము |
| తృతీయ స్థానము | కుడి చెయ్యి ఏకాదశ స్థానము - ఎడమ చెయ్యి |
| చతుర్థ స్థానము | శరీర దక్షిణభాగము దశమ స్థానము శరీరవామభాగము |



| | |
|---|---|
| పంచమ స్థానము | హృదయ దక్షిణ భాగము (కుడి) |
| నవమస్థానము | హృదయవామభాగము (ఎడమ) |
| షష్ఠ స్థానము | పొట్ట యొక్క కుడివైపు |
| అష్టమస్థానము | పొట్టయొక్క ఎడమవైపు |
| సప్తమ స్థానము | నాభి (బొడ్డు) |

జన్మ లగ్నము తృతీయ ద్రేక్కాణమునందున్న యెడల - లగ్నము నాభికి దిగువ భాగమగును (పొత్తికడుపు)

ద్వితీయ స్థానము లింగ-గుదములు

| | |
|---|---|
| కుడిభాగము | ద్వాదశస్థానము-ఎడమభాగము |
| తృతీయ స్థానము-కుడి వృషణము | ఏకాదశస్థానము-ఎడమవృషణము |
| చతుర్థస్థానము-కుడి తొడ | దశమస్థానము-ఎడమ తొడ |
| పంచమ స్థానము-కుడి మోకాలు | నవమ స్థానము-ఎడమ మోకాలు |
| షష్ఠ స్థానము-కుడి పిక్క | అష్టమ స్థానము-ఎడమ పిక్క |
| సప్తమస్థానము పాదములు- | |

పైన దెలుపబడిన స్థానములందు నైసర్గిక పాప గ్రహములున్న యెడల ఆస్థానములందు వ్రణములు పుట్టగలవు. నైసర్గిక శుభులుండ వారికా స్థానములు స్వక్షేత్రాంశలైన యెడల పుట్టుమచ్చలుండగలవు. శత్రునీచరాశులైన అందవికారమగు మచ్చలుండ గలవు.

## దిక్ పరిజ్ఞానము

మేష-వృషభములు- రవి గ్రహము తూర్పు దిక్కును సూచించగలరు.
మిధునరాశి-శుక్రగ్రహము - ఆగ్నేయ విదిక్కును సూచించును.
కర్కాటక - సింహరాశులు - కుజగ్రహము దక్షిణ దిక్కును
కన్యారాశి - రాహుగ్రహము నైఋతి విదిక్కును.
తులా - వృశ్చిక రాశలు -శనిగ్రహము పశ్చిమ దిక్కును.
ధనూరాశి - చంద్రగ్రహము వాయువ్య విదిక్కును.
మకర - కుంభరాశులు బుధగ్రహము ఉత్తర దిక్కును.
మీనరాశి - గురుగ్రహము-ఈశాన్య విదిక్కును సూచించగలరు.
వివాహ-ఉద్యోగ-యాత్రా-స్థానచలనాదుల యందీ దిక్ పరిజ్ఞానమవసరము.

## భావముల ఫలసిద్ధి - కాల నిర్ణయము

లగ్నాధిగా గల ద్వాదశ భావములయొక్క ఫలితములు ప్రాప్తించు సమయమును గుర్తెరుంగుటకు గోచార ప్రకరణము తెలుసుకొనవలెను -ప్రతి సంవత్సరము గ్రహములు ఏ ఏ రాశులలో సంచరించునో ఆ గ్రహ సంచార మునే గోచారమని శాస్త్రములు దెల్పుచున్నవి. జాతకుని జన్మసమయము నందలి గ్రహములస్థితి-ఆయా సంవత్సరములందుగల గోచార గ్రహములస్థితి ననుసరించి సమస్తఫలితములు తెలుసుకొనవలెను. గోచార గ్రహస్థితిని పరిశీ లించక కేవలం జాతక గ్రహస్థితివల్ల ఏఫలితములు సంపూర్ణ ఫలసిద్ధి నందవు.

ఏ భావమునకు సంబంధించిన ఫలితమైనను ఫలించుటకు, (అనుభవ మునకు వచ్చుటకు) ఈక్రింది విధముగా జాతక-గోచార గ్రహస్థితి -యుతి దృష్టి అను త్రివిధ సంబందముల ననుసరించి ఫలకార నిర్ణయమొనర్చవలెను.

1. ఏ భావమునకైనను ఆ భావాధిపతియున్న రాశి కాక ఆ భావాధిపతి యొక్క నవాంశరాశులకు కోణస్థానములందు లగ్నాధిపతి గోచార సంచారము చేయుకాలము నందాభావ ఫలితములు ప్రాప్తించగలవు.
2. జన్మలగ్నాధిపతియున్న రాశి లేక లగ్నాధిపతి యొక్క నవాంశ రాశికి కోణ స్థానములందు ఆ భావాధిపతి గోచార సంచారము చేయు కాలము భావసిద్ధి కల్గును.
3. భావాధిపతి గోచార సంచారంలో లగ్నరాశి యందున్నప్పుడు భావ ఫలసిద్ధి కల్గును.
4. భావాధిపతి-లగ్నాధిపతి గోచారంలో లగ్నమునుండిగానీ- భావము నుండిగానీ శుభస్థానములలో (కేంద్ర-కోణములలో) కలిసి నప్పుడు లేక ఆ లగ్న భావాధిపతులు పరస్పర దృష్టినంది యున్న కాలము నందు భావ ఫలితములు ప్రాప్తించగలవు.
5. భావ కారకుడు-జన్మలగ్నాధిపతి గోచారంలో శుభ పాపములందు కలిసినను లేక పరస్పర వీక్షణ గలవారైనను భావఫలితము కల్గును.
6. ఏభావమునైనను ఆ భావాధిపతియున్నరాశి లేక నవాంశరాశికి కోణ స్థానములందు గోచార గురువు సంచరించుకాలమునందు ఆ భావ ఫలితములు ప్రాప్తించగలవు.



7. జన్మలగ్నాధిపతి గోచారసంచారమునందే భావాదిపతితో కలియునో ఆ సమయమునందా భావఫలితములు ప్రాప్తించగలవు. భావాధిపతి బలరహితుడైయున్న లగ్నాధిపతి గోచారంలో కల్గినను ఫలితము లివ్వజాలడు.
8. జన్మలగ్నము-చంద్రుడున్నరాశి (చంద్రలగ్నము) అనువానితో ఏది బలముగానుండునో ఆ రాశి ననుసరించి భావములు ఏర్పరుచవలెనని శాస్త్రనిర్ణయము-కొన్ని భావములకు రవియున్న రాశి కూడా ప్రాధాన్యత వహించ గలదు.
9. భావాధిపతి-జన్మలగ్నాధిపతి మిత్ర గ్రహములైన శుభఫలితములు శత్రుగ్రహములైన అశుభ ఫలితములు-సమగ్రహములైన సాధారణ ఫలితములు కలుగగలవు.
10. ఏ భావమునకైనను ఆ భావమునుండి 1-4-5-7-9-10 స్థానము లందున్న శుభగ్రహ దశాకాలములందు ఆ భావఫలితములు ప్రాప్తించ గలవు. మరియు భావాధిపతికి మిత్రగ్రహ దశ (శుభదశ లేక పాపదశ) యందు కూడా భావ ఫలితములు ప్రాప్తించ గలవు. భావమునుండి 3-6-11 స్థానములందున్న పాపగ్రహ దశలలో ఫలసిద్ధి.

## భావ నాశన సమయములు

1. ఏభావమునకైనను ఆ భావమునుండి 6-7-8 స్థానాధిపతుల దశల యందు ఆ భావమునకు నాశనము సంభవించగలదు-మరియు భావ మునకు 22వ ద్రేక్కాణాధిపతి దశ కూడా హానికరము.
2. జన్మలగ్న-చంద్ర లగ్నములనుండి తృతీయస్థానాధిపతి యొక్క దశా కాలము.
3. జన్మలగ్నము నుండి అష్టమాధిపతి దశ మరియు అష్టమస్థానమును వీక్షించు గ్రహదశ.
4. శని యొక్క దశాకాలము.
5. జన్మలగ్నము నుండి 22వ ద్రేక్కాణాధిపతి యొక్క దశ.



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

6. దుర్బలుడై (బలము లేక యుండి) పాపగ్రహ సంబంధము కల్గి 6-8-12 స్థానములందున్న రాహుదశ.
7. మాందీయను గ్రహమున్న రాశ్యధిపతి యొక్క దశ.
8. భావాధిపతి శత్రువైన గ్రహముయొక్క దశ.

పైవిధమగు దశాకాలములందు గోచారంలో జన్మలగ్నాదిగా గానీ, భావాదిగా గానీ 6-8-12 స్థానములందు లగ్నాధిపతి-భావాధిపతి, భావకారకుడు అనువారు సంచరించు కాలమునందా భావమునకు జెందిన విషయములకు హాని ప్రాప్తించగలదు-పై దశలయందు ఒక గ్రహమునకు రెండాధిపత్యములు కల్గినయెడల అందు ఆ గ్రహముయొక్క మూల త్రికోణ రాశి సంబంధమగు ఫలితములను ఆదశయొక్క మొదటిభాగమందు, స్వక్షేత్ర రాశి సంబంధ ఫలితములను దశలోని రెండవ భాగమునందు యిచ్చును.

అష్టక వర్గమునందు శుభ బిందువులు లేనట్టి లేక తక్కువగా నున్నట్టి గ్రహము తన దశయందు-తనకు సంబంధించిన భావములకు హాని యొనర్చును. జాతకునికి సంబంధించిన విషయములను జన్మలగ్న భావము నుండి వరుసగా పది రెండు భావముల వలన గ్రహించవలెను. ఇదే విధముగా ఏ భావమునకు సంబంధించిన విషయములైనను ఆ భావము నుండి వరుసగా పది రెండు భావములగును.

ఉదాహరణ :- సోదరులు 3వ భావము- ఆ సోదరులవిద్య లగ్నాధి 6వస్థానము- సోదరుని ఆయువు లగ్నాధిదశమ స్థానము - తండ్రి 9వ భావము. తండ్రి యొక్క వృత్తి గౌరవాదులు లగ్నాది షష్ఠ స్థానము-తండ్రి యొక్క ఆయుర్దాయము లగ్నాది చతుర్థ స్థానమునుండి గ్రహించవలెను.

ఈ విధముగా పది రెండు భాగములకు సంబంధించిన విషయములను-వాటికి సంబంధించిన భావాదిన, భావకారక, భావాధిపస్థితి రాశ్యధిపతులను మూడు గ్రహములయొక్క బలాబలముల ననుసరించి, చక్కని ఆలోచనాపటిమ-బుద్ధికుశలతలతో నిదానముగా నిర్ణయించుకొనవలెను. ముఖ్యముగా, లగ్న, చతుర్థ, అష్టమ, నవమ, దశమ భావాధిపతులు బలము కల్గియుండిన జాతకునికి లోటు వుండదు.



# 1. తను (లగ్న) భావ ఫలితములు

లగ్న భావము అన్ని భావములకు ప్రాణమువంటిది. ఈ భావము భావాధిపతి బలయుక్తమై యుండిన ఇతర భావములకేర్పడు దోషములు కొన్ని పరిహరించబడగలవు. లగ్న భావమునుండి జాతకుని యొక్క రూపము-రంగు శరీర పరిమాణము, గుణము, తేజస్సు, బలాబలములు, సుఖాసుఖములు, అందము, ఆత్మశక్తి, నీతిజ్ఞత, ఆయువు అను విషయములు ముఖ్యముగా తెలుసుకొనదగి యున్నది.

లగ్నాధిపతి, అతడున్న నవాంశ రాశ్యధిపతి అను గ్రహముల బలాబలముల ననుసరించి జాతకుని లక్షణములను-(లగ్నాస్థుడైన బలవద్గ్రహముద్వారా) చంద్రుడున్న రాశ్యధిపతి, నవాంశాధిపతుల ద్వారా జాతకుని రంగు, ప్రత్యేక లక్షణములు తెలుసుకొనవలెను.

అస్తంగతాది, దోషములులేని లగ్నాధిపతి తనకు నీచశత్రు క్షేత్రములు గాని కేంద్రకోణ స్థానములందున్నను లేక లగ్నమందొక శుభగ్రహముండి లగ్నాధిపతి ఉచ్చరాశి యందుండగా అష్టమాధిపతి కేంద్ర స్థానములందు లేక యుండిన యెడల జాతకుడు శుభ లక్షణములుగల శరీరుడు. చిరంజీవి, రూపవంతుడు, మంచి ఆరోగ్యము గలవాడు, నిర్భయుడు, పవిత్ర శీలము గలవాడు, గౌరవమర్యాదలు, ధనదాన్య సంపదలు, రాజసత్కారములు గలవాడునై సుఖ సంతోషములతో కూడిన కుటుంబ జీవితము గడుపగలడు.

జన్మలగ్నాధిపతికి శుభ సంబంధములు కల్గిన శుభ జీవనము కల్గును. పాప సంబంధము గల్గిన క్లిష్ట జీవనము కల్గును. మిశ్రమగ్రహ సంబంధముచే మిశ్రమ జీవనము ప్రాప్తించగలదు-సంబంధమనగా, (స్థితి,యుతి,దృష్టి) లగ్నాధిపతితో కలిసిన గ్రహము ఉచ్ఛయందున్న రాజుకాగలడు. లేక దేశ విఖ్యాతి పురుషుడు కాగలడు-లగ్నాధిపతితో కలిసిన గ్రహము లేక లగ్నాధి పతిని చూచు గ్రహము స్థిర రాశియందున్న స్థిరమగు నివాసము కలవా డగును. చరరాశి యందున్న సదా సంచార జీవనుడగును. ద్విస్వభావ రాశియందున్న మిశ్రమ ఫలితములు కల్గును మరియు లగ్నాధిపతి ఏవిధమగు దోషములులేక యున్న కీర్తి కలవాడగును. శుభగ్రహ రాశులయందున్న సుఖవంతుడై అభివృద్ధి నందగలడు-పాపగ్రహ రాశుల యందు లేక 6-8-12. స్థానములందు నుండిన దుఃఖ బాజనుడై శ్రమదాయకమగు జీవితము గల్గి యుండును. శత్రు, నీచస్థానములందున్న తనకు విలువలేని స్థానములందు-దుష్టుల మధ్య నికృష్ట జీవనుడై యుండగలడు. అయితే లగ్నాధిపతియున్న రాశ్యధిపతి, సూర్యగ్రహము, లగ్నాధిపతితో కలిసిన గ్రహము. లేక చూచు గ్రహములు బలయుక్తులైయున్న శుభఫలితములే ప్రాప్తించగలవు.

1. లగ్నాధిపతి, లగ్నభావము, భావకారకుడు రవి. వీరితో సంబంధించిన ఇతర గ్రహములు బలయుక్తులై-దోషములు లేక యుండిన జాతకుడు అభివృద్ధికరమైన ఉత్తమ ఫలితములు పొందగలడు.
2. పై గ్రహములలో కొన్ని మాత్రమే బలముకల్గి నిర్దోషమైయున్న మధ్యమ ఫలితములు.
3. పై గ్రహములలో ఒక్క గ్రహము మాత్రమే బలయుతమై దోషరహితమై యుండిన అధమ ఫలితములు కల్గును.
4. పై గ్రహములన్నియు ఏదో ఒక కారణమువల్ల అనగా బలమునుండి దోష సంబంధితులగుట లేక దోషములు లేక బలహీనులై యుండుట సంభవించిన యెడల అట్టి జాతకునికి అధ మాధమ ఫలితములు ప్రాప్తించగలవు.



5. జలరాశులగు కర్కాటక-వృశ్చిక, మకర, మీనరాశులు లగ్నభావములై యుండి అందు శుభగ్రహమున్నను, లేక పై జలరాశులలో లగ్నాధిపతి యుండి శుభగ్రహముతో కలసినను స్థూలదేహమేర్పడగలదు.
6. లగ్నభావము శుభగ్రహ రాశియై లగ్నాధిపతియున్న నవాంశ రాశ్యధిపతి జలరాశులలో నున్నయెడల స్థూలదేహమేర్పడగలదు.
7. లగ్న భావమునందు రవి, చంద్ర, బుధ, గురు, శుక్రులలోనే గ్రహమున్నను లేక ఈ గ్రహములచే లగ్నము చూపబడినను సుందర దేహుడు కాగలడు.
8. శని-రాహువులు లగ్నమందున్నను లగ్నమును జూచినను నలుపు వర్ణముగల దేహ మేర్పడగలదు.
9. కుజ, కేతువులు, లగ్నమందున్నను, లగ్నమును జూచినను చామన ఛాయ వర్ణ దేహుడగును కానీ చర్మ వ్యాధులచే పీడించబడును.
10. లగ్నమందు మిశ్రమ గ్రహములున్నను, ఆ గ్రహములు చూచినను మిశ్రమమగు దేహ ఛాయ ఏర్పడగలదు.
11. లగ్న భావమునకు గురు-శుక్ర సంబంధముచే (యుతి-దృష్టి) శ్లేష్మ తత్త్వముగల శరీరమగును. శని-చంద్రుల సంబంధమువలన వాత తత్త్వము రవి-బుధుల వలన పిత్త తత్త్వము, కుజ, కేతువుల వలన ఉష్ణ తత్త్వము ఏర్పడగలదు.
12. లగ్న భావమునకు శని (రవి) గురుల సంబంధము కల్గిన సత్త్వ గుణమున్ను, కుజ-రాహువుల సంబంధమువల్ల తమోగుణమున్ను కేతు సంబంధముచే ఆధ్యాత్మిక జిజ్ఞాసయు, రవి, చంద్ర, బుధ, శుక్రుల సంబంధముచే రాజస గుణమున్ను జాతకునికి ప్రాప్తించగలవు.
13. లగ్న భావమునకు చంద్ర-శనుల సంబంధము కల్గుటచేత జాతకుని శరీరావయవములు స్థూలమై యుండగలవు. (పుష్టి వంతమగు శరీరము) రవి, బుధ, గురువుల సంబంధముచే మధ్యమ దేహ సౌష్టవ మేర్పడగలదు. కుజ, శుక్ర, రాహు, కేతువుల సంబంధము కల్గిన కృశించిన అవయవ లక్షణములు కల్గును.

14. లగ్న భావాధిపతి కేంద్ర, త్రికోణ, ఉచ్చ. మిత్రనవాంశ లయందున్నను లేక శుభ గ్రహములతో కలసి అరిష్టేతర స్థానము లందున్నను, లేక శుభగ్రహములు లగ్న భావమునందున్నను లగ్నమును జూచినను జాతకునికి దేహ సౌఖ్యము మిక్కుటముగా నుండగలదు.

15. లగ్న భావాధిపతి బలహీనుడై లగ్నమునందు పాప గ్రహము లున్నను-చూచినను లగ్ననవాంశాధిపతి దుస్థానములందున్నను, భావము బలహీనమై కారకుడు దోష సంబంధములు కల్గియున్నను శరీర సౌఖ్యముండదు.

16. లగ్న భావము-భావాధిపతి బలహీనములై యుండగా భావమునందు బలయుక్తుడైన శనియున్న చూచిన వాతరోగ పీడితులు కాగలరు. పై విధముగా కుజుడున్నను, చూచినను ఆయుధ-వ్రణ, స్ఫోటక, అగ్ని పీడితులు కాగలరు. లేక మేహరోగ బాధ నందగలరు.

17. లగ్న భావము శని ద్రేక్కాణముగానుండి, భావము, భావాధిపతి కారకుడు అను ముగ్గురిలో ఏ ఇరువురైనను బలహీనులై యుండగా భావమునందు శని గ్రహము కుజునితో గానీ-రాహువుతోగానీ యుతి నందిన (కలిసియున్న) జాతకునికి కుంటితనము ప్రాప్తించగలదు.

18. లగ్న భావమునందు రవి - రాహువులు కలిసియుండి శుభగ్రహ సంబంధములేకుండిన పొడవగు శరీరము చిన్నతల. పెద్ద దంతములు కల్గి వికారరూపము నందగలరు.

19. హ్రస్వరాశులగు మేష, వృషభ, కుంభములు, లగ్న భావముగా నుండి అందు కుజ-రాహువులున్నను లేక భావాధిపతి హ్రస్వరాశుల యం దుండి కుజ-రాహువుల ఇరువురిచే చూడబడుచున్నను జాతకుని దేహము పొట్టిదగును.

20. దీర్ఘరాశులగు సింహ-కన్యాతుల, వృశ్చికములు, లగ్నభావముగా నుండి-అందు రవి - బుధులున్నను, లేక భావాధిపతి దీర్ఘ రాశుల యందుండి రవి, బుధుల దృష్టి నందినను పొడవగు దేహము కల్గును.

21. సమాన రాశులగు మిదున, కర్కాటక, ధనూ, మకర, మీనరాశులు లగ్నభావముగా నుండి అందు గురు, చంద్రులున్నను, లేక భావాది పతిపై రాశులయందుండి చంద్ర గురులచే చూడబడుచున్నను సమదేహ మేర్పడగలదు.



22. లగ్న భావాధిపతికి 12వ రాశియందున్న గ్రహము ఉచ్చ లేక మిత్ర గ్రహరాశియగు వ్యయభావము (12రాశి) నందున్న లేక వ్యయ భావమునందుండి మిత్ర గ్రహముచే చూడబడుచున్నను, లేక ఉచ్ఛనందిన గ్రహవీక్షణ కల్గినను, లగ్నాధిపతికి మిత్ర క్షేత్రమునందున్న గ్రహము చూచుచున్నను జాతకుడు జన్మస్థలమందే యుండు వాడగను.

23. లగ్నాధిపతికి 12వ రాశ్యధిపతి రవితో యుతినంది (అస్తంగతుడై) యుండిన జాతకుడు గ్రామమునందు నివాసముండగలడు. అస్తంగతు డైనను బలముకల్గియున్న ఆ గ్రామము ధనిక గ్రామమై యుండగలదు.

24. లగ్న భావాధిపతికి ద్వాదశ రాశ్యధిపతి యగుగ్రహము లగ్నాధిగా కేంద్ర కోణములందు ఉచ్చస్థితి, మిత్రక్షేత్ర స్థితి, లేక శుభగ్రహ మధ్యస్థుడై యున్నను, జాతకుడు రమణీయ ప్రదేశములందు-నగరములందు నివసించగలడు.

25. లగ్నాధిపతి యున్నరాశికి వ్యయరాశ్యధిపతికి గురు-చంద్ర-శుక్రులలో నెవ్వరి దృష్టికల్గినను మహోన్నత సుందర పట్టణములందు నివసించగలడు.

26. లగ్న భావాధిపతి యున్న రాశికి పది రెండవ రాశ్యధిపతి లగ్నాధిపతికి రెండవరాశిలో నుండి శత్రుక్షేత్ర స్థితికల్గిన జాతకుడు తన జన్మస్థల మందే సామాన్య జీవనము గడుపు వాడగును.

27. స్థిర రాశి (వృషభ, సింహ, వృశ్చిక, కుంభములు) లగ్నభావమై యుండి, స్థిరరాశియందున్న గ్రహవీక్షణ నందినను లేక లగ్నభావాధిపతి స్థిరరాశి యందుండి స్థిర రాశులయందున్న గ్రహములచే చూడబడుచున్నను, జాతకుడు తన జన్మస్థలమందే నివశింపుచు ధన భాగ్యములు కల్గి యుండగలడు.

28. చర రాశులు (మేష, కటక, తులా, మకరములు) లగ్న భావముగా నుండి, చర రాశులయందున్న గ్రహ వీక్షణ పొందియున్నను, లేక లగ్నభావాధిపతి చరరాశులయందుండి చర రాశులయందున్న గ్రహముల దృష్టినందిన జాతకుడు విదేశములయందు నివసించ గలడు.

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

29. లగ్నాధిపతియున్న రాశికి పది రెండవ రాశ్యధిపతి లగ్నాధిపతికి శత్రు గ్రహమైనను, బలరహితుడైనను, లేక నీచస్థితి యందున్నను, విదేశములకు వెళ్ళువాడగును. ఈ పైవిధముగానున్న గ్రహము తనకు మిత్రుడైన శుక్రునియొక్క దృష్టి నందియున్న జాతకుడు విదేశములందే స్థిరనివాస మేర్పరుచుకొనగలడు.

30. శుభగ్రహ సంబంధములేని లగ్నభావమునందనేక పాపగ్రహములున్న (అధిక పాపగ్రహములు) లేక భావము శుభగ్రహ సంబంధ రహితమై-కారకునితో యుతినందిన లగ్నాధిపతి అధిక పాపగ్రహ సంబంధము పొందినను జాతకుడు జననాదిగా జీవితాంతము వరకు కష్టములు పొందువాడగును.

31. శుభగ్రహ రాశి లగ్నభావమై-శుభగ్రహ దృష్టి కల్గియుండినను-లేక లగ్నాధిపతి శుభగ్రహ రాశులలో స్థితికల్గి శుభ సంబంధితుడై కారకునికి శుభయుతి కల్గినను జాతకుడు బాల్యమునుండి ఆజన్మాంతము సుఖములను పొందగలడు.

32. లగ్నభావము నందొక శుభగ్రహము. ద్వితీయ మరియు కేంద్ర స్థానములందు పాపగ్రహములుండగా లగ్నాధిపతికి ఉత్తమాంశ కల్గిన (దశవర్గులలో 3 స్వవర్గులు కల్గుట) యెడల బాల్య జీవితము దుఃఖ భాజనమై క్రమశః సుఖజీవము కల్గును.

33. లగ్న భావమునకు శుభగ్రహ దృష్టియుండి-శుక్రుడు "దేవలోకాంశ యందు" లగ్నాధిపతి గోపురాంశయందు నుండిన యెడల- మధ్య జీవితమునందు, అంత్యజీవితమునందు సుఖములు పొందును.

34. లగ్నభావాధిపతి యున్న నవాంశరాశ్యధిపతి లగ్నాధిగా కేంద్రము నందుగానీ, ఏకాదశమునందుగానీ, ఉచ్చరాశి యందుగానీ యుండిన జాతకుడు తన 30వ సంవత్సరము వయసు దాటిన పిమ్మట సుఖజీవితము పొందగలడు.

35. లగ్న భావాధిపతి శుభగ్రహ రాశి యందుండి శుభగ్రహ వీక్షితుడై యున్నను, లేక గోపురాంశ యందున్నను పదునారు సంవత్సరముల ప్రాయమునుండి సుఖజీవితము ప్రాప్తించగలదు.



## రాశి సంబధిత రూప గుణాదులు

### 1. మేషరాశి



మేషరాశి లగ్నభావమై బలము కల్గియుండిన జాతకులు మధ్యమ దేహము, విశాలమగుముఖము, పెద్దతల, గుండ్రని నేత్రములు, ఒత్తగు కనుబొమ్మలు, సన్నని చిబుకము (గడ్డము) పొడవైన కంఠము నిశితమగు చూపులు కలిగియుండగలరు. శరీరమునందు ప్రాణశక్తి, వేడి అధికముగా నుంటవి. కొలదిగా ఉగ్రత్వము-చపత చిత్తము నుండగలవు. పనులయందు చొరవ అధికము స్వతంత్ర భావములు, తెలివితేటలు అధికము-ఆటలయందు ఆసిక్తియుండ గలదు- సహనమును కోల్పోవుట ఏ విషయమునందైనను దూరదృష్టి లేక ప్రవర్తించుట, తనకు తానుగా తాను చేయవలసిన పనిని నిర్ణయించుకొనలేకపోవుట; ఏ విషయమునందు దీర్ఘకాలము ఏకాగ్రత లేక యుండుట అనేక విషయములందు తలదూర్చి దేనియందు తగిన ఫలితమును పొందలేక పోవుట ఈ జాతకుల యొక్క బలహీనతలుగా గుర్తించవలెను.

ఉన్నది ఉన్నట్లు మాట్లాడు స్వభావము-ఉద్రేకము జెందుచుండ గలరు. కొలదిగా కలమస్వభావము, కయ్యములకు కాలుదువ్వు గుణము అత్యాశ-ఈర్ష్య, లోభిగుణము లుండగలవు. ఎదుటివారు చెప్పునది వినకుండా ముందుగా తామే మాట్లాడు చుండగలరు. కోపము, అంతర్గత భయము తండ్రి తోటి విభేదములు-విదేశములకు వెళ్ళవలెననెడి కోరిక - గొప్ప వారగుటకు తాపత్రయపడుట వుండగలవు. ధనమును దుబారాగా ఖర్చుజేయు చుండెదరు-తమన నివాసములందు - జీవన విధానములందు తరచుగా మార్పులను ఆకాంక్షింపు చూడగలరు-దయ, దాన, ధర్మముల నాచరించు ఆసక్తి కల్గియుండగలరు. బాల్యదశ బాగుండదు. యేవనము నందు సుఖలాలసత కల్గియుండగలరు. జీవిత మధ్యభాగం కష్టమయము చివరి జీవితంలో సుఖశాంతులు పొందగలరు. సామాజిక వ్యవస్థయందు మంచి స్నేహితులు కల్గి, ఉన్నవ్యక్తుల ఆదరాభిమానములు లభించగలవు.



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

నిద్రాలోపము, చర్మము, మూత్రపిండములు, మెదడునక సంబంధించిన రోగబాధలు పొందగలరు–ఉష్ణ ప్రకోపముద్వారా జ్వరాదులు కురుపులు కల్గుచుంటవి. ఆయుధములు–అగ్ని ప్రమాదములు, ఎలక్ట్రిసిటి ద్వారా ప్రమాద సూచన లుండగలవు.

## 2. వృషభ రాశి



వృషభరాశి లగ్నభావమై బలము కల్గియుండిన యెడల అట్టి జాతకులు మధ్యమ దేహముగల వారగుదురు. విశాలమగు ముఖము, లావుగునుండు మెడ నల్లని శిరోజములు, బలిసినకండరములు, బలిష్టమగు తొడలు, కాంతికల్గిన నేత్రములు, సుందరమగు రూపము, బలహీనమగు కంఠ– హృదయములు కల్గి యుండగలరు–పెడసర స్వభావము. ఆత్మస్తుతి అధికము. పనులయందు బద్ధక ముండగలదు. క్షమాగుణము ఉదార హృదయము, ఓర్పు, నేర్పులుండగలవు. స్త్రీలయంఉ, సంగీతములు నందు, ఆభరణము లందు, మక్కువ కల్గి యుండగలరు. వీరికి ఇతరుల సలహాలు గిట్టవు. తమకు తోచినవిధముగా నడచుచుండెదరు – పనులయందు తొందర పాటు లేక విధానముగా – నేర్పుగా తమపనులు నెరవేర్చు కొనెదరు. స్నేహితులధికముగా నుండగలరు – ఆశాజీవులు కోపము అధికము అయినా దానిని పైకి వ్యక్తపరుచరు – ఆర్థిక విషయములందు చాలా ముందుచూపు కల్గి ప్రవర్తించగలరు–మధ్య మధ్య ఆకస్మికలాభములు కల్గుచుంటవి.

అతినిగూఢమగు మనస్తత్వము–వీరహృదయమునందలి విషయము లను తెలుసుకొనుట బహుదుస్తరము–ఆప్త మిత్రులకు–భార్యకు కూడా రహస్య విషయములు తెలియనీయరు–పట్టుదల అధికము– అందరియందు చాలా ఉదారంగా ప్రవర్తిస్తుంటారు–వీరికి కోపము–పగ ఏర్పడిన అది జీవితాంతం కొనసాగ గలదు. వ్యవసాయాభిరుచి అధికము. లలిత కళల యందు ప్రవేశముండగలదు. కొలదిగా స్వార్థముండగలదు. ఇతరులను గురించి ఆలోచించక తమ అవసరములకు ప్రాధాన్య మివ్వగలరు. అన్ని విషయము



లందు తమకొక ప్రత్యేకత ఏర్పరుచుకొను చుండెదరు. వీరి యెదుట మరొకరిని అధికముగా జూచిన వీరు సహింపజాలరు. బుద్ధి సూక్ష్మత, ఆలోచనాశక్తి, వ్యవహార పరిజ్ఞానముకల్గి యుండగలరు. స్త్రీ మూలకముగా ధనసంపదలు ప్రాప్తించగలవు. పశుసంపద–భూములు ఏర్పడగలవు. బాల్యదశయందు కష్టములధికముగా నుంటవి, యౌవనదశ సామాన్యము జీవితమునందలి మధ్యమ చివరిభాగములయందు సుఖసౌఖ్యానందములు ప్రాప్తించగలవు. వ్యవసాయము లేక వృత్తి ఉద్యోగముల ద్వారా ధనార్జన గావించగలరు. ప్రౌఢదశయందు గొప్పప్రేమ ప్రతిష్టలు పొందగలరు. కఫ ప్రకోపం అధికంగా వుంటుంది జీర్ణకోశము, కంఠము, స్వరము, పృష్ఠ భాగములకు సంబంధించిన బాధలు పొందుచుండ గలరు. వాతావరణ మార్పులవల్ల సంభవించు అనారోగ్యములధికము–వెన్నుపూస కాలేయము–మూత్రపిండములకు ప్రమాద సూచనలుండగలవు.

## 3. మిథున రాశి



మిథునరాశి లగ్నభావమై బలము కల్గియుండిన యెడల అట్టి జాతకులు పొడవైన నిటారుగల దేహము గలవారగుదురు. చామన చాయ రంగు పొడవైన చేతులు, సన్నని పాదములు, నిశితమగు చూపులు–పొడవైన ముక్కు కల్గి యుండగలరు. వీరు అల్పసంతోషులు, చమత్కారమగు సంభాషణలు చేయుచు ఇతరులను తమవైపున కాకరించుకొనగలరు. ఇతరుల మనోగతాభిప్రాయములను గ్రహించి తదను గుణ్యముగా ప్రవర్తింపు చుండెదరు. ఏ విషయమునైనను తాను బాగా అర్థము చేసుకొనుటయేగాక దానిని ఇతరుల కర్థమగు రీతిలో బోధపరచగల నైపుణ్యముండగలదు. బుద్ధి సూక్ష్మత అధికము–వ్రాతయందు నైపుణ్యముండగలదు. ఏ విషయమునైనను ఇతరులతో చక్కగా చర్చించగలరు. ఏవిద్య యందును పరిపూర్ణత యుండదు. శారీరక, మానసిక చురుకుదనములున్నప్పటికీ ఏ వృత్తియందు ఎక్కువకాలము కొనసాగలేరు. వీరు స్వతంత్రముగా చేయుపనులు ఫలితమునకు రాకముందే వదలివేయుచుందురు. ఇతరుల కార్యములను తుదివరకు సాధించి



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

విజయమును గాంచగలరు. అనుసంధాన కర్తలుగా రాణించగలరు. దూత కృత్యములు నిర్వహించుట యందు సామర్థ్యముండగలదు. నమ్రత, వినయము,వివేకము, దయ కలవారు, వీరిని ఆదుకొనెడి మిత్రులు, బంధువులు, అధికముగా నుండగలరు. ప్రయాణాసక్తి గలవారు– సామాన్య ముగా స్నేహ పాత్రులైనప్పటికీ కొన్ని సమయములందు స్వామిద్రోహమునకు వెనుకాడని మనస్తత్త్వము–కుటిలోపాయములు పన్నుటయందు నేర్పుగలవారు. అప్పుడప్పుడు కొన్ని వ్యతిరేక మార్గములందు నడచు చుండగలరు.

అనుకరణ–అనుసరణీయ శక్తి అధికముగా వుంటుంది–అందరికి అనుకూలముగా మెలగుచుండగలరు. వ్యాపారమునందు మక్కువ అధికము. ఆర్థిక విషయములు సరిగానుండవు. స్థిరత్వములేని ధన సంపాదన కలవారగుదురు. కొన్ని సందర్భములలో అతిక్లిష్టమగు ఆర్థిక ఇబ్బందుల నెదుర్కొన గలరు. అన్ని విషయములు తమకేనన్న ధోరణిలో ప్రవర్తిస్తుంటారు. మతరసము సామాజిక పరమునైన కార్యములందు పనిచేయుటకు ఆసక్తి కల్గియుండగలరు. తమ జీవిత విషయములందు ఇతరుల విషయములందు కూడా తొందరపాటు నిర్ణయములు తీసుకొనుచుండగలరు. జీవితంలో అవరోధములధికముగా నుంటవి. ఎవరితోడనైనను సంబంధములు పెంచుకొనునప్పుడు అవతలివారు నిరాదించుట జరిగిన వారికి దూరమగు చుండగలరు. కుటుంబ వ్యవహారములవల్ల నిరంతరము మానసికాందోళన– విచారము ప్రాప్తింపు చుండగలవు. ఏకారణములచేనైనను వీరు తమ జీవితాభివృద్ధి కవసరమగు ఉత్తమావకాశములను కోల్పోవగలరు. స్థల మార్పులుండగలవు. వ్యసనములకు బానిసలు కాగల అవకాశములుంటవి. ప్రయాస అధికంగాను ఫలితం స్వల్పంగాను వుంటూవుంటవి. వీరు యౌవన దశయందు, ప్రౌఢ దశ ప్రారంభమునందు మాత్రమే సుఖ సౌఖ్యానందములు పొందగలరు. వృద్ధాప్యదశ బాగుండదు నరములు, చేతులు, ముంజేతులు, శిరస్సు, ఊపిరితిత్తులు, అండములకు సంబంధించిన బాధలు కల్గుచుంటవి, మనోవ్యధ అధికము,నత్తి,చెవుడు,న్యుమోనియా,ప్లూరసి,క్షయవంటి వ్యాధులవలన ప్రమాద సూచనలుండ గలవు. జీవితం మొత్తంమీద ఉచ్ఛ – నీచలు చవిచూడగలరు.చివరకు అక్కరకు వచ్చేవారు గానీ – మిగిలేదీ గానీ ఏమీవుండదు.





## 4. కర్కాటక రాశి

కర్కాటక లగ్నభావమై బలము కల్గియుండిన జాతకులు మధ్యమ దేహము కల్గియుందురు (లేక పొట్టిగానుందురు) శరీరము నందలి పైభాగ మధికముగాను–క్రింది భాగము తక్కువగాను నుండగలదు. విశాలమగుముఖము. పెద్దనోరు, దృఢమగు కంఠము, ఉన్నతమగు నడుము, అందమగు పలువరుస, వీరికుండగలవు. గంభీరమగు మితభాషణ చేయ గలరు. శాంతముగానే యుండి ఆకస్మికముగా కోపమును జెంది స్వల్ప కాలములోనే తిరిగి శాంతమునందు చుండగలరు. ఉద్రేకపూరితమగు మనస్తత్వము–ఇతరులు చేయు విమర్శలను సహించలేరు. సున్నితమగు మనస్తత్త్వము–పరిస్థితులకను కూలముగా నడచుకొను స్వభావము కల్గి యుండెదరు. బాగా కలుపుగోలు తనముగా వుండగలరు. అధికమగు బుద్ధి బలము–మేధాశక్తి యుండగలవు. ఏపనియందు స్థిరత్వముండదు. చంచల చిత్తము కొలదిగా కపట స్వభావము–మోసపూరిత భావములు నుండగలవు ఆకస్మిక పరిస్థితులు కల్గినప్పుడు తప్ప ఇతర సమయములందు సుళ్ళువిడువని పట్టుదల గంభీరత్వము నిగ్రహము కల్గి యుండగలరు. ఇతరుల విషయము లలో అనవసరంగా జోక్యము కల్పించుకొనరు. తనచేతలను ఇతరుల యెదుట ప్రదర్శించవలెనను ఆసక్తి అధికము, చిత్ర–విచిత్రమగు వస్తు సేకరణయందు ప్రీతి పరిశుభ్ర వస్త్రధారణ, ధర్మకార్యాచరణ, భూతదయ, కల్గి యుండగలరు ఓర్పు అధికము–దైవ భక్తి–ధైర్యసాహసములు–పట్టుదలగల స్వభావములుండ గలవు–స్త్రీల యందభిమాన మధికము–వస్తు వస్త్రాభరణ భోగ సౌఖ్యముల యందు కోరికలుండగలవు. స్నేహవర్గము–శత్రువర్గము కూడా నుండగలరు.

కర్కాటక లగ్న జాతకులు స్వతంత్ర భావములు కల్గి యుండగలరు. తమకు నచ్చునిదే ఏపనియు చేయరు. తాము నిర్ణయించుకొన్న హద్దులకు లోబడి తమ వృత్తులు కొనసాగించగలరు. అందరితోడను సఖ్యతగా యుండ వలెనని ప్రయత్నింపుచున్నను అనూహ్యముగా కొందరితోటి విరోధములు ప్రాప్తింపుచుంటవి. తద్వారా శత్రుబాధలు కలుగగలవు. పురుషులకు స్త్రీల

ద్వారా శత్రుత్వము స్త్రీలకు పురుషులద్వారా శత్రుత్వము కల్గును. ఆదర్శవంతమగు జీవిత విధానముల నాకాంక్షింపుచు – గౌరవమర్యాదలు కల్గి వర్తించగలరు. వీరి జీవితము చంద్రునివలె వృద్ధి క్షయములు కలిగి వుంటుంది. ధనార్జనకొరకు చాలా శ్రమపడవలసి వుంటుంది. వీరికి బాల్యదశ సుఖ సౌఖ్యములున్నను అనారోగ్యములతో కూడి వుంటుంది. యౌవనంలో మిశ్రమ ఫలితములుండగలవు. ప్రౌఢ దశ ప్రారంభం కష్టదాయకంగా వుంటుంది. క్రమశః అభివృద్ధి కలుగగలదు జీవితంలోని చివరిభాగం సుఖ సౌఖ్యములతో కూడి వుంటుంది. మానసిక సంబంధమగు బాధలు, అశాంతి జీవితాంతము నుండగలవు. పొట్ట, రొమ్ము, జీర్ణకోశము, మెదడు, నరములకు సంబంధించిన బాధలు కల్గుచుంటవి. పక్షవాతము, చిన్నబిడ్డ నొప్పి, కాన్సర్, హిస్టీరియా, ఉబ్బసము, వరిబీజము, రక్తవిరేచనములు, మూర్ఛ, ఉన్మాదము, నంజు, నీరు, వంటి వ్యాధులవలన ప్రమాద సూచనలుండగలవు. మెదడు యొక్క నరములు బలహీనము లగుటవలన మతిమరపు సంభవించగల అవకాశములుండ గలవు.

### 5. సింహ రాశి



సింహరాశి లగ్నభావమై బలము కల్గి యుండిన జాతకులు చక్కని అంగసౌష్టవము గల ఉన్నత దేహముకల్గి యుండగలరు. విశాలమగు గంభీర ముఖము, పింగళివర్ణ నేత్రములు, స్థూలమగు గడ్డము, దవడలు, పొడగు కాళ్ళు, చేతులు, కల్గియుండగలరు. (ఈ రాశియొక్క మూడవ ద్రేక్కాణమునకు పొట్టి దేహముండగలదు) బలము, బీజశ్శక్తి, మనోధైర్యము, దర్పము, ఠీవి, కల్గి యుండగలరు. స్వాభిమానము, కొలదిగా గర్వము, మార్పుజెందని స్థిరమగు భావములు, దయా దాక్షిణ్యములుండగలవు. విశాలహృదయము కపటములేని స్వభావము ఉన్నది ఉన్నట్లుగా నిర్మొగమాటముగా మాట్లాడుట, స్నేహశీలత వీరి గుణములు– శత్రువులతో కూడా తగాదాపడని మనస్తత్త్వము – నీచకార్యము లందనహ్యాము–అతిచిన్న విషయములకు కూడా కోపమును జెందుట యుండగలవు. కష్టములు కల్గినప్పుడు ఆత్మస్థైర్యముతోటి వాటి నెదుర్కొని



ఉపాయముతో వాటి బారినుండి తప్పుకొనెడి తెలివితేటలుండ గలవు. చక్కని వాక్చాతుర్యము గలవారు. మనసునందలి విషయము ధారాళముగా మాట్లాడగలరు. ఎల్లవేళలయందు పరిశుభ్రముగాను ఉన్నతముగాను, నుండగలరు. తమను నమ్మినవారికి యధోచిత సహాయ, సహకారములనిచ్చి న్యాయము చేకూర్చగలరు. తనయందు తనకే నమ్మకము లోపించి వుంటుంది. కుటుంబ విషయములందు అంతగా శ్రద్ధయుండదు. వనములు, పర్వతారణ్యములయందు సంచరించుటకు, వ్యవసాయ, వ్యాపారములందు మక్కువ కల్గియుండగలరు. అధికమగు స్త్రీ సౌఖ్యమును కోరుకొను చుండెదరు. ధైర్యము అధిక సాహసములుంటవి, మంచి స్నేహితులుండి అక్కరకు రాగలరు. బంధువర్గము దూరముగా నుండ గలరు. శత్రువులు కూడా అధికంగానే వుంటారు. అయితే ప్రత్యక్షంగా వీరినేమియు చేయజాలరు ఉన్నత వ్యక్తులచే గౌరవించబడగల సంస్కార వంతులు కాగలరు. సామాజిక పేరు ప్రతిష్టలు. కీర్తి, దాతృత్వము, ధర్మ కార్యాచరణ, సామాజిక, సేవలు ప్రాప్తించగలవు.

సింహలగ్నముగల జాతకులు సత్ప్రవర్తన నీతి–నిజాయితీలుగల వారు. నిర్మొగమాటముగా నుండగలరు. ఏ ప్రలోభములకు ఇతరులకు లొంగిపోవని స్వభావము. ముక్కుకు సూటిగా ప్రవర్తిస్తుంటారు. వీరికి మనసులోని మాటదాగదు. దర్జా–దర్పము, ప్రదర్శింపుచు ఇతరులపై అధికారము చెలాయింపు చుండగలరు. తమకు పూర్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యములు కల్గిన అధికారయుతమగు వృత్తి, ఉద్యోగ, వ్యాపారాదులు కల్గి యుండగలరు. తక్కువస్థాయి గల ఉద్యోగములు వృత్తులు వీరికి గిట్టవు. యాజమాన్యము వహింపదగిన స్థితిని ఆకాంక్షింపుచుండెదరు. నిశ్చలమగు మనస్తత్త్వము తండ్రి వర్గీయులగు బంధువులతో సత్సంబంధములుండవు. తమయొక్క గొప్పతనమును చాటుకొనుటకై అమితముగా ధనము వ్యయపరచు చుండగలరు. పర్యాటనలు, యాత్రలు, దైవకార్యములయందు మక్కువ అధికము బాల్య, యౌవనదశలు సరిగా నుండవు. ప్రౌఢ దశ ప్రారంభం కూడా మిశ్రమ ఫలితములే వుంటవి. సుమారు 50 సం॥దాటిన పిమ్మట సుఖసౌఖ్యానందములు పొందగలరు. గుండె, కీళ్ళు, నడుము, దంతములు, వీపు, వెన్నెముకలకు సంబంధించిన బాధలు కల్గుచుంటవి.

మూత్రాశయము, ప్లీహము, రక్తము, హృదయము (గుండె) లకు సంబంధించిన ప్రమాదములు కల్గు సూచనలుండగలవు.

### 6. కన్యా రాశి



కన్యారాశి లగ్నభావమై బలము కల్గి యుండిన జాతకులు పొడవైన సన్ననిదేహము కల్గియుండును. (ఇందలి ప్రథమ ద్రేక్కాణమునకు పొడవు ద్వితీయ ద్రేక్కాణమునకు సమదేహము, తృతీయ ద్రేక్కాణ మునకు పొట్టి దేహములుండును) కృశించిన భుజములు, నల్లనినేత్రములు, దట్టమైన వెంట్రుకలతో కూడి వంపుదిరిగిన కనుబొమ్మలు, సన్నని కంఠస్వరము, వేగముగల్గిన స్త్రీలను బోలిన నడక, కల్గి వయసుతక్కు వారివలె కనుపించగలరు. ప్రతి విషయమునందు జాగ్రత్త అధికముగా వుంటుంది. సిగ్గుతో కూడిన చూపులుంటవి. మంచితెలివి తేటలుకల్గి ముందుచూపుతో పనులు చేయుచుండగలరు. పరుల కష్టములు బాధలు గుర్తించకుండా మొగమాటములేని విధముగా ప్రవర్తిస్తుంటారు. వీరికి అధికమగు దురాశ యుండగలదు. ఇతరుల తప్పులను , లోపములను వ్రేలెత్తి చూపుటయందు ఘనత వహించగలరు. పైకి చెప్పు మాటలకు, ఆచరించు పనులకు సంబంధముండదు. తమ స్వభావమును గురించి ఇతరులకు తెలియనీయక ప్రియమగు మాటలు పల్కుచు ఇతరులచే తమ పనులు చేయించుకొనుటలో నైపుణ్యము గల్గియుండగలరు. యెటువంటి దుస్సాధ్యమైన విషయమైనను చాకచక్యముగా సాధించగలరు. వర్చస్సు, అందము, కీర్తి, వినయ, వివేకములు కల్గి యుండగలరు. మిత్రులుండగలరు. వారిని తమ స్వప్రయోజనములకు వినియోగించు కొనగలరు. శత్రువలు చాలాతక్కువగా వుంటారు. ఇతరుల ధన సంపదల ననుభవించవలెనను కోరిక యుండును. పరగృహ వాసము, పరాన్నభోజనము, పరధనము, పరస్త్రీ పొందుయందు మక్కువ అధికము. సంచార ప్రియులు, దైవభక్తి యున్నను స్వార్థపూరితమై యుండగలదు. శాస్త్రార్థసారమును గుర్తించగలరు. సారస్వత, సంగీత, చిత్రకళాభిమానములుంటవి. ప్రత్యక్షముగా గౌరవించబడి పరోక్షముగా అందరిచేత ద్వేషింపబడగలరు.



కన్యాలగ్న జాతకులాచరించు పనులు నిర్మాణాత్మకముగా నుండ గలవు. న్యాయ విషయములందు అభిమానము కల్గియున్నను, ప్రతి విషయమును విభజించి వేరుపరచి క్లిష్టతరముగావించు స్వభావముండ గలదు. దయాగుణము తక్కువ తమకు గిట్టనివారికి అపకారమొనర్చు నైజముండగలదు. సహజంగా కోపము తక్కువ, అయినను కొన్ని సందర్భము లలో అధికకోపమును జెంది ఒడలుతెలియని విధముగా ప్రవర్తింగలరు. బంధువులు, స్నేహితులవలన ఉపయోగములుండవు. తమ భవిష్యత్ జీవితమునకు కావలసిన సోపానములు నిర్మించుకొనగలరు. స్వయంకృషి వలన రాణించగలరు. భార్యాబిడ్డలతో సంసార జీవితము గడుపుచున్నను పరస్త్రీలకొరకు ప్రాకులాడు చుండగలరు. వ్యవసాయము-వ్యాపారము వృత్తికల్గి వుంటారు-లేక భూసంబంధితవృత్తులు, వ్యాపార సంస్థలలో ఉద్యోగములు నుండగలవు. వడ్డీ వ్యాపారములద్వారా లేక అభివృద్ధికరమైన ఆర్థిక పెట్టుబడులద్వారా బాగా లాభించగలరు. బాల్యదశలో ఆరోగ్య లోపములుండగలవు. వయసు పెరిగేకొలది శరీరము దృఢపడగలదు. యౌవనదశలో భోగలాలసత అధికము, ప్రౌఢదశలో మంచి సంపాదనాపరులై సుఖసౌఖ్యములు పొందగలరు. వృద్ధాప్యము నందు కష్టములు-శరీర బాధలువుంటవి. నరములు, జీర్ణకోశము, మలకోశము, బొడ్డు, వెన్నెముక క్రిందిభాగము, కాలేయము, ఊపిరితిత్తులకు, సంబంధించిన బాధలు ప్రాప్తింపుచుంటవి. మొలలు, విరేచనములు, (బంక-రక్త), ఆంత్రశూల, మధుమేహము వంటి వ్యాధుల ద్వారా ప్రమాదముల నెదుర్కొనవలసి ఉంటుంది. ఈ జాతకులకు మలబద్ధకము జీవితాంతము పీడించగలదు.

### 7. తులా రాశి



తులా రాశి లగ్నభావమై బలము కల్గియుండిన జాతకులు పొడవైన సన్ననిదేహము కల్గియుండ గలరు. శరీరమునకు తగిన విధముగా కొంచెం పొడవగు బలమైన అవయవములు, పొడవైన ముఖము, చామన ఛాయ రంగు, (రెండవ ద్రేక్కాణమైన అందము, మూడవ ద్రేక్కాణమైన వికృతము) చిరు మందహాసమగు ముఖము, కొనదేరిన ముక్కు

కల్గి యుందురు.(వయసు మీరిన పిదప బట్టతల ఏర్పడగలదు) సున్నిత మనస్తత్త్వము, కొలదిగా భయస్వభావము, పనులయందు నిదానమధికము. సోమరితన ముండగలదు, వీరికి గొప్ప ఆలోచనాశక్తి, మంచి ఆదర్శములు, పెద్దలయందు, పవిత్ర జనులయందు గౌరవభావము, దైవభక్తి, ధార్మిక చింతన, పరోపరారబుద్ధి యుండగలవు. ఏ విషయమునందైనను ఒక స్థిర నిర్ణయమును త్వరగా చేసికొనలేరు. ఇతరులు పన్ను మాయోపాయములలో త్వరితముగా చిక్కుకొనగలరు. బాధలకు కష్టములకు తాళజాలరు, హాస్యమునందు ప్రీతి, కళలయందభిమానము, సంగీతమునందు మక్కువ కొంత ప్రవేశమునుండగలవు, స్నేహపాత్రులు, అందితోడను కలుపుగోలు తనముగా ప్రవర్తించగలరు. స్వాతిశయము,డాంబికత్వము అలంకారము లందు ప్రీతి అధికము- వీరికి పరద్రవ్యా పేక్షయుండదు. ఏపనినైనను న్యాయస్వభావముతో చేయుచుండెదరు. అతిత్వరితముగా కోపము చెందుచుండగలరు. అయినను వెంటనే శాంతమువహించగలరు. ఉన్నత వ్యక్తుల సహాయసానుభూతులుంటవి. వీరిది మృదుస్వభావము. కొంతచపల చిత్తముండగలదు. గొప్పమేధాశక్తిగలవారు. శుచి,శుభ్రత, మతకార్యక్రమ ములు పాటింపుచు విచ్చలవిడిగా ధనవ్యయము గావించగలరు. (తృతీయ ద్రేక్కణమైన లోభిగుణముండగలదు) అతిధి అభ్యాగతుల నాదరించగలరు. చక్కగా మాట్లాడగలరు, వ్యాపారనైపుణ్యముండును, లాభదాయకమగు వృత్తుల నెన్నుకొని జీవించగలరు. కొన్నిసందర్భాలలో స్నేహదోషాదులవలన నీచబుద్ధులుకల్గి దుష్టప్రవర్తన జెందగలరు. బంధువర్గములనుండి సానుభూతి, సహకారములుండవు. ప్రయాణములందుప్రీతి అధికము ఇట్టివారికి రెండువిధములగు వ్యవహారనామములుండగలవు. కొంతకాలము ధనసమృద్ధికల్గియు మరికొంతకాలము ధన ఇబ్బందులు కల్గియునుండగలరు.

తులా లగ్నజాతకులు దయార్ద్రహృదయముగల ప్రేమస్వభావులు విశాలహృదయులు పెద్దమనిషి తరహాకల్గి గౌరవ మర్యాదలకొరకు పాటుపడగలరు. తెలివితేటలు, చురుకుదనము వ్యవహార దక్షతలుంటవి. శారీరకముగా ధృఢత్వముండదు. తమ ఆరోగ్యమును గురించి తీవ్రమగు ఆందోళనచెందు స్వభావములు వ్యాపార భాగస్వామ్యముల వలన లేక స్త్రీ ధనము (భార్యఆస్తి) వలన వీరు ఐశ్వర్యవంతులు కాగలరు. మతపరమైన చట్టపరమైన వ్యతిరేకుల వలన కొన్ని బాధలుండగలవు. తొందరబాటుతనము, ఆత్మస్థైర్యము లేకపోవుట, దుబారాఖర్చులు వీరి బలహీనతలు. బాల్యదశ చిలిపి చేష్టలు కల్గివుంటుంది. యౌవనదశలో మిశ్రమ ఫలితములుంటవి. ప్రౌఢదశయందు (వివాహానంతరము) ధనార్జనాపరులై సుఖసౌఖ్యములు పొందగలరు. వృద్ధాప్యమునందు శుభాశుభ మిశ్రమఫలితములు పొందగలరు. శిరస్సు జీర్ణకోశము గర్భాశయము వెన్నుపూస, చెవులు, నడుము, మూత్రపిండములకు సంబంధించిన బాధలు కల్గుచుంటవి. మలబద్ధకము శోష(నీరసం) మధుమేహము మూత్రనిరోధము కిడ్నీలకు, సంబంధించిన వ్యాధులద్వారా ప్రమాద సూచనలుండగలవు. స్త్రీలకు ప్రసవకాలములందు ప్రమాదములుండగలవు.

## 8. వృశ్చిక రాశి



వృశ్చికరాశి లగ్నభావమై బలముకల్గి యుండిన జాతకములు బలయుక్తమగు ఉన్నతదేహము కల్గియుందురు. విశాలమగు ముఖము సుందరమగు రూపము విశాలములై గుండ్రమగు నేత్రములు వెడల్పుగల వక్షస్థలము గుండ్రని తొడలు, పిక్కలు చివరిభాగం అణగియున్న ముక్కు లోతైనపొట్ట ఎత్తైనదవడలు పొడవైన బాహువులు కల్గియుండగలరు. దృఢమగు స్వభావము ఇతరులను చిన్నచూపుచూసి హేళనజేయు గుణము-అందరికన్నా తానే గొప్పవాడనను భావము- ముక్కోపము, అధికస్వార్థ చింతనలుండగలవు. వీరిప్రవర్తన సరసముగా నుండదు. కలహములకు కాలుదువ్వుచుండగలరు. క్రూరకృత్యములయందాసక్తి, రహస్యమగు విషయములను తెలుసుకొనవలెను. ఆతురత కపటబుద్ధి యుండగలవు. సందర్భోచితముగా జీవితమునందు నటించగలరు. తల్లితండ్రులైనను గురువులు పెద్దలైనను మిత్రులనుకూడా తమకు ఉపయోగించరని తలచిన వదలి వేయగలరు. తమకుపయోగపడు వారినధికాభిమానముగా జూచెదరు. వీరికి ఇంటా - బైటా కూడా

శత్రువులధికముగా నుండగలరు. ఇతరులకు భయము కల్గువిధముగా ప్రవర్తించగలరు. ప్రతిచిన్న విషయమునకు కోపము జెందుచుండగలరు. తాముతెల్పిన అభిప్రాయములతో ఏకీభవించని వారెవరైనను వారియెడల ద్వేషభావము వహించియుండెదరు వీరిమాటలు సూటిగాను కొంచెం కఠినముగాను నుండగలవు. పట్టుదల అధికము ముందుచూపు వ్యవహార జ్ఞానములుండవు. ధనార్జనయందు చాకచక్యము కల్గియుండెదరు తమపైకల్గు విమర్శలను సహింపజాలరు. ధైర్యము చురుకుదనము కల్గియున్నను ఒక్కొక్కప్పుడు మందబుద్ధులై పిరికితనము కల్గియుండగలరు. తల్లితండ్రులకు దూరముకాగలరు. సామాజిక గౌరవమర్యాదలుండగలవు. కొన్ని నీతినియమ ములకు కట్టుబడి యుండెదరు. సనాతనత్వము ఆధ్యాత్మిక చింతన భక్తి డాంబికముగా నుండగలవు. విద్యావంతుడై వ్యవసాయ ఉద్యోగాదులు జీవనములే కల్గి యుండగలడు. వీరికి వృద్ధాప్య లక్షణములు త్వరగా ప్రాప్తించగలవు.

వృశ్చికలగ్న జాతకులు బహుశక్తియుక్తులుకల్గి–కార్యసామర్థ్యము గలవారై యున్నను వీరిది సంకుచిత మనస్తత్వము, తమకు గిట్టనివారి యెడలకుట్ర, మోసములద్వారా ప్రతీకారము తీర్చుకొనెదరు. ఆవేశమెక్కువ సంగీత సాహిత్యాదులయందు ప్రీతి. వీరుబాగా ఆర్థికలాభములు పొందగలరు. అయినా ధనార్జనయందు ఆశ అత్యధికము, ఈలగ్న జాతకులకు ఐశ్వర్యమెంత అధికముగానున్నను తృప్తివుండదు, జీవిత ప్రథమదశలో శ్రమ అధికము వీరి తెలివితేటలు గుర్తింపబడుట జరుగదు. 36 సం॥ తరువాత మాత్రమే వీరుజీవితంలో రాణించగలరు. 42 సం॥ తరువాత గొప్ప అదృష్టవంతులు కాగలరు. అంత్యదశ విషాదకంగా వుంటుంది. మూత్రశయము, గుహ్యావయవములు,తొడలకు సంబంధించిన బాధలు కల్గుతుంటవి. అంటువ్యాధులు, క్రిమివ్యాధులు వీరిని త్వరగా దరిచేరగల అవకాశములు గలవు. జ్వరములు గాయమువలన బాధలుంటూ వుంటవి. వాతావరణ మార్పులు నీటి మార్పులవల్ల శీఘ్రముగా అనారోగ్యములు ప్రాప్తించగల అవకాశములు అధికముగా నుండగలవు. గుప్త శత్రువుల వలన ప్రాణాపాయ పరిస్థితులు సంభవించగల ప్రమాద సూచనలుండగలవు.



## 9. ధనూ రాశి



ధనూరాశి లగ్నభావమై బలముకల్గియుండిన జాతకులు చక్కని సౌష్టవమగు అవయవములుగల్గిన పొడవగు దేహము కల్గియుందురు. గుండ్రని లేక కోలముఖము వెడల్పుగలనుదురు, దట్టమగు కనుబొమ్మలు కాంతివంతమగు నేత్రములు, పొడవగుమెడ, ముక్కు, పెద్దవగుచెవులు, పుష్టిగల భుజములు, ఎత్తైనపిరుదులు, లావుగలతొడలు, వెడల్పుగల చెక్కిళ్ళు కల్గియుండగలరు. (వృషభ,కన్యా, తులానవాంశలుకల్గిన ఎత్తు తక్కువ దేహము, లావైననడుము, పెద్దపొట్ట, చిన్న నేత్రములు వుండగలవు) వీరి మానసిక ప్రవర్తన స్థిమిగానుండక క్షణక్షణము మారుచుండగలదు. ఇతరులు గ్రహింపలేని మనోప్రవృత్తి యుండగలదు. త్వరితముగా కోపమును జెందుచుండగలరు, చక్కని వాక్చాతుర్యముకల్గి ఉన్నదున్నట్లు మాట్లాడు చుండగలరు. ఏవిషయమునైనను సులువుగా గ్రహింపగలరు, దయా దాక్షిణ్యములు కల్గియుండెదరు. పరులకుపకారమొనర్చు గుణముండగలదు. కుటిలవర్తనము వీరికిగిట్టదు. ఆడంబరములు గిట్టవు ఆటపాటలయందు, సంగీత సాహిత్యములందు మక్కువయుండగలదు, తనకుటుంబము నందనురాగము కల్గియుండెదరు. సరియైనకారణము లేకుండా ఎవ్వరినీ నమ్మజాలరు, పనులయందు బద్ధకము, అలసత్వము అధికముగా నుంటవి చురుకైన బుద్ధిబలము, ఆలోచనాశక్తి, ధైర్యము కల్గియుండగలరు. ఎవరినీ లెక్కచేయరు ఆత్మబలంతో స్వతంత్ర నిర్ణయాలుగైకొని నీతిమార్గంలో న్యాయబద్ధంగా ప్రవర్తించగలరు, ధార్మిక బుద్ధియుండగలదు. దైవభక్తి యుండును. శాస్త్రపరిజ్ఞానము, విద్యా వివేకములు ప్రాప్తించగలవు. పనులయందు నేర్పరితనము సజ్జనసహసము ప్రపంచ జ్ఞానము కల్గియుండగలరు. దయార్ద్రహృదయముకల్గి గౌరవ మర్యాదలు పొందుచుండ గలరు. వీరియొక్క ప్రేమ–వాత్సల్యములు పైకి బహిర్గతములు కావు. మాటలలోను, చేతలలోను కొంతతొందరతనమున్నను తరువాత సరిదిద్దుకొనగలరు. ఇతరులకు మంచి



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

సలహాలనిచ్చుటలో ప్రతిభయుండ గలదు, శత్రువులు అధికంగానే వుంటారు. కానీ తమ సహజసిద్ధమైన మంచితనము దయాగుణము వలనశత్రువర్గమును లొంగదీసుకొనగలరు. ఏవృత్తినైనను సమర్ధవంతముగాను చాకచక్యముగాను నిర్వహించి పేరుగడించగలరు, స్వార్జితధనముతోపాటు పూర్వీకుల ఐశ్వర్యమును కూడా వృద్ధిపరచగలరు.

ధనూలగ్న జాతకులకు ప్రయాణములందు విహారములందు తీర్థయాత్రలయందు ప్రీతి అధికము స్థిరాస్తులందు మోజుతక్కువ, ఆభరణములు గృహము మొదలగువాని యెడల నిర్లిప్తత కల్గివుంటారు. తమయొక్క ఉనికిని గౌరవమర్యాదలను కాపాడుకొనుచు సమాజమునందు ఉన్నత వ్యక్తులయొక్క గౌరవాభిమానములు పొందగలరు. ఆర్థిక పురోభివృద్ధికి జరుపు కార్యక్రమములు ఫలించగలవు. బాల్యంలో అరిష్టములు, అనారోగ్యములు అధికము. యౌవనదశలో విద్యార్జనగావించి లోకజ్ఞానమును పొందగలరు. కౌమారదశలో కష్టసుఖములు సమానంగానుంటవి. ప్రౌఢ దశలోను చివరిదశలోను ఖ్యాతి సుఖభోగానందములు. ప్రాప్తించగలవు. నరముల బలహీనత - పిర్రలు తొడలు కండరములు ఊపిరితిత్తులకు సంబంధించిన బాధలు ప్రాప్తింపుచుంటవి. కీళ్ళవ్యాధులు-శ్వాసకోశవ్యాధుల వలన ఆకస్మిక ప్రమాదములు సంభవించగల అవకాశములుండగలవు.

## 10. మకర రాశి



మరకరాశి లగ్నభావమై బలము కల్గియుండిన జాతకము. సన్నని బలహీనమగు మధ్యమదేహము కల్గియుండగలరు. గుండ్రని లేక జింక వంటి ముఖము లోతైనకండ్లు ఉబికియున్న సన్నని నుదురు, పెద్దముక్కు ముతుక శిరోజములు పొడవగు భుజములు నలుపురంగు ఛాయకల్గియుండగలరు. (ఈ రాశిప్రథమ ద్రేక్కాణమైన నడుమునుండి క్రిందిభాగము అధికపొడవు కల్గి యుండును. ద్వితీయ ద్రేక్కాణమైన కంఠశిరో భాగములు పొడవై యుండగలవు. తృతీయ ద్రేక్కాణమైన నడుముకు కంఠమునకు మధ్యభాగము పొడవుకల్గియుండును)



వీరు అత్యాశగలవారు. పిసిరినారితనమధికము, ఏదో ఒక లాభము లేనిదే ఖర్చుచేయుటకిష్టపడరు, భేషజము డాంబిక ప్రవృత్తియుండగలవు. అన్ని విషయములందు తమకే విధముగా లాభము చేకూరుననియే యోచింపుచుండెదరు. కొన్ని సందర్భములలో లజ్జావిహీనులై ప్రవర్తించగలరు. విద్యలో రాణింపుతక్కువగా వుంటుంది. బహుముఖ ప్రపంచ జ్ఞానముకల్గును. ఏవిషయమునైనను సులువుగా గ్రహించగలరు. పరిస్థితుల కనుగుణ్యముగా తమవృత్తులు నిర్వహించుకొనెడి నైపుణ్యముయుండగలదు. ఇతరుల ఆదరణ సామాజిక పలుకుబడి పొందుటకు తగిన మార్గములనన్వేషింపుచుండెదరు. ఏ విషయమునందైనను ముందుకు దూకు స్వభావముండగలదు. ఎత్తుగడలువేయుచు, ఇతరుల అభివృద్ధికి ఈర్ష్యనందుట యుండగలరు, కొలదిగా కోపస్వభావులు తమకు ప్రయోజనము చేకూరే విషయములైన యెడల అకృత్యముకైనను వెనుకాడరు. మితవ్యయము అధికలాభముగల పనులనే ఎన్నుకొనుచుండెదరు. ధనసంబంధమైన విషయములందు అతిజాగ్రత్తకల్గి మెలగగలరు. అన్నిపనులయందు నేర్పరితనముండగలదు. కఠినము-చతురత్వముగల వీరి మనోధర్మము కొన్ని పరిస్థితులకుచలించి జీవనసరళిని మార్చివేయగలదు, పిత్రార్జితము లేక స్వయంకృషివల్ల గొప్ప భాగ్యవంతులుకాగలరు. బంధువర్గము, మిత్రవర్గములనుండి అనేక కష్టములు పొందగలరు. దైవభక్తి యున్నను అది స్వార్థపూరితముగా వుంటుంది. కఠినమైన శరీర పరిశ్రమయుండగలదు. వ్యవసాయము కాంట్రాక్టు వ్యాపారములు పోలీసు సైనికశాఖలందు ఉద్యోగములువంటి జీవనాధారములు కల్గియుండగలరు.

మకరలగ్న జాతకముల తామసప్రవృతికల్గి వుంటారు. ఏవిషయము నందైనను బాగా తరచిచూచిగానీ నిర్ణయములు గైకొనరు. సోదర వర్గమునందు సయోద్యతలుండవు దుష్టజన సహవాసములు, జూదము, మద్యపానము, వ్యభిచారము వంటి వ్యసనములుండగలవు. కుటుంబము నందనురాగయుక్తులై యుండగలరు. సంతానముద్వారా బాధలు ప్రాప్తించ గలవు. బాల్యయౌవన దశలు సుఖవిలాసములతో నుండగలదు. కౌమార ప్రౌఢదశలు కష్టములధికముగా నుంటవి. ప్రౌఢదశ చివరిభాగంనుండి చివరిజీవితం వరకు సుఖసౌఖ్యాలు పొందగలరు. చర్మము, కీళ్ళు, జీర్ణకోశము



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

నరములకు సంబంధించిన బాధలు కల్గుచుంటవి. పైత్యము, జలుబు వంటివి కూడా తరుచుగా బాధించవచ్చును. రక్తదోషమువలన కల్గు వ్యాధులు ద్వారా వాతాధిక్యతవలన మరియు ఉన్మాదము ద్వారా ప్రమాద సూచనలుండ గలవు.

### 11. కుంభ రాశి



కుంభరాశి లగ్నభావమై బలముకల్గియుండిన జాతకులు బలమైన పొడవగు దేహము కల్గియుందురు. (ఈలగ్నమునందలి మొదటి హోరలో పొడవు బలమగుశరీరము, రెండవహోరలో కృశించిన పొట్టి శరీరము కల్గును) గుండ్రని ముఖము, ఎర్రబారిన లేక నిర్లిప్తతతో కూడిన నేత్రములు, బలముగల దవడలు దట్టమైన శిరోజములు పొడవగుగోళ్ళు, పెద్ద పాదములు, పెద్ద దంతములు ముందుకు వంగిన భుజములు, లోతుకుపోయిన కడుపు- వ్యత్యస్త మైన నడకకల్గియుండగలరు. వీరికి డాబులు షోకులు దర్పములు అధికముగానుంటవి. అందరితోకలసి మెలిసియుండగలరు. ఇతరుల మనో భావములను అతిసులువుగా గ్రహించగలరు. జ్ఞాపకశక్తి అధికము, కార్యసాధనాపాటవము గట్టిపట్టుదల, అధికకోపము సోమరి తనములుండ గలవు. దయాగుణముండగలదు. ఇతరులకష్టములు తమవిగా భావించి యధోచితసహాయము చేయచుండగలరు. శాస్త్రీయమైన సత్యాన్వేషణ కొరకు ప్రయత్నింపుచుండెదరు. ఏ విషయమునందైనను పూర్వాపర సందర్భములు పరిశీలించిగానీ కార్యరంగమునదిగరు, వీరి మంచితనము ప్రేమ పైకి కనిపించదు. చూచువారలకు ధూర్తులవలెను ఉద్రేకపరులవలెను కనుపించగలరు. విద్యావిఘ్నములుండగలవు. అయిననుగట్టి పట్టుదల కృషి యొనర్చి విద్యావంతులుకాగలరు, మతపరమగు విద్యలు, విచిత్రవిద్యలు కీలక విషయములయందాసక్తి అధికము, దైవభక్తి కూడా అధికంగానే వుంటుంది. వీరి మాటలు కొంచెం పెళుసుగానుంటవి, బలము, ధైర్య సాహసములుంటవి. స్నేహబలముండగలదు. వీరి మానసికస్థితి కొన్నివేళల యందు ప్రేమపూరితమై అతికోమలముగానుండగలదు. మరికొన్ని వేళలయందు తెలియని ఆవేశంతో అతికఠినముగా మారుచుండ గలరు. మాటలతో విరోధాన్ని మనసుతో



మంచితనాన్ని పొందగలరు. వ్యవసాయము, వ్యాపారము, ఉద్యోగమువంటి వృత్తులు కల్గియుండగలరు. సుగంధ ద్రవ్యములు, పుష్పములు అలంకార సామాగ్రియందు మక్కువ అధికము. స్త్రీ సౌఖ్యమునకై ఆరాటపడగలరు. భార్యావిధేయత్వముండగలదు. కళత్రమూలకమగు విచారమునందగలరు.

కుంభలగ్న జాతకులు ఎంతటి గొప్పవారైనప్పటికీ అవమానములు పొందుట లేక అపవాదులనందుట తప్పదు. మత్తుపదార్థములు సేవించుట వ్యసనములకు బానిసలగుటకల్గును, విదేశ ప్రయాణముల లందభిలాష యుండును. సంగీత సాహిత్య లలితకళాభినముండగలదు. మిత్రులవలన స్త్రీలవలన ప్రయోజనములు పొందుచుండగలరు. పట్టణనివాసము, వననాగరిక విధానములు, నాగరిక గృహములు, వాహనములందు ప్రీతి, ఆసక్తి అధికముగా నుంటవి, సాంఘిక కార్యక్రమములు మతపరమగు కార్యక్రమములు నిర్వహించగలరు. దీనివలన కొంత ఆర్థిక నష్టములు పొందగలరు-ఆత్మశక్తిగల శ్రమజీవులుగా రాణించగలరు. న్యాయస్థానములు న్యాయవాదులు, న్యాయాధికారులతో సంబంధము కల్గియుండెదరు. అదృష్టదేవత వీరికి కొంచెం దూరంగా వుంటూ వుంటుంది. బాల్యదశలో అరిష్టాలు, కుటుంబ పరిస్థితులు సరిగానుండవు, యౌవనంలో విద్యకొరకు శ్రమనందగలరు. కౌమారదశలో జీవిత స్థిరత్వముకొరకై ఆరాటము, జీవితమార్పులు మిశ్రమఫలితాలు ప్రౌఢదశలో స్వయంకృషివలన ధనార్జనగావించి సుఖసౌఖ్యములనంద గలరు. నేత్రములు, నరములు, గుండె, కాళ్ళు, చీలమండలు, గొంతు, ఊపిరితిత్తులకు సంబంధించిన బాధలుండ గలవు. బి.పి. దంతవ్యాధులు, క్షయ - హృద్రోగము - లివరు రక్త ప్రసారలోపములకు సంబంధించిన ప్రమాద సూచనలుండగలవు.

### 12. మీన రాశి



మీనరాశి లగ్నభావమై బలము కల్గియుండిన జాతకులు ప్రకాశవంతము-బలహీనమగు సమదేహము కల్గియుందురు, చేతులు పాదములు మాత్రము, పుష్టికరముగా నుండగలవు. (మొదటి హోరలో పొట్టిదేహము, రెండవ హోరలో పొడవు)

సమమగు శిరస్సు వెడల్పుగల ముఖము, విశాలమగు నొసలు పొడవగుముక్కు, తేనెరంగు నేత్రములు పొడవుగల కాళ్ళు, పొట్టిమెడ, సన్నని నడుము, మంచి దంతములు కల్గియుండగలరు. వీరి ఆలోచనాశక్తి గొప్పది. భావోద్రేకములధికము ఆత్మశక్తి  బుద్ధిబలము, విజ్ఞానశక్తి, ప్రేమ, దయ ఔదార్యము కల్గియుండగలరు. మృదువగు మాటలుండును. వాగ్ధాటిగలవారు, తమ అభిప్రాయములను అతిత్వరగా మార్చుకొనుచుండెదరు, వృధాకాలయాపన గావింపక ఏదో ఒకపని చేయుచుండెదరు సానుభూతితో కూడిన అమాయకత్వమును వీరిలో ప్రతిబింబిస్తుంటుంది. ఇతరులను తేలికగానమ్మి వారివలన మోసపోవు చుండగలరు. ధార్మిక బుద్ధిగలవారు. మూఢభక్తి, దైవచింతన లుండగలవు. పరోపకార పరాయణులు, మతాభిమానమధికము, వేద-వేదాంత శాస్త్రపరిజ్ఞానముండగలరు. శాస్త్రములందు, కళలయందు కొంత ప్రావీణ్య ముండగలదు. గ్రంథరచాన కౌశలము గలవారు, విద్యావంతులు కాగలరు. సహజముగా శాంతమూర్తులు, కొన్నిసందర్భములలో అధికకోపము జెందినను వెనువెంటనే శాంత చిత్తులుకాగలరు. న్యాయ స్వభావమును విడచుటకు ఇష్టపడరు. సదాచారవర్తనులై యుండగలరు. పనులలో చురుకుతనము నేర్పరితనము లుంటవి. కార్యసాధనయందు ఆశక్తి కల్గియుండగలరు. ధైర్యముగలవారు, జీవించుటయందు ఓర్పు, నేర్పు,ప్రదర్శించగలరు. అభిమానవంతులు ఆస్థిరబుద్ధి యుండుటవలన, ఏమిచేయవలెనో సమయమునకు తగిన విధముగా నిర్ణయించుకొనలేరు. ఎప్పటికప్పుడుపరిస్థితులపై ఆధారపడి జీవించగలరు. ధనార్జనయందు చాకచక్యము ప్రదర్శించి భాగ్యవంతులు కాగలరు. వీరికి వృధా ధనవ్యయం కూడా అధికంగా వుంటుంది. తమను కీర్తించువారికి ముందు వెనుకలాలోచించకుండా దానధర్మాలు గావించగలరు. ఆకస్మికముగా గానీ లేక నిధి నిక్షేపములు ప్రాప్తించుట వలనగానీ ధనవృద్ధి నందగలరు-ప్రశాంత జీవనము నభిలషింపుచున్నను, అది వీరికి ప్రాప్తించుట దుర్లభము, రహస్యశత్రువులధికంగా నుండగలరు. వారివలన ఆటంకములు-నష్టములు అధికంగానుంటవి.

మీనలగ్న జాతకులు మెత్తనివారు. సాధువులుగా కనుపించగలరు. కానీ పట్టుదల గలవారు నిలకడలేని జీవన విధానములుండును. తమకు



ఉపకారము చేసినవారి యెడల కృతజ్ఞతాభావము కలిగి యుండగలరు. నమ్మకస్తులైన వారివల్ల బంధువులవల్ల వీరు ద్రోహమును పొందగలరు. గొప్ప గొప్ప బాధ్యతలు స్వీకరించ గలరు. ఇతరుల సహాయము లేనిదే వాటిని నిర్వహించలేనివారై యుండెదరు. తమ తెలివితేటలవలన శ్రమలేకుండా ధనార్జన చెయ్యాలని ప్రయత్నిస్తుంటారు. అది అంతగా ఫలించదు. నిరంతర కృషితో కూడిన విషయములు లాభములు కలిగించగలవు. ధనసముపార్జన యందాశక్తి అధికము - తగిన విధముగా ధనార్జనయున్నను ఖర్చులు అధికమగుటవలన తగిన మిగులుబాటు కనుపించదు. వీరు తమ గొప్ప తనమును ప్రజ్ఞాపాటవములను ప్రదర్శింపదగిన సమయమునకై నిరీక్షింపుచుండి-అట్టి సమయము వచ్చినప్పుడు దానిని ఉపయోగించుటకు అవకాశములేనివారై యుందురు. బాల్యదశలో సుఖము, యౌవనదశలో విద్య కౌమారదశలో బంధు మరణములు జీవితములో మార్పులు, అస్థిరత్వము ప్రౌఢదశలో  ధనార్జన, కీర్తి, గౌరవమర్యాదలు భూగృహ వాహనయోగములు, సుఖసౌఖ్యములు స్థిరజీవనము కల్గును. చివరిదశలో అపవాదులు బంధుపరిత్యాగము అయోగ్య వర్తనము. హీనజీవనములు కలుగగలవు అజీర్ణబాధలు, కణుతులు, నంజు, నరములు, పాదములు, కాలివ్రేళ్ళకు సంబంధించిన బాధలుండును. కీళ్ళు,మలకోశములకు సంబంధించిన వ్యాధులు, రక్తహీనత నేత్రపీడ, శరీరమునకు నీరుపట్టుట, ఉబ్బులు వంటివ్యాధుల వలన ప్రమాదములు సూచించబడుచుండ గలవు.

## లగ్న భావ స్థిత గ్రహ ఫలితములు

1. రవి గ్రహము లగ్నభావమునందు బలము కల్గియుండిన ఎఱ్ఱని శరీరము సాత్విక గుణము - పైత్యతత్త్వము, స్వల్పమగు దారుఢ్యము మేహరోగ పీడలు, గొప్పగొప్ప ఆలోచనలు కల్గియుండును. నిర్దయ, దృష్టిలోపము-స్వల్ప భోజనము సౌశీల్యములను నవి ప్రత్యేక లక్షణములై యుంటవి. (మేషలగ్నమై అందురవియున్న నేత్రవ్యాధులు కర్కాటక లగ్నమైన కనులయందు పూవుయుండును. సింహలగ్నమైన రేచీకటి తులాలగ్నమైన దారిద్ర్య సంతాన నష్టములుండ గలవు.)

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

2. చంద్రుడు పూర్ణబలము కల్గి లగ్న భావమునందున్న రూపము. విద్య పూర్ణాయువు కల్గి దృఢశరీరులై వినయ సౌశీల్యాది మంచి గుణములతో నుండగలరు. వాత ప్రకృతిగల శరీరమగును. క్షీణ చంద్రుడు లగ్నమునందున్న చంచల స్వభావము మూర్ఖత్వము పిచ్చి ప్రవర్తన చెవిటితనము లేక మూగతనము,అంగవైకల్యము కల్గియుండును. చంద్రునికి లగ్నభావము – ఉచ్ఛ – స్వక్షేత్రములైన శుభఫలితములు ప్రాప్తించగలవు.)

3. కుజగ్రహము లగ్నభావము నందు బలము కల్గియున్న అతిసాహసము, క్రూరత్వము ధైర్యము,చపలచిత్తము, రోగయుక్త శరీరము ఉష్ణతత్త్వము, తిరుగాడు స్వభావము మతిభ్రమణము, అల్పాయువు, కురుపులు గాయములు గల శరీరము కృశాంగములు కల్గి రక్తదోషము–దంతరోగ పీడితులుకాగలరు. వాత పైత్య శ్లేష్మతత్త్వము కల్గును.

4. బుధగ్రహము లగ్నభావమునందు బలము కల్గియున్న మంచి స్వభావము, చక్కని దేహచ్ఛయ, పొడవు తక్కువ దేహము. పైత్య తత్త్వము, రజోగుణము విద్యయందధి కాసక్తి పవిత్ర హృదయము, మతసాంప్రదాయాను రక్తి, మధురమగు వాక్కులు హాస్యప్రియత్వము– దీర్ఘాయువు, గణిత, శిల్పశాస్త్ర ప్రావీణ్యము బుద్ధికుశలత నేర్పరితనములు ప్రాప్తించగలవు.

5. గురు గ్రహము లగ్న భావమునందు బలము కల్గియున్న అందమగు శరీరము, మంచి రంగు దేహదారుఢ్యము,స్థూలకాయము వాతత్త్వము, సత్త్వగుణము, జ్ఞానము, కార్యాలోచనాపటిమ ఉన్నతవిద్యా పాండిత్యములు ధైర్యస్థైర్యములు పూజ్యత గౌరవ మర్యాదలు, నిర్భయము, సత్సంతానము, చిరాయువు అదృష్టములు ప్రాప్తించగలవు.

6. శుక్రగ్రహము లగ్నభావమునందు బలము కల్గియున్న అందము కల్గిన సమదేహము లేక పొట్టి దేహముండగలదు. సుకుమారమగు అవయవములు చక్కని ముఖము విశాలనేత్రములు సౌమ్యమగు ప్రవర్తన, యుక్తి ప్రయుక్తులయందు దిట్టతనము రెండు మూడు



విద్యలందు పాండిత్యము, వివిధ భాషా పరిచయము లలితకళాభిని వేశనము కామాసక్తి – శాస్త్రజ్ఞత్వము – కవిత్వపరిచయము ఆరోగ్యము సుఖసౌఖ్యము, స్త్రీలయెడల మోజుకల్గి మేహతత్త్వము, రజోగుణములు తోటినుండగలరు.

7. శనిగ్రహము లగ్నభావమునందు బలము కల్గియున్న పొడవైన నల్లనిశరీరము నరములు (కండలు) కనుపించు అవయవములు, చిక్కిన దేహము, వంకరగల అవయవములు ఎత్తగుదంతములు, మలిన ప్రవర్తన, బలహీనత, నీచసంభాషణలు అనాచారము నిర్దయ డాంబికత్వము, స్త్రీలోత్వము, కామభోగములందు ఉచ్ఛ నీచలు లేకుండుట బాల్యమునందు అధికరోగ పీడలు, వాతతత్త్వము తమోగుణము మూర్ఖత్వము, నాశికా–గుదరోగములచే పీడించుట ప్రాప్తించగలవు.

మకర –కుంభ–తులారాశులు లగ్నభావమై శనియున్న రూపగుణ సౌశీల్యములు, అధికారము, సుఖభోగములు, రాజతుల్య గౌరవాదులు కలుగ గలవు, ధనుస్సు మీనము లగ్నములుగానుండి శనియున్న రాజయోగాదులు ప్రాప్తించగలవు.

8. రాహువు లగ్నభావమునందు బలము కల్గియున్న మరియు శుభగ్రహదృష్టి – యుతి లేకుండిన యెడల కృష్ణవర్ణమగు గంభీర దేహము, శరీర దారుఢ్యము, డాంబిక ప్రవృత్తి అధిక పట్టుదల, దుస్సాహసము, మొండితనము, మూర్ఖత్వము, దయా ధర్మవిహీనత (కురూపత్వము) విశేష ధనాసక్తి, క్రూర స్వభావము, స్వతంత్ర భావములు, అల్పాయువు, పుప్పిగోళ్ళు, శిరోకంఠ ముఖ నేత్రములకు సంబంధించిన వ్యాధులు, తమోగుణములు ప్రాప్తించగలవు. సింహలగ్నమై రాహువున్న అఖండ రాజభోగములు కల్గును.

9. కేతువు లగ్నభావమునందు బలము కల్గియుండి – శుభగ్రహ యుతి, దృష్టిలేకుండిన యెడల శుష్కించిన కురుచ దేహము, మిశ్రమ వర్ణము, వక్రములు లేక అసంపూర్ణమైన అవయవములు–చురుకైన



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

స్వభావము, చంచలమగు బుద్ధి, కొండెములు చెప్పునైజము, అతిలుబ్ధత్వము, జాతిభ్రష్టత్వము, స్థానభ్రష్టత్వము మాయావులగువారి స్నేహ సంసర్గములు, నీచ భావములు, కుటిలత్వము, మాతృసౌఖ్య లోపము, విచిత్ర ప్రవర్తన - వ్యాధితో కూడిన శరీరము, హస్త పాదములకు చర్మరోగపీడలు ప్రాప్తించగలవు.

మిథున-సింహములు లగ్నభావమై అందు రాహువున్నను-లేక ధనుర్మీనములు తప్ప ఇతర రాశులు లగ్నభావమై రాహు వుండి బలవత్తరమగు శుభగ్రహ వీక్షణ కల్గియున్నను, రాజసమాన భోగములు ప్రాప్తించగలవు. ఇదేవిధముగా మకర కుంభములు లగ్న భావమై యుండి అందు కేతువున్న యెడల అఖండ భోగభాగ్య సంపదలు - పుత్రసంతతి కుటుంబ సౌఖ్యములు ప్రాప్తించగలవు.

## తను భావమునకు గ్రహదృష్టి ఫలితములు

దుస్థానాధిపత్యము - దుస్థానస్థితి కలుగని సూర్యాది గ్రహములు బలయుక్తులై సరియైన భాగాలయందు లగ్న భావమును చూచుచుండుట వలన ఈక్రింది విధముగా ఆయా గ్రహదృష్టి ఫలితము నొసంగగలదు.

**రవి దృష్టి వలన :-** పిత్రార్జితసంపద ప్రభుత్వోద్యోగము- రాజసలక్షణములు కల్గును.

**చంద్రుని దృష్టివలన :-** వ్యాపారాది వృత్తులు - దేహ స్థౌల్యము - జల ప్రయాణాదులు కల్గును.

**కుజుని దృష్టి వలన :-** ధర్మగుణము - కోపము - అధిక కామాసక్తికల్గును.

**బుధుని దృష్టి వలన :-** విద్యార్జన, పాండిత్య ప్రకర్ష, కళానైపుణ్యము, కీర్తి కల్గును.

**గురుని దృష్టి వలన :-** నియమనిష్టలు, వినయ వివేకములు, రాజగౌరవము కల్గును.



**శుక్రుని దృష్టి వలన :-** ధనభోగ సుఖములు, వేశ్యా సంగమము, కుటుంబము కల్గును.

**శని దృష్టి వలన :-** మాయా-కపటోపాయములు-వృద్ధభార్య - కుత్సిత కర్మలు కల్గును.

**రాహు దృష్టి వలన :-** పట్టుదల - మూర్ఖత్వము - చట్టవ్యతిరేక వర్తనములు కల్గును.

**కేతు దృష్టి వలన :-** జ్ఞానము -ఆధ్యాత్మిక చింతన-చపలచిత్తము కల్గును.

లగ్నాధిపతి శుభగ్రహమైనను - పాపగ్రహమైనను లగ్నమునుచూచుట విశేష శుభదాయకము - లగ్నమునకు శుభగ్రహదృష్టి సుఖ సౌఖ్యములు - పాపగ్రహ దృష్టి కష్ట దుఃఖములను కలిగించగలదు. 3 అంతకు మించిన శుభగ్రహ దృష్టి లగ్నమునకు కల్గిన విశేష సుఖానుభవములు పొందగలరు. అట్టే 3 అంతకుమించి పాపగ్రహములు దృష్టికల్గిన అత్యంత కష్టజీవనము కల్గును, మిశ్రమ గ్రహముల దృష్టివలన మిశ్రమ ఫలితము లుండగలవు. రాశులచే కల్గు ఫలితములు లగ్నభావము, చంద్రస్థితరాశి అనువానిలో ఏది బలము కల్గియుండునో దాని ననుసరించి నిర్ణయించుకొనవలెను. లగ్న భావమెంత ముఖ్యమో చంద్రరాశి కూడా ఫలనిర్ణయంలో అంతటి ప్రాధాన్యత కలిగియుండగలదు.

# 2.ధన (కుటుంబ) భావ ఫలితములు

ధనభావము లగ్నాధిగా రెండవది. ఈ భావముద్వారా జాతకుని యొక్క ధనము, కుటుంబము, దక్షిణ నేత్రము, భోజన పదార్థములు, వాక్కులు, ముఖము, ప్రయాణము, రత్నములు, బంగారము, ఆభరణములు మొదలగు విషయములను తెలుసుకొనదగియున్నది.

ధన భావాధిపతి – అతడున్న నవాంశ రాశ్యధిపతి, కారకగ్రహముల యొక్క బలాబలములు (స్థితి, యుతి, దృష్టి, దశవర్గబలము మొ॥) ఆలోచించి ఫలనిర్ణయము గావించవలెను. ధనమునకు గురువు, వాక్కులకు బుధుడు, నేత్రమునకు శుక్రుడు, రత్నాద్యాభరణములకు శుక్రుడు కారక గ్రహములగుదురు.

ధన భావాధిపతి జన్మనక్షత్రము నుండి 2,4,6,8,9, తారల యందుండి స్వకీయాంశ లేక శుభగ్రహాంశల యందుండి, శుభగ్రహముల యుతి, దృష్టివంటి సంబంధములు కలిగి, కారక గ్రహము పాపగ్రహ సంబంధ రహితుడై యుండిన జాతకునికి ధనవిషయములందు అనుకూలత అధికంగా నుండగలదు. ఇందుకు వ్యతిరిక్తముగా అనగా భావాదిపతి 3–5–7 తారల యందుండుట శత్రు, నీచ, పాపగ్రహాంశల యందుండుట పాపగ్రహముల యొక్క యుతి, దృష్టివంటి సంబంధములు కలిగియుండి, కారకగ్రహముల బలహీనముగా నుండినయెడల ఆర్థిక ఇబ్బందుల నెదుర్కొనుచుండును.

ధనభావాధిపతియున్న రాశ్యధిపతికి ఉచ్చస్థితి కల్గినను– లగ్నాధిపతి యున్న రాశిలేక లగ్నభావము నుండి కేంద్ర, త్రికోణ స్థానము లందున్నను, దుస్థానములుకాని ఇతర స్థానములందు శుభగ్రహయుతి, దృష్టి, అర్గళ వంటి సంబంధములు కలిగియున్నను, అట్టి ద్వితీయ భావాధిపతియున్న రాశ్యధిపతి యొక్క కారకత్వ–గుణశీలాదుల ననుసరించి ధనప్రాప్తి కలుగగలదు. పాపగ్రహ, స్తాన సంబంధములచే అదేవిధముగా ఆయా కారక కారణముల ద్వారా ధన నష్టములు కలుగగలవు. ఇదే విధముగా ధన భావాధిపతి – ఆ భావాధిపతియున్న రాశ్యధిపతుల స్థితియోగ సంబంధాదుల ననుసరించి



ఇతరములగు కుటుంబ విషయములు, భోజన సౌఖ్యము – నేత్ర, కర్ణ, దంత వ్యాధులు – దేహ పీడలు మొదలగు విషయములు గ్రహించవలెను.

ధన భావాధిపతి – అతడున్న రాశ్యధిపతి అనుగ్రహములకు శుభ సంబంధాదులవల్ల భావము కారకత్వములకు శుభాధిక ఫలితములు, పాప సంబంధాదులవల్ల పాప ఫలితముల, మిశ్రమ సంబంధాదులవల్ల మిశ్రమ ఫలితములు జాతకునికి ప్రాప్తించుచుండగలవు.

1. **భావాధిపతి :** అతడున్న రాశ్యాధిపతి – భావకారకుడు అనువారు – నీచ శత్రు రాశులయందు – అట్టి నవాంశలయందు లేకయుండుట 2. లగ్నాధిగా గానీ భావాదిగా గానీపై మూడు గ్రహములు 6–8–12 స్థానములయందు స్థితికల్గియుండకుంటుట 3. 6–8–12 స్థానాధిపతులు భావము నందుండక – భావమును చూడక – భావాధిపతి– కారకులతో కలియక యుండుట 4. భావమునకు – భావాదిపతికి – భావకారకునకు నైసర్గిక పాపగ్రహములయొక్క యుతి దృష్టి – అర్గళ కలుగకుండుట 5. భావాధిపతికి భావముయొక్క నవాంశాధిపతి శత్రుగ్రహము కాకుండుట 6. భావాధిపతి భావకారకులు భావసంధులతో నుండకుండుట అనునవి అతి ముఖ్యము. పై ఆరు విధములగు దోషములులేని జాతకమునందు భావఫలితములు శుభకరమై యుండగలవు.

1. లగ్నభావాధిపతి లగ్నమునందు, ద్వితీయభావాధిపతి, లాభ (11) భావమునందునుండిన యెడల గొప్ప ధన ప్రాప్తియుండగలదు. జన్మతః ధనిక కుటుంబములందు జన్మించుట లేక జాతకుని జననము మొదలు అతని కుటుంబము ఆర్థికముగా అభివృద్ధి జెందుట యుండును. (ద్వితీయ భావాధిపతికి లాభభావము శత్రు–నీచ స్థానములై యుండరాదు.)

2. ధనభావాధిపతి తనకు శత్రు–నీచ స్థానములుగాని లాభభావము లాభాదిపతితో కలియుండిన యెడల–బాల్యము నుండి ధనలాభములు పొందును.



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

3. ధన భావాధిపతికి లాభస్థానము ఉచ్చరాశితోయుండి అందు స్థితి – లాభాధిపతి యొక్కయుతి కల్గిన జన్మతః గొప్ప భాగ్య సంపదలు కల్గియుండును.

4. పైవిధముగా మిత్రక్షేత్రమునందు ధనాధిపతియున్నను, లేక ధనాదిపతి ద్వితీయమునందుండి రాభాధిపతి లాభభావమునందుండి వీరిరువురు మిత్రగ్రహములైన యెడల స్వార్జితధన సంపదలు పొందగలరు.

5. లగ్నాధిపతి – ద్వితీయ – లాభ భావములందు ఆ భావానాధిపతులతో యుతిని పొందినయెడల జాతకునికి సమస్తకార్యములు కలిసివచ్చి ధనవంతుడగును.

6. బలయుక్తులైయున్న ద్వితీయ భావాధిపతి, భావమునందున్న గ్రహము. భావమునుచూచు గ్రహము. భావమునుచూచు గ్రహములయొక్క దశలయందు ధనాధిపతియున్న రాశ్యధిపతియొక్క కారకాదుల ననుసరించి ధనార్జన యుండగలదు.

7. లగ్నభావమునందు బలయుక్తుడైన ద్వితీయాధిపతి ఏ గ్రహముతో యుతి పొందియుండిన ఆ గ్రహ కారకత్వముద్వారా ధనలబ్ధి చేకూర గలదు.

8. లగ్న – ద్వితీయభావాదిపతులు బలయుక్తులై ఏ బావమునందున్న ఆ భావసంబంధ కారకత్వము ద్వారా ధనలబ్ధి కల్గుచుండగలదు.

9. ధనభావాధిపతి బలయుక్తుడై ఏరాశియందుండునో ఆ రాశికి సంబం ధించిన దిశయందు ధనప్రాప్తి యుండగలదు మరియు ధనప్రాప్తి కనువగుదశయందు ద్వితీయాధిపతి గోచారమునందే రాశులలో సంచరించునో ఆ రాశులకు సంబంధించిన దిశలయందు ధన లాభములు ప్రాప్తించగలవు.

(ద్వితీయాధిపతి లేక ద్వితీయభావస్థిత గ్రహములు గోచారమున సంచరించు రాశులయొక్క దిక్కునకు ఏడవదిక్కునందు ధనప్రాప్తి కల్గుచుండుట అనుభవ విషయము)



10. లగ్నభావమునందున్న పూర్ణచంద్రునికి దృష్టియున్నను, లేక ధన భావమునందున్న బుధునికి శుభగ్రహ దృష్టియున్నను జాతకుడు ధనవంతుడుకాగలడు.

11. ధన – లాభ భావాధిపతులు పరస్పర పరివర్తనకల్గియున్నను లేక వీరిరువురు లగ్నమునుండి కేంద్రస్థానముల యందున్నను జాతకుడు గొప్పధనము. ఖ్యాతి కలవాడగును.

12. లగ్న, ద్వితీయ భాగ్య – లాభాధిపతులగు గ్రహములు పరమోచ్చ భాగలయందుగానీ, అంశలయందుగానీ, లేక వైశేషికాంశయందుగానీ యుండిన యెడల జాతకుడు కోట్లధనమునకు అధిపతికాగలడు.

13. లగ్నాధిపతి ద్వితీయ భావమునందుండగా ద్వితీయాధిపతి లాభ భావమునందు, లాభాధిపతి లగ్నభావమునందు నుండిన నిధి ద్రవ్యము ప్రాప్తించగలదు.

14. లగ్నభావాధిపతి దోషరహితుడై అత్యధికబలము కల్గి ద్వితీయభావము నందున్న యెడల నిధిద్రవ్యము ప్రాప్తించగలదు. అట్లుగాక బలహీను డైన లగ్నాధిపతి ద్వితీయ భావమునందున్న పరవంచనకులోనై నష్టపడగలడు.

15. ధన భావమునందనేక గ్రహములుండగా ధనకారకుడు బలయుక్తుడై యున్నను లేక తనయొక్క స్వక్షేత్ర – ఉచ్చక్షేత్ర – మిత్రరాశుల యందున్నను అట్టి జాతకుడు జీవితాంతము వరకు ధన సంబంధమగు లొసగులులేక ఆర్థిక పుష్టి కల్గియుండును.

16. దుస్థానాధిపత్యము గలుగని శని ధనభావమునందుండి బుధుని దృష్టినందిన యెడల విశేషధన ప్రాప్తికల్గును – ఇదేవిధముగా గురుడుండి బుధుని దృష్టినందిన దరిద్రత్వము క్షీణచంద్రుడుండి బుధుని దృష్టినందిన సంపాదనలేక పిత్రార్జితనష్టము పొందుట కల్గును. మరియు ధనభావమునందున్న బుధునికి చంద్రుని దృష్టి, రవికి శనిదృష్టి, కుజునికి బుధునిదృష్టి కల్గుటవలన ధనార్జన లోపించి – పూర్వపు ఆస్థినశించి దరిద్రులుకాగలరు.

17. ధన భావాధిపతికి కేంద్రస్థానములందు ధనకారకుడు ఉచ్చనంది యుండిన లేక స్వక్షేత్రము నందుండిన యెడల గొప్ప ధనవంతులు కాగలరు.

18. ధన భావాధిపతి గురు – బుధులతో యుతినంది లగ్నాదిగా గానీ – భావాదిగానీ కేంద్ర – కోణ స్థానములందున్న యెడల లక్షల ధనము ప్రాప్తించగలదు.

19. ధన భావాధిపతి ఉచ్చరాశి యందుండి గురునియొక్క యుతి లేక దృష్టినందిన యెడల జాతకుని గృహము ఎల్లవేళలయందు ధనముతో నిండి యుండగలదు.

20. ధనభావము పాపగ్రహ యుతినందినను, భావాధిపతికి పాపగ్రహ యుతి కల్గినను, (బలవంతులై యుండగా) అన్యాయ ధనార్జన చేయగలరు.

21. భావాధిపతి బలహీనుడై భావమునందు పాపగ్రహస్థితి యుండి, లాభాధిపతివ్యయ భావమునందుండిన యెడల ధనాభావమేర్పడి దరిద్రులుకాలరు.

22. ధనభావాధిపతి – లాభ భావాధిపతులు పాపగ్రహములతో కలసియున్న దరిద్రముచే భిక్షాటనము ప్రాప్తించగలదు.

23. ధన–లాభాధిపతులు 6–8–12 రాశులయందుండగా ద్వితీయమందు రాహువు. లాభమునందు కుజుడునుండిన యెడల ధనము ప్రాప్తిం పుచు దుర్వ్యయముకాగలదు.

24. ధన – భాగ్య – లాభ, భావములకు భావాధిపతులకు 6–8–12 భావాధిపతుల – భావముల సంబంధముకల్గిన యెడల విశేషధన వ్యయముండగలదు.

25. లగ్నభావమునకు శుభగ్రహ సంబంధము లేకుండి – వ్యయభావాధి పతిదుర్బలుడై, వ్యయభావమునందు గురుడున్న యెడల ధనరాబడి కన్నను ఖర్చు అధికముగా నుండగలదు.

26. ద్వితీయభావాధిపతి నీచరాశియందస్తంగతుడై యున్నను లేక దుస్థానములందు అస్తంగతుడై పాపషడ్వర్గులు పొందియున్నను జాతకుడు ఋణగ్రస్తుడగును.

27. శుభగ్రహ సంబంధములు కల్గి బలయుక్తుడైయున్న ధనభావాధిపతి ఏభావమునందు స్థితి కల్గియుండునో ఆ భావకారక సంబంధముగా ధనము ప్రాప్తించగలదు.

28. పాపగ్రహ సంబంధములుకల్గి బలహీనుడైన ధనభావాధిపతి ఏ భావమునందు స్థితి కల్గియుండునో ఆ భావకారక సంబంధముగా ధన వ్యయము ప్రాప్తించగలదు.

29. పైవిధముగా శుభసంబంధముగల ధనాధిపతిలగ్నభావము నందున్న యెడల–జాతకుడు తన బుద్ధిబలముచేత ధనార్జన గావించగలడు.లేక పితృ – పితామహులు, (తండ్రి–తాతలు) సంపాదించిన ధన సంపదలు కల్గియుండును – ధనాధిపతి లగ్నభావము నందుండి, లగ్నాధిపతి నవమభావము నందుండిన యెడల, గురువులు – శ్రేయోభిలాషుల ద్వారా (వారి సహకారమువలన) ధనార్జనకల్గును. ధనాధిపతి లగ్నమునందు, లగ్నాధిపతి నవమ భావమునందు పాపగ్రహ సంబంధములు కల్గియున్న – వక్రబుద్ధుల వలన ధన నష్టము లేక ధనార్జన కాటంకములు కలుగ గలవు.

30. ధన భావాధిపతి శుభగ్రహ సంబంధితుడై తృతీయ భావమునందున్న తమ్ములు, చెల్లెండ్ర సహకారముద్వారా గానీ, లేక నృత్యగీత, వాద్య విద్యలద్వారాగానీ లేక మాంత్రిక విద్యవల్లగానీ ధనార్జనగావించును– (పాపగ్రహ సంబంధమువలన పైకారణములద్వారా ధననష్టము. ధనాటంకములు కల్గును–ఇదేవిధముగా అన్నిభావములకు ఊహించ వలెను)

31. శుభగ్రహ సంబంధముగల ధనభావాధిపతి చతుర్థభావమునందుండిన – తల్లి – మాతృవర్గమువారి సహకార – సహాయములవలన గానీ లేక తాను నేర్చిన విద్యవలనగానీ, వశీకరణమువల్లగానీ, లేక

వాహనముల ద్వారాగానీ (వాహనములు తయారుచేయుట – అమ్ముట – కొనుట వాటిని నడుపుట మొదలగు వాటిద్వారా) జాతకుడు ధన సంపదలు పొందగలడు.

32. శుభ సంబంధముగల ధనభావాధిపతి పంచమభావము నందున్న తన పుత్రులవల్లగానీ పుత్రసమానులవల్లగానీ, ప్రభుత్వమునకు సంబంధించిన వారివల్లగానీ లేక అదృష్టము వరించుట వల్లగానీ ధన ప్రాప్తినంద గలరు.

33. ధనభావాధిపతి శుభగ్రహ సంబంధముకల్గి షష్ఠ భావమునందున్న యెడల శత్రువులు – జ్ఞాతుల యొక్క కారణముగాగానీ లేక వైద్యవృత్తి. దొంగతనము వ్యవహార నిర్వహణలవల్ల లేక క్రయ – విక్రయము లందలి మోసకృత్యముల వలన ధన ప్రాప్తి కల్గుచుండగలదు.

34. శుభబల సంబంధముగల ధనభావాధిపతి సప్తమభావము నందున్న యెడల భార్య లేక తనపై ప్రేమగల ఇతరస్త్రీల సహాయ – సహకార ముల వలన – ఇతర దేశములతో గల వృత్తి సంబంధముల వలన (ఇతర సుదూర ప్రాంతములు) వార్తాపారవృత్తి – వార్తాలేఖనము వార్తాపత్రికల నిర్వహణ, విక్రయము – వార్తా సేకరణ (JOURNALISM) మొదలగు వృత్తుల ద్వారా ధనప్రాప్తి కల్గుచుండును.

స్త్రీ ధన ప్రాప్తి విషయంలో "సత్యసంహిత" గ్రంథమునందు దెల్పిన విషయములు పరిశీలనములు.

**శ్లో॥ శుభయోగే కళత్రస్థే దేశాంతరధనాగమః ।**
**ధనేశ స్థిత రాశ్యంశ తాదేకః స్త్రీగ్రహోయది ।**
**స్త్రీమూలాద్ధన ప్రాప్తిః పాపయోగే న్యథాఫలమ్ ॥**
**ఏతస్మిన్నేవయోగే చ శుభయోర్మందభౌమయోః।**
**మధ్యేస్థిత సప్తమేశే స్వక్షేత్రం చవినా భృగుః ।**
**తదాపత్నీ దక్షిణాశాత్ తన్మూలాద్ధన మాదిశేత్ ॥**

35. శుభబలములుకల్గిన ధన భావాధిపతి అష్టమభావము నందున్న యెడల ధనమును సంపాదించి నాశనముగావింప గలరు.



(దుర్వ్యయము) పాపసంబంధము కల్గినధనభావాధిపతి అష్టమ భావము నందున్న పూర్వార్జితధనము. (ఇంతకుముందు సంపాదించినది లేక పెద్దలు సంపాదించిన ఆస్తి) నంతయు నష్టపరచు వారగుదురు.

36. శుభబలము కల్గిన భావాధిపతి నవమభావము నందున్న యెడల పిత్రార్జిత ధనసంపదలు కల్గును. ఇట్టిస్థితిలో నవమభావాధిపతి లగ్న భావమునందు బలము కల్గియుండిన తాతముత్తాతలనుండి వచ్చు చున్న గొప్పసంపదలను పొందును. ధనాధిపతియున్న నవమభావాధి పతి ఏ భావమందు బలముకలిగి యుండునో ఆ భావ సంబంధిత కారకత్వముల ననుసరించి ధనప్రాప్తికల్గును.

37. ధనాధిపతి బలయుక్తుడై దశమభావమునందున్న యెడల ఆ దశమ భావాది పతియున్న భావకారకత్వముల ననుసరించి ధన సంపదలు ప్రాప్తించగలవు. ఈ యోగమునందు దశమాధిపతియున్న భావాధిపతి రవి – శనులైన ఉద్యోగము చంద్ర, బుధులైన వ్యాపారము కుజుడైన వ్యవసాయము, గురులైన వైదిక ధర్మోచిత కర్మల ద్వారా – శుక్రుడైన స్వతంత్రవృత్తులవల్ల ధనార్జనము గావించగలరు. పై గ్రహములు బలహీనులై యుండిన ఆయా విధములుగా ధన నష్టము నందగలరు.

38. శుభ బలాధికుడైన ధనాధిపతి ఏకాదశభావము నందున్న యెడల క్రయ – విక్రయాది వ్యాపారములు మరియు పెట్టుబడులు పెట్టుట, వడ్డీవ్యాపారము, జ్యేష్ఠసోదరులవల్లను గొప్పభాగ్యవంతులు కాగలరు–ధనాధిపతి బలహీనుడై పాపసంబంధములు కల్గి లాభ భావమునందున్న వ్యాపారము గావించి నష్టపడును అన్న మూలముగా ధన నష్టమునందును – వడ్డీవ్యాపారమొనర్చి ధనమంతయుపోయి దరిద్రులుకాగలరు.

39. ధనభావాదిపతి శుభబలాదులు కల్గి ద్వాదశభావము నందున్న యెడల పౌరోహిత్యము, శ్రాద్ధకర్మలు – మొదలగు వైదికా చారకర్మల ద్వారా ధనవంతుడు కాగలడు. పాపవర్గ బలముకల్గిన ధనాధిపతి వ్యయ భావమునందున్న పై కారణముల ద్వారా ధన నష్టమును పొందును.

40. షష్ఠ, అష్టమ, వ్యయాధి పత్యములుకలుగని శనిగ్రహము శుభ బలాధికుడై చతుర్థ లేక లాభభావములందుండిన యెడల నిధి నిక్షేపములద్వారా ధనము పొందును. ఈ యోగమునందు శనికి ధన యోగమివ్వదగు ఏదోయొక సంబంధము కల్గియుండవలెనని "యోగకర్తా భవేద్యది" యని సత్యాచార్యులవారు దెల్పిరి శని ధనయోగప్రద సంబంధీకుడై పాపసంబంధాలతో చతుర్థ, లాభ భావములందున్న నిధి – నిక్షేపములద్వారా పూర్వార్జిత ధనమును నష్టపడగలరు.

41. ధనభావాధిపతి శుభబలాధికుడై దుస్థానందుండినను, దుస్థానాధిపతుల సంబంధము కల్గినను, లేక కారకుడు బలయుక్తుడై పైవిధముగా దుస్థాన సంబంధము కల్గియుండినను స్వల్పధనము కలవారగుదురు.

మరియు జన్మలగ్నమునకు శుభగ్రహ సంబంధము కలుగకుండి వ్యయభారమునందు గురుడుండగా అవ్యయభావాధిపతి బలరహితుడై యుండిన ధనాధర్జనకన్న వ్యయమధికముగానుండి ఋణ గ్రస్తులగుదురు.

ధనభావమునందు దుస్థానాధిపతలున్నను, ధనభావాధిపతి నిర్బలుడై దుస్థానములందున్నను లాభ – వ్యయాధిపతులు పరస్పర పరివర్తన జెందినను, ధన–భాగ్య–లాభ భావములకు – భావాధిపతులకు దుస్థాన – స్థానాధిపతుల సంబంధములు కల్గినను – కర్కాటక లేక సింహ రాశులయందు పురుష గ్రహముల లేకుండి దశమభావము గ్రహవర్జితమై యున్నను, శని, కుజులు నీచనందియుండగా మీనమందు చంద్రుడు వృషభమునందు రవియుండినను, దరిద్రజాతకులు కాగలరు.

42. ధనభావాధిపతి శుభగ్రహములతో కలసియున్నను, శుభగ్రహదృష్టి నందినను లేక శుభగ్రహ నవాంశలయందున్నను – ఇదే విధముగా ద్వితీయ భావమునకు శుభగ్రహ సంబంధము కల్గినను, అందమైన కనులు కలిగియుండగలరు.



43. ద్వితీయ భావమునకు, భావాధిపతికి పాపగ్రహ సంబంధముల వలన నేత్రపీడితులగుదురు. ముఖ్యముగా–శని కుజుల సంబం ధము విశేషపీడాకరము.

44. లగ్నమునందు శుక్రుడుండి, ద్వితీయభావమునందు దుస్థానాధిపతుల సంబంధము కల్గియున్న అంధత్వము ప్రాప్తించగలదు – జన్మలగ్నము నందున్న శుక్రుడు పంచమ షష్ఠభావాది పతులయుతి నందినను అంధత్వము ప్రాప్తించగలదు.

45. ద్వితీయ భావాధిపతి చంద్ర శుక్రుల యుతినందియుండిన రేచీకటి కల్గును. లేక 6–8–12 భావములందు చంద్ర – శుక్రులు కలసి యున్నను రేచీకటి ప్రాప్తించగలదు.

46. వ్యయభావమునందు శనిసంబంధముగల పాపగ్రహములున్న కుడి కన్నుకు, కుజసంబంధముగల పాపగ్రహములున్న ఎడమకన్నుకు హానికల్గును.

47. లగ్న, ద్వితీయ, సప్తమ భావములనెందేని రవి–చంద్రులు కలిసియుండి, కుజశనుల ఇద్దరియొక్క దృష్టినందిన యెడల రెండు నేత్రములకు హానికలుగును.

48. ద్వితీయ భావాధిపతి, గురువు కలసిగానీ, విడిగాగానీ దుస్థానము లందున్నను, లేక వీరిలో ఒకరు పైవిధముగానుండి భావమునందు దుస్థానాధిపతులున్నను మూగతనము ప్రాప్తించగలదు.

49. ద్వితీయ భావమునందు శని చంద్రులు కలిసియున్న నత్తిమాటలుండ గలవు. ద్వితీయభావమునందు మాందీ లేక గుళికుడుండి – భావాధిపతి శని చంద్రులతో కలసినను నత్తి ఏర్పడగలదు.

50. ద్వితీయభావాధిపతి నీచ స్థితియందుండగా భావమునందు క్షీణ చంద్రుడు – కేతువు యున్నను లేక కేతువు మాత్రమే యుండి పాపగ్రహదృష్టి నందినను నత్తి ఏర్పడగలదు.

51. లగ్నభావమునందు రాహువున్న దంతములు పొడవుగానుండి బైటికి కనుపించగలవు. కేతువున్న క్రిందివరుస దంతములు వెడల్పుగా నుండును.

52. సప్తమభావమునందు పాపగ్రహములధికముగానున్న చూచుటకసహ్యకరమగు దంతములుండ గలవు. కుంభము లగ్నమై అందు శనియున్న ఎత్తుపళ్ళు, ధనుస్సు లగ్నమై చంద్రుదున్న పెద్దవగు దంతములు, కర్కాటకము లగ్నమై అందు శనియున్న పటుత్వము లేనిదంతములు, ద్వితీయభావమునందు రవియున్న దంతహాని కల్గును. ద్వితీయ భావాధిపతి రాహువుతోకలసి 6-8-12 భావములందున్న దంతహాని మరియు నాలుకకు సంబంధించిన వ్యాధులు కల్గును. ద్వితీయాధిపతి దశాకాలమునందు అతడున్న రాశ్యధిపతి యొక్క అంతర్దశయందు దంతరోగము అదేదిశలో బుధుని అంతర్దశయందు జిహ్వారోగము కల్గును.

53. ద్వితీయభావాధిపతి శుభులైన కేంద్రకోణాధిపతులతో కలసి లాభభావమునందున్న యెడల కుటుంబవృద్ధి యుండగలదు.

54. ద్వితీయభావాధిపతి గురుశుక్రుల సంబంధముకల్గి చతుర్ధ భావము నందున్న కుటుంబ సౌఖ్యముకల్గును. లేక గురుశుక్ర సంబంధము గల ద్వితీయ చతుర్థభావాధిపతులుపరస్పర భావములందు పరివర్తన నందిన యెడల కుటుంబ సౌఖ్యము ప్రాప్తించగలదు.

55. శుభుడైన ద్వితీయస్థానాధిపతి ద్వితీయభావమునుండి కేంద్ర కోణ స్థానములందు శుభగ్రహముతో కలిసియుండిన చక్కని మాటలు కల్గును.

56. ద్వితీయాధిపతియున్న నవాంశాధిపతి శుభగ్రహమై ఉచ్ఛస్థితి యందుగానీ, శుభ సంబంధము నందుగానీలేక పారావతాంశ యందుగానీ యున్న యెడల వాగ్ధాటికల్గి మేధావికాగలడు.

57. ద్వితీయభావాధిపతి నీచస్థితి యందుండి లేక శత్రుగ్రహయుతి నందియుండి నీచ స్థితిగలవేరొక గ్రహముచే చూడబడుచున్న పరాన్న జీవికాగలడు.

58. ద్వితీయాధిపతి శనియై నీచగ్రహ వీక్షణనందినను, లేక నీచస్థితి గల ద్విదీయాధిపతి శనితో కలిసినను, లేక నీచస్థితిగల శనియొక్క దృష్టి ద్వితీయాధిపతికి కల్గినను జాతకుడు శ్రాద్ధాన్న జీవికాగలడు.

59. ద్వితీయభావమునందు శుభగ్రహములున్నను, ద్వితీయభావాధిపతికి శుభయుతికల్గినను, ద్వితీయభావాధిపతి - భావములకు -



ఉచ్ఛాంశలు, శుభదృష్టి, మృద్వంశలు కల్గుటవలను జాతకుడు శుభకరమగు భోజనాదులు కలవాడగును.

## ధన భావ స్థిత గ్రహ ఫలితములు

ధన భావకారకత్వము కలుగని రవ్యాదిగ్రహములు బలయుక్తువై ద్వితీయభావము నందున్నప్పుడు వారొసగు ఫలితములు సంగ్రహముగా దెలుపబడుచున్నవి, (వీరికితర గ్రహ సంబంధము లుండరాదు)

1. రవి గ్రహము బలముకల్గి ద్వితీయ భావమునందున్న యెడల దుర్వచనములుపల్కుట యందాసక్తి-వినయ రాహిత్యము- ధనాటంకములు, విద్యాసక్తి లోపించుట ముఖ దంత రోగములు ప్రాప్తించగలవు.

2. పూర్ణచంద్రుడు ధనభావము నందున్న యెడల అందమగు ముఖము. విశాలనేత్రములు మంచి వాక్కులు, కుటుంబసౌఖ్యము బుద్ధిబలము, అభివృద్ధికరమగు జీవనము మంచి మిత్రులు. సుఖభోగములు, కీర్తి ప్రాప్తించగలవు. క్షీణచంద్రుడు ద్వితీయ భావమునందున్న పై ఫలితములకు వ్యతిరేక ఫలితములు కలుగగలవు.

3. కుజుడు ధన భావమునందున్న కురూపము - విద్యాధనములు లోపించుట, దయాదాక్షిణ్యములు లేకుండుట. దుర్మార్గసహవాసము జన విరోధము పరుషసంభాషణలు, కుటుంబసౌఖ్య హాని, దీర్ఘకోపము, కుత్సిత పదార్థభిక్షణ, నేత్రపీడలు ప్రాప్తించగలవు.

4. ద్వితీయ భావమునందు బుధుడున్న యెడల - ప్రస్ఫుటము ఆకర్షణీయమగు మాటలు సత్యవాక్కులు, పొడవైన శిరోజములు, విద్యా సౌఖ్య ఇష్టాన్న భోజనములు, కవిత్వము స్వశక్తితోటి ధన భాగ్య సంపదల నార్జించుట, కుటుంబ సౌఖ్యములు కల్గును.

5. గురుడు ధనభావమునందున్న యెడల స్వచ్ఛమగు మాటలు, భోజన ప్రియత్వము అందమగు ముఖము, సద్గుణములు, విద్యా ధన సంపదలు, సద్గుణములు, కీర్తి దాతృత్వము, సత్యశీలత, మంచి స్వభావము, కుటుంబసౌఖ్యము, విరోధములు లేకయుండుట ప్రాప్తించగలవు.

6. శుక్రుడు ధనభావమునందున్న యెడల - సంస్కారయుక్తమగు మాటలు కవిత్వధోరణి, సంస్కృత వేదవిద్యా ప్రావీణ్యము యోగ్యమగు అన్నపానీయములు మంచి వస్త్రాలంకారములు, స్త్రీ ధనము - వివిధ సంపదలు, వాహనములు ప్రాప్తించగలవు.

7. ద్వితీయభావమునందు శనియున్న యెడల జుగుప్సగలట్టి ముఖము వికారవదనము,అన్యాయ వర్తనము, అసత్యవచనములు, బంధు విరోధము, పరగృహ నివాసము, ధనహీనత, కుటుంబచిక్కులు, అసౌఖ్యములు కల్గును. ద్వితీయభావము శనికి స్వక్షేత్రములై అందుండిన పరప్రాంతములందు గౌరవము, ధనము, వాహన సౌఖ్యములు పొందగలడు. (అనగా కాలక్రమమున దూరప్రాంత వాసము కల్గి అచ్చట ధనసౌఖ్యాదులు పొందగలరు.)

8. రాహువు,ద్వితీయ భావమునందున్న యెడల సంశయ పూరితమగు వాక్కులు, ముఖరోగము, సునిశితహృదయము, రోషయుక్తమగు వర్తనము, నీచగృహనివాసము, ధనాటంకములు కుటుంబ అసౌఖ్యము తన అహంకారమువల్ల దుఃఖములు పొందుట. ప్రభుమూలక ధనప్రాప్తి స్వల్పసుఖములులు ప్రాప్తించగలవు.

9. కేతువు, ద్వితీయ భావమునందున్న యెడల అల్పమగు మాటలు - హాస్య సంభాషణలు, పాపకృత్యాసక్తి, విద్యాహీనత, దోషయుక్తమగు చూపులు, ఇతరుల ద్రవ్యముచే జీవనము, శూరత్వము, కలహము లందు నేర్పు, జడస్వభావము కల్గును.

## ధన భావమునకు గ్రహదృష్టి ఫలితము

దుస్థానములగు 6-8-12 భావములకు ఆధిపత్యము కలుగని రవ్యాదిగ్రహములు ద్వితీయభావమును సరియైన భాగాలలో వీక్షించుటవలన ఈ క్రింది విధముగా ఫలితములు ప్రాప్తించగలవు.



ధనభావమునకు రవి దృష్టియుండిన - స్వల్పభోజనము, దృష్టిలోపము- అస్థి

ధనభావమునకు చంద్రునిదృష్టియుండిన-యోగమగుమాటలు, ఇంగిత జ్ఞానము, ధనము

ధనభావమునకు కుజుని దృష్టియుండిన- కోపము-వ్యవసాయము అస్థిరమగు ధనము

ధనభావమునకు బుధుని దృష్టియుండిన-సౌశీల్యము, విద్య, నియమ నిష్టలు - సుఖము

ధనభావమునకు గురుని దృష్టియుండిన-చక్కని వాక్కులు, భోజన సౌఖ్యము త్యాగము - ధనము

ధనభావమునకు శుక్రుని దృష్టియుండిన-విద్య, కాముకత్వము, నేర్పు- సుఖము - ధనము

ధనభావమునకు శని దృష్టియుండిన- అసత్యవాక్కులు, చపలత్వము ధనహీనత, వంచన

ధనభావమునకు రాహువుదృష్టియుండిన-వాగ్వాదములు - కుటుంబ కలతలు, అస్థిర ధనము

ధనభావమునకు కేతువు దృష్టియుండిన- చమత్కారమగు మాటలు, నిర్ధనము, ప్రజావిరోధము

ధన భావమునందు మాందీయున్న యెడల - తన మాటల చేత విరోధములు పొందుట, ఆర్థిక ఇబ్బందులు కుటుంబ కలతల - అత్యాహారము. వామనేత్ర పీడలు కల్గును - గుళికుడున్న ధనహీనత, విద్యాశూన్యత, కొండెములుపల్కుట - కలహములు-దరిద్ర బాధలు-అపకీర్తి గల కుటుంబ చరిత్రలు ప్రాప్తించగలవు.

ద్వితీయ భావమునందు అధికపాపగ్రహములుండి, ధన భావాధిపతి బలహీనుడై లేక పాపగ్రహ సంబంధములు కల్గియుండి లగ్నభావాధిపతి దుస్థానములగు 6-8-12, భావములందున్న యెడల అట్టి జాతకుడు అమరణాంతము కష్టజీవనము గావించును - సుఖమనునది యుండదు. (సత్యా॥ చింతా)



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

# 3. తృతీయ (సోదర) భావ ఫలితములు

సోదరభావము లగ్నాధిగా మూడవది, ఈ భావము ద్వారా జాతకుని యొక్క కనిష్ఠ సోదర సోదరీమణులు, ధైర్యసాహసములు, కంఠధ్వని, బలము, కోపము, ఆభరణములు, ఆయువు, మిత్రులు, మొదలగు విషయములు తెలుసుకొనదగియున్నది.

తృతీయ భావముద్వారా పరిశీలించవలసిన పైఫలితములకు తృతీయభావ రాశ్యాధిపతి – భావాధిపతి కాగలడు సోదర – సోదరిమణులకు కోపమునకు కుజుడు కారకుడు. ధైర్యమునకు రవి కారకుడు. కంఠస్వరము నకు బుధుడు కారకుడు. ఆభరణములకు శుక్రుడు, ఆయువునకు శని, మిత్రులకు కేతువు కారకులు కాగలరు.

తృతీయ భావాధిపతి అతడున్న రాశ్యధిపతి భావము. కారకుడు బలముకల్గియుండిన భావఫలితములు సంపూర్ణముగా ప్రాప్తించగలవు. భావాధిపతి – కారకుడు. శుభగ్రహసంబంధములు కల్గియుండుట – ఉచ్చరాశుల యందు లేక ఉచ్చాంశలయందుండుట; స్వక్షేత్ర – మూలత్రికోణ– మిత్రక్షేత్రములందు అట్టి అంశములయందుండుట – జన్మనక్షత్రము నుండి 2–4–6–8–9 తారలయందు, భావాధిపతి – కారక గ్రహము లుండుట, మరియు జన్మల్నగమునుండి గానీ, లగ్నాధిపతినుండిగానీ, కేంద్ర – కోణస్థానములందుండుట ముఖ్యమైన బలములుగా, శాస్త్రములందు దెలుపబడినది.

భావము, భావాధిపతి, అతడున్న రాశ్యధిపతి–కారకుడు అను గ్రహములు నీచనందుట. శత్రుక్షేత్ర స్థితినందుట–శత్రు నీచాంశల యందుండుట పాపగ్రహ సంబంధము నందుండుట. దుస్థానము లందుండుట, లేక దుస్థానాధుపతుల సంబంధము కల్గియుండుట, భావము నుండి 6–8–12 స్థానములందుండుట, నీచస్థితి, శత్రుక్షేత్ర స్థితిగల గ్రహములచే చూడబడుట – పాపదశవర్గముల (షడ్వర్గుల) యందుండుట – భావ సంధులయందుండుట. పాపగ్రహార్గళమునందుట, మొదలగు హంసములు బలహీనములని గ్రహించవలెను. భావ–భావాదిప, భావ కారకులకు శుభసంబంధము లుండుటవలన సంపూర్ణ శుభఫలమును, పాప



సంబంధము లుండుటవలన సంపూర్ణ పాపఫలములును, మిశ్రమ (శుభపాప) సంబంధములు కల్గుటవలన శుభాశుభ మిశ్రమ ఫలములును ప్రాప్తించగలవు.

1. జన్మలగ్నమునకు 3–6–10–11 స్థానములలో నెచ్చటనైనను ఉచ్చస్థితిగల్గిన తృతీయ భావాధిపతి యుండిన యెడల అనేకమంది తమ్ముళ్ళు కలుగ గలరు. పై విధముగానున్న తృతీయాధిపతి పాపనక్షత్రములందున్నను (3–5–7) లేక పాప గ్రహ సంబంధము కల్గియున్నను కనిష్ట సోదరులు స్వల్పముగా నుండెదరు.
2. తృతీయ భావాధిపతి శుభబలుడై స్త్రీరాశి నవాంశలయందున్న చెల్లెళ్ళు– పురుషరాశి నవాంశలయందున్న తమ్ముళ్ళు ద్విస్వభావరాశి నవాంశల యందున్న ఇరువురు నుండగలరు. (సోదర స్థానాధిపతి యున్న రాశితో ఎన్నినవాంశలు గతించియున్నవో అందరు సోదరులుండ గలరు.)
3. పాపరాశులయందుపాపగ్రహ–వర్గ సంబంధముగల తృతీయాధిపతి యుండిన యెడల కనిష్ఠ సోదరులు లేక సోదరీమణులు నుండరు. "జాతానాం మృతిరేవవా" యనుటవల్ల ఒకవేళ జన్మించినను మరణించగలరు.
4. తృతీయ భావమునుండి 6–8–12 స్థానము లందు పాప గ్రహములుండి వారున్న రాశ్యధిపతి భావమునందున్నను – భావమును చూచినను– ఆ పాప స్థానగ్రహదశయందు సోదర మృతి సంభవించగలదు.
5. తృతీయ భావాధిపతి కుజుడైయుండి – ఆతృతీయ భావమునందున్న యెడల జాతకుని అనంతరము జన్మించిన సోదరులను నశింప జేయును. అదే విధముగా తృతీయ భావాధిపత్యముగల శని ఆ భావము నందున్న రెండవ సోదరుని (కనిష్ఠ) నశింపజేయును. పై విధముగా భావాధిపత్యము గలరని ఆ భావము నందున్న అన్నలకు మృత్యువు కల్గును. విశేషము :– అన్ని భావములకు భావాధిపతి భావము నందుండుట – భావమును జూచుట భావమునకు బలప్రదము – తృతీయ భావ విషయంలో మాత్రము భావాధిపతి –కారకుడు కుజుడగుటవలన అతడు భావమునందుండుట –

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

చూచుట దోష ప్రదముగా శాస్త్రములు దెల్పుచున్నవి. "ఆధిపత్య బలాదన్యే" యని సూచించుటవల్ల పైన దెల్పిన రవి-కుజ-శనులు గాక ఇతర గ్రహములకు మాత్రమే ఆధిపత్య బలముండగలదు. రవి-కుజ- శనులకు కారకత్వ బలమే ముఖ్యమని భావము.

6. తృతీయ భావమునకు కేంద్ర త్రికోణములయందు శుభగ్రహములున్న కనిష్ఠ సోదరవృద్ధి కల్గును. పాపగ్రహములున్న సోదరులుండరు.

7. తృతీయ - చతుర్థ భావాధిపతులిద్దరు కలిసి చతుర్థ భావమునందున్న భ్రాతృ భావమునకు వృద్ధికల్గును. పై విధముగా నున్న తృతీయ చతుర్ధాధిపతులకు కుజుని యుతియున్న తమ్ముడు కల్గును. శనితో యుతికల్గిన తమ్ములుండరు.

8. తృతీయాధిపతి అదృశ్యభాగమునందు పాపగ్రహములతో కలిసి యున్నను, దృశ్యభాగమునందు పురుషగ్రహవర్గులు పొంది పాపగ్రహయుక్తుడై యున్నను, లేక తృతీయాధిపతి పురుష రాశుల యందున్నను ఒకే తమ్ముని కల్గియుండును.

9. తృతీయాధిపతి ద్విస్వభావరాశుల యందుండి శుక్ర వీక్షణ లేక చంద్రవీక్షణ కల్గియున్నను, కేంద్రత్రికోణములగు శుభరాశుల యందు శుభగ్రహ సంబంధము కల్గియున్నరు జాతకుని తరువాత జన్మించిన వారు, ఆయువు - సుఖము కల్గియుండెదరు.

10. తృతీయాధిపతి లగ్నభావము నందున్నను - తృతీయభావము నందున్నను, లేక లగ్నాధిపతితోటి యుతి పొందినను జాతకుని తరువాత జన్మించు మగశిశువు గొప్ప ప్రమాదమును పొందును.

11. తృతీయ భావాధిపతి లగ్నభావమునందు - లగ్న భావాధిపతి తృతీయ భావమునందు పరివర్తనకల్గి స్వక్షేత్రాంశల యందున్న యెడల కవలసోదరు లుండగలరు.

12. లగ్నాధిపతి - తృతీయ భావాధిపతి పరస్పర మిత్రగ్రహములై శుభస్థానములందున్న జాతకునికి తన సోదరులతో విడరాని అనుబంధ ముండగలదు. అట్లుగాక లగ్న, తృతీయాధిపతులు పరస్పర



శత్రువులై నీచ - శత్రుక్షేత్రములందున్న యెడల సోదరులతో ద్వేషము - శత్రుత్వము లుండగలవు. (లగ్న-తృతీయాధిపతుల దశలయందు)

13. తృతీయ భావమునందు బుధుడుండి రవి దృష్టినందిన యెడల సోదరులమధ్య సహృదయత యుండదు.

14. గురు-దృష్టి కల్గిన శుక్రుడు తృతీయభావమునందున్న సోదర - సోదరిమణులపై ప్రేమకల్గి వారి సంరక్షణ గావించును.

15. తృతీయభావాధిపతి శుభగ్రహదృష్టికల్గి వైశేషికాంశయందున్నను లేక ఐరావతాంశయందుండి గురు - శుక్రుల సంబంధము కల్గియున్నను, సోదరులు గలుగ గలరు.

16. తృతీయభావాధిపతికి పాపగ్రహార్గళ కల్గినను, తృతీయాధిపతియున్న నవాంశ రాశ్యధిపతి, దుస్థానములందున్నను లేక శత్రుక్షేత్ర, నీచక్షేత్ర, అస్తంగ తత్వముల నందియున్నను - తృతీయభావమున శనిగానీ, మాందీగానీ యుండి శుభ సంబంధములు లేకుండినను చర నాశనముకల్గును.

17. సోదరులు కలుగకుండుట లేక కలిగి నశించుటకు మరికొన్ని హేతువులు.

   1. తృతీయ భావము పాపగ్రహ వీక్షణ కల్గియుండగా భావాధిపతి భావమునందు క్రూర షష్ట్యంశల యందుండుట.
   2. తృతీయాధిపతియున్న నవాంశ రాశ్యధిపతియగు గ్రహమే నవాంశ యందుండునో ఆ నవాంశాధిపతి లగ్నమునుండి గానీ, భావము నుండిగానీ అష్టమము నందుండుట.
   3. తృతీయాధిపతియొక్క త్రింశాంధిపతియున్న నవాంశాధిపతి-నీచ-శత్రు రాశులందున్నను లేక అస్తంగతుడైయుండుట.
   4. దుస్థానములగు 6-8-12 భావములు తృతీయాధిపతికి ఉచ్ఛ రాశులై యుండి అందు తృతీయాధిపతికి స్థితికల్గి పాపగ్రహ వీక్షణ నందినను - లేక పై విధముగా కుజుడున్నను.

5. తృతీయ భావముగానీ, భావాధిపతిగానీ, కారకుడుగానీ అతిక్రూర గ్రహయుక్తులై యుండినను.

పైన దెల్పిన ఐదు విధములగు గ్రహస్థితియందు సోదర నాశనము సంభవించగలదు.

18. రాశి - భాగ - లిప్తలుగా నున్న జన్మలగ్నస్ఫుటమును - దశమ భావ స్ఫుటమును కలుపగా నగు రాశి - భాగ -ల యందు గోచార గురుని సంచారకాలమునందు సోదరులుగానీ తోబుట్టువులుగానీ జన్మించగలరు.

ఉదాహరణ:- జన్మలగ్న స్ఫుటము - 4-13-27
దశమభావ స్ఫుటము 1-19-50
6-03-17

అనగా మేషాదిగా ఆరు రాశులు దాటి 7వ రాశియగు తులారాశిలో గోచార గురువు సంచరించు కాలమునందు సోదరోత్పత్తి జరుగగలదు.

19. 1. తృతీయ భావాధిపతి, 2. భావకారకుడు (కుజుడు) 3. భావమునందున్న గ్రహము, 4. భావమును చూచు గ్రహములయొక్క రాశ్యాది స్ఫుటముల మొత్తము కలుపగా నేర్పడు నక్షత్రమేదియో ఆ నక్షత్ర దశయందు సోదరుల కభివృద్ధి అధికముగా నుండగలదు.

20. రాహువుయొక్క రాశ్యాది స్ఫుటము నుండి కుజుని రాశ్యాధి స్ఫుటమునుతీసివేయగా నేర్పడు రాశికి త్రికోణ స్థానములందుగానీ, ఆ రాశి నవాంశరాశియందుగానీ గోచార గురువు సంచరించు కాలము లందు సోదర నష్టము సూచించబడగలదు.

విశేషము :- పై గణితము ద్వారా నేర్పడు రాశికి త్రికోణ రాశులలో గోచార గురు సంచారకాలము కనిష్ఠ సోదర లేక సోదరీలకు - నవాంశ రాశిలో గురు సంచారకాలమునందు జ్యేష్ఠులగు సోదర-సోదరీలకు అరిష్టము కల్గును.

21. లగ్నాధిపతియొక్క స్ఫుట రాశ్యాది నుండి తృతీయ భావాధిపతి యొక్క స్ఫుట రాశ్యాధిని తీసివేసిన యెడల ఏర్పడు నక్షత్రమునందు గోచార



శని సంచరించుకాలమునందు సోదర-సోదరీ మరణములు ప్రాప్తించ గలవు.

2. తృతీయ, భావాధిపతి - భావకారకుడు, భావమును చూచు గ్రహము. భావమునందున్న గ్రహములయొక్క రాశ్యాధి స్ఫుటములు మొత్తము కలుపగా నేర్పడు స్ఫుటరాశియొక్క అంశయందు గోచార శని సంచరించు కాలమునందు సోదర సోదరీల మరణము సూచించ బడగలదు.

**ఉదాహరణ:-** లగ్నాధిపతి స్ఫుట రాశ్యాది 5-23-55

1. తృతీయాధిపతి స్ఫుటము 6-22-15. ఇది తీసివేయబడదు. కావున
లగ్నాధిపతి స్ఫుటము 5-23-55+12-0-0 భూ చక్రరాశులు.
మొత్తము 17-23-55
తృతీయాధిపతికి స్ఫుటము6-22-15 (-)
10-01-40=మీనరాశి-పూర్వాభాద్ర
నాల్గవపాదము-ఇందు శని సంచరించుకాలము. సోదరుల కరిష్టము.

| | |
|---|---|
| 2. తృతీయ భావాధిపతి స్ఫుటము - | 6-22-15 |
| భావకారకుని స్ఫుటము - | 6-05-36 |
| భావస్థితి-భావవీక్షిత గ్రహములులేవు | 0- 0- 0 |
| | 12-27-51 |
| భూచక్ర రాశులు మొత్తం | 12- 0- 0 |
| | (తగ్గించవలెను) |
| | 0-27-51 |

ఈ స్ఫుటరాశి మేషము - దీని అంశ ధనూరాశి కావున ధనూరాశిలో గోచార శని సంచార కాలము సోదరుల కరిష్టప్రదము (లేక మేషరాశియందలి చివరిభాగంలో శని సంచారకాలమనికూడా గ్రహించవచ్చు.)

22. తృతీయభావాధిపతి లగ్నభావమునందు శుభాధిక బలముకల్గియున్న యెడల లలితకళా నిపుణుడగును. నాట్య - నాటక రంగములందు ప్రసిద్ధుడగును. లగ్నస్థిత తృతీయాధిపతి పాపసంబంధములు

కల్గియున్న జన నిందితుడగును. మిశ్రమ బలయుక్తుడైన తన జీవన రంగము నందాటంకములు కల్గియుండును.

23. తృతీయాధిపతి ద్వితీయభావమునందు శుభబలము కల్గియుండిన యెడల సోదర నాశనము కల్గును. అట్లుగాక తమ్ము డెవడైన జీవించియుండిన జాతకునిచే పోషింపబడి గొప్ప ధనవంతుడు కాలగడు – తృతీయాధిపతికి పాపసంబంధము కలిగియున్న జాతకుని సోదరుడు కుటుంబమునందు కలతలు కలిగించి అందరికి దుః ఖమును కలిగించువాడగును.

24. రవి – కుజ – శనులుగాక మిగిలిన గ్రహములు తృతీయ భావాధిపతులై తృతీయ భావమునందు శుభ బలము కలిగియుండిన అనేకమంది తమ్ముళ్ళు – చెల్లెంద్రు కల్గి అన్యోన్య ప్రేమానురాగములతో వర్ధిల్లగలరు. పాపసంబంధములు అట్టి తృతీయాధిపతికి కల్గిన స్వల్ప సోదరులుండ గలరు.

25. తృతీయాధిపతి శుభయోగ బలయుక్తుడై చతుర్థ భావమునందుండి నవమభావాదిపతి బలహీనుడై యుండిన జాతకునికి తమ్ములుండరు. భాగ్యాధిపతి బలయుక్తుడై యుండిన యెడల సవితి సోదరు లుండగలరు. చతుర్థ భావస్థితి గల్గిన తృతీయాధిపతి బలయుక్తుడై యుండగా – చతుర్థ భావాధితి – కుజుడు బలహీనులైన యెడల భూసంపదలు నష్టపడగలవు. (గృహము – ఆస్తులు నష్టపడి పరుల పంచన తలదాచు కొనవలసిన పరిస్థితులు ప్రాప్తించగలవు.)

26. సోదర స్థానాధిపతి పంచమ భావమునందు శుభసంబంధ బలాధికుడై యుండిన సోదరు లధికముగా నుండగలరు. మరియు తమ్ముల ద్వారా వృద్ధిలోనికి రాగలరు. లేక దైవానుగ్రహమువలనగానీ, స్వయంకృషి వలనగానీ, ప్రభుత్వాధికారమును పొందగలరు. లేక అన్య కుటుంబము నకు దత్తువెళ్ళి ఆస్తిపరులు కాగలరు. పాపసంబంధములు గల తృతీయాధిపతి పంచమభావమునందున్న సోదరులద్వారా గానీ, తన విపరీతబుద్ధుల ద్వారాగానీ – పతనము కాగలరు.



27. తృతీయాభావాధిపతి భావాధి శుభయోగ బలముకల్గి షష్ఠభాగము నందున్న యెడల జాతకుని సోదరులు(డు) సైనికాధికారులుగాను లేక డాక్టర్లుగాను కీర్తిగాంచి ధనవంతులు కాగలరు. శుభయోగాదులు గల తృతీయ షష్ఠాధిపతులు తృతీయషష్ఠములందు పరివర్తన జెందినను లేక తృతీయాధిపతి షష్ఠమునందుండి, తృతీయ భావమునకు షష్ఠాధి పతి వీక్షణకల్గినను జాతకుని తమ్ముడు క్రీడల యందు నిపుణుడై (వ్యాయామ విద్యాకుశలత) ఖ్యాతి నందగలడు. తృతీయాధిపతికి పాపగ్రహ సంబంధములు కల్గిన యెడల సోదరుడు చోరకృత్యములు సల్పుచు శత్రువృద్ధి కల్గి దుఃఖితుడు కాగలడు.

28. తృతీయాధిపతి శుభ బలయుక్తుడై సప్తమభావమునందున్న యెడల జాతకుడు తన తమ్ములతోటి స్నేహవాత్సల్యములు కలిగి యుండ గలడు. ఇట్టి స్థితిలో సప్తమభావాధిపతి లగ్నభావమునందున్న యెఓడల సోదరుడు దేశాంతర గతుడగుటవలన అతని ధనమును, భార్యను జాతకు డనుభవించగలడు.

29. తృతీయాధిపతి శుభయోగ బలముకల్గి అష్టమ భావమునందున్న యెడల జాతకుని చివరి తమ్ముని కరిష్టము కల్గును – పాప సంబంధాదులు కల్గియున్న జాతకుడు దరిద్రుడగును లేక అపాయకర మగు వ్యాధిచే పీడించబడును.

30. సోదరభావాధిపతి శుభబలయుక్తుడై భాగ్యభావమునందున్న యెడల జాతకుని తమ్ముడు తండ్రి కత్యంత ప్రీతిపాత్రుడై పితృభాగ్య సంపదలు పొందగలడు. ఇట్టి స్థితిలో భాగ్య భావాధిపతి లగ్న భావమునందున్న తమ్ముని మూలమున జాతకుడు గొప్ప భాగ్యవంతుడు కాగలడు. తృతీయాధిపతి పాప సంబంధములు కల్గియుండిన తమ్ముని కారణముగా పిత్రార్జిత ధనసంపదలు నశించ గలవు. లేని యెడల తమ్మునితో సహా తండ్రితో విరోధము కల్గియుండును.

31. తృతీయ భావాధిపతి శుభ బలములు కల్గి దశమభాగమునందున్న యెడల జాతకుని తమ్ములు కులవృత్తిలవారై ఖ్యాతి వహించగలరు. జాతకునికి సహకరించిన కార్యసాధకులు కాగలరు. పాప బలములు

గల తృతీయాధిపతి దశమ భావమునందున్న-జాతకుని తమ్ములు అన్నను వ్యతిరేకించి అన్యవృత్తులుకల్గి జాతకునికి తలవంపులు తేగలరు.

32. సోదర భావాధిపతి శుభబల సంపన్నుడై లాభ భావమునందున్న యెడల సోదర వృద్ధి యుండగలదు. జాతకుడు సోదర మూలకముగా లాభములు పొందగలడు. పాప బలముగల తృతీయాధిపతివల్ల సోదర నాశనము కల్గును.

33. తృతీయ భావాధిపతి శుభ బలాధికుడై వ్యయ భావము నందున్న యెడల కనిష్ఠ సోదరునికి హాని సంభవించుటేగాక కాలక్రమమున జాతకుడు ధనహీనుడు కాగలడు – తృతీయాధిపతి పాప బలము కల్గి వ్యయభావము నందున్న సోదర వృద్ధి కల్గును.

34. తృతీయభావమునందు శుభ సంబంధముగల రాహువున్న సోదరవృద్ధి కల్గును. ఈ యోగములందు భావ భావాధిపతులకు కల్గు శుభ – పాప–మిశ్రమ బలతారతమ్యముల ననుసరించి ఉచిత రీతిగా ఫలితముల నూహించవలెను.)

35. కుజుడున్న భావాధిపతి లేక కుజునితో కలిసియున్న గ్రహము షడ్వర్గాది బల సంపన్నులై యుండిన జాతకుడు ధైర్యసాహసములు కలవాడగును.

36. తృతీయాధిపతి – తృతీయ భావస్థిత గ్రహము, కుజుడు అను ముప్వురు బలోపేతులై యుండిన శరీర దార్ఢ్యము కల్గి మహాశూరులు కాగలరు.

37. తృతీయాధిపతికి పాపరాశిస్థితి – నీచస్థితి –శత్రురాశిస్థితి, అస్తగతత్వములు కల్గియున్న జాతకునకు దుస్సాహస మధికముగా నుండగలదు.

38. తృతీయ భావకారకుడు (కుజుడు) బలరహితుడై క్రూర షష్ట్యంశల యందుండి భావాధిపతి శుభ గ్రహసంబంధము కల్గియున్న దెబ్బలాట లందు నిపుణుడై విజయము నందుచుండగలడు.

39. తృతీయాధిపతికి శుభ సంబంధమువలన శుభ నవాంశస్థితివలన, వైశేషికాంశ కల్గుటవలన అధికధైర్యవంతులు కాగలరు.



40. తృతీయాధిపతి కేంద్రకోణ స్థానములందు శుభ సంబంధములు కల్గియున్న ధైర్యశాలి యగును. పాప సంబంధము కల్గిన పిరికివాడగును.

41. తృతీయాధిపతి దుస్థానములందుగానీ పాపగ్రహ రాశులయందు గానీ కుజునితో కలిసియుండిన యెడల ధైర్యహీనుడగును.

42. తృతీయ భావమునందు శని – బుధులు యుతినందిన ధైర్యము లోపించగలదు. చంద్ర – బుధుల యుతివలన పిరికితనము – లోభిగుణములు కల్గును.

43. తృతీయ భావాధిపతికి ఇతర గ్రహ యుతి వలన కల్గు ఫలితము లీక్రింది విధముగా నుండును.

రవి యుతివల్ల–వీరత్వము–సాహసము (పిరికితనమని కొన్ని గ్రంథములలో కలదు)

చంద్రయుతివల్ల – నిశ్చితాభిప్రాయము మనోధైర్యము

కుజ యుతివల్ల – జడత్వము – అతికోపము

బుధ యుతివల్ల – సాత్వికబుద్ధి, అంతర్గత భయము

గురుని యుతివల్ల–ధైర్యము–శాస్త్ర ప్రావీణ్యత (గోభయము–జలగండము)

శుక్ర యుతివల్ల – కామాతురత – కామకలాప కలహములు.

శని యుతివల్ల – అతిభీతి – మూర్ఖత్వము

రాహు యుతివల్ల – భీరువు – మనో జాడ్యము

కేతు–లేకమాందీ–గుళిక యుతివలన–రోగభీతి–మనోవ్యథలు కల్గును.

44. లగ్నభావమునందు రాహువు వుండి లగ్నాధిపతి తృతీయాధిపతులు యుతినంది యుండిన సర్పగండము లేక సర్పభీతి కల్గియుండును.

45. తృతీయ భావమునందు భావాధిపతికి బుధుని యుతి కల్గినను లేక పాపగ్రహ యుతిగల మాందీ గ్రహము తృతీయ భావమునందున్నను లేక బలవంతుడగు శనితో కలసిన కుజుడు తృతీయము నందున్నను కంఠ సంబంధమగు రోగ పీడితులగుదురు.

46. శుక్రుడు తృతీయ లేక షష్ఠ భావములందు రవికి వెనుకగా నున్న యెడల శోక – రోగ – భయాదులు కలిగించును.

(ద్వితీయ భావంలో రవియుండుట లేక తృతీయ భావంలో రవి డిగ్రీల కంటే శుక్రుని డిగ్రీ లధికమగుట)

47. తృతీయ భావమునందు నీచనందిన గ్రహమున్నను, లేక షష్ఠభావమునందు అస్తంగత గ్రహమునుండి పాపగ్రహ వీక్షణ నంది నను కంఠ సంబంధమగు రోగ ముండగలదు. ఇది తప్పిన (అనగా కంఠ రోగము లేకుండిన) విషభక్షణముల లేక విష బాధలు పొందును.

48. ప్రేతపురీ యాంశకల్గిన కుజుడు తృతీయ భావమునందున్న కర్ణరోగము కల్గును.

49. తృతీయ భావాధిపతి క్రూర షష్ట్యంశల యందున్నను లేక తృతీయాధిపతి యున్న రాశ్యధిపతి స్థితినందిన రాశ్యధిపతి లగ్నాధిగా అష్టమ భావమునందుండి పాపగ్రహ సంబంధముల నందిన కర్ణరోగము కల్గును.

50. తృతీయ భావము – భావాధిపతి – కారక గ్రహమగు బుధుడు అనుముప్వురును శుభగ్రహ సంబంధములు కల్గియున్న చక్కని కంఠధ్వని కల్గును.

51. తృతీయ భావమునందు శుభగ్రహములుండి – భావాధిపతి–బుధుడు, తమయొక్క ఉచ్చ – మిత్ర క్షేత్రములందున్న కోమలమగు గాత్ర ధ్వని కల్గును.

52. తృతీయ భావాధిపతి రవి – శనులతో యుతినంది లగ్నాధిగా దుస్థానములందున్న నేరములు ఆరోపించబడి శిక్షింపబడగలరు.

## తృతీయ భావస్థితి గ్రహ ఫలితములు

తృతీయ భావమునందు ఇతర గ్రహ సంబంధములు లేని రవ్యాది గ్రహము లుండుటవలన ఈ క్రింది ఫలితములు ప్రాప్తించగలవు.



1. రవి – తృతీయము నందున్న, బలము ధైర్యము ఉదారత్వము – పరాక్రమము – స్వల్ప సోదరులు – ధనము దుష్టమగు – ఆలోచనలు కలుగగలవు.

2. చంద్రుడున్న బలము–శౌర్యము–సోదరీవృద్ధి గర్వము–కార్యము లందు నేర్పు, దయాహీనత, పిరికితనము, హింసాస్వభావము కల్గును. క్షీణచంద్రుడైన అనేక కష్టనష్టములు కల్గును.

3. కుజుడు తృతీయమునందున్న ధైర్యగుణము – అతిసాహసము – సోదర నష్టము అప్రతిహి తత్వము – మంచి అలవాట్లు – రాజానుగ్రహము – సుఖము – ధనము కల్గును.

4. బుధుడున్న యెడల ఆయువు – ధైర్యము – శూరత్వము – మంచి సోదరులు – (సోదర నష్టమని కొందరి యభిప్రాయము) సద్బుద్ధి – శీఘ్రముగా అలసట పొందుట – బాలారిష్టములు, కల్మషచిత్తము – సూక్ష్మపరిజ్ఞానము – విశేషధనము కల్గును.

5. గురు గ్రహమున్న యెడల స్వల్ప సోదరులు – కార్యములందు నేర్పు, పాపకర్మరతుడు మాయావి, మర్యాద తెలియకుండుట, కుత్సిత స్వభావము, అల్పసాహసము, ప్రేమ లేకుండుట, బలహీనత, అజీర్ణవ్యాధులు, ధనమున్నను అనుభవించ లేకుండుట సౌఖ్యహీనత కల్గును.

6. శుక్రుడు తృతీయ భావమునందున్న సోదరీవృద్ధి, నేర్పు, మంచి ఆలోచనలు, చిక్కిన దేహము, లబ్ధిత్వము, ఆభరణములందు ప్రీతి. తన ప్రతిభ వెల్లడికాకుండుట, కష్టజీవనము, భార్యాహీనత, స్త్రీమూలక దుఃఖము కల్గును.

7. తృతీయమందు శనియున్న సోదర నాశనము. విజ్ఞానము దాన ధర్మముల యందాసక్తి నిరుత్సాహము – రాజగౌరవము – ఆధిపత్యము, వాహనసౌఖ్యము, చక్కని భార్యాపుత్రులు – రాజసమాన భోగములు కల్గును.

8. రాహు వున్న యెడల స్థిరచిత్తము. జన్మతః గర్వము, భ్రాతృవిరోధము – కోపము – పుత్ర మిత్ర – కళత్ర సుఖసౌఖ్యములు ధన సంపదలు కల్గును.

9. కేతువు, తృతీయ భావమునందున్న ఆత్మశక్తి, ఆయుర్వృద్ధి, కీర్తి, స్వల్ప కోపము పరాక్రమము, సద్బుద్ధి, దాతృత్వము, శత్రునాశనము, ఐశ్వర్యము, బాహువులకు పీడ బంధు ద్వేషము కలుగ గలవు.

10. తృతీయ భావమునందు మాందీ–గుళికులలో నెవ్వరున్నను ఆ భావ ఫలితములను నాశనమొనర్చగలరు. భావస్థితి కలుగక తృతీయస్థాన స్థితియందు మాత్రము శుభులు.

## తృతీయ భావమునకు గ్రహదృష్టి ఫలితములు

దుస్థానములగు 6–8–12 స్థానముల కాధిపత్యము కలుగని ఆ స్థానములందు వుండని రవ్యాది గ్రహములు ఇతర గ్రహసంబంధ వర్జితులై సరియైన భాగలయందు తృతీయ భావమును చూచుచుండుటవలన ఈ క్రింది ఫలితములు కలుగగలవు.

రవిగ్రహ దృష్టి తృతీయ భావమునకు కల్గిన యెడల ఉదార స్వభావము. శౌర్యము ధనము కల్గి దుర్జన సమూహముతో కూడి యుండును.

**చంద్రగ్రహ దృష్టివలన –** సాత్వికగుణము, బంధు ప్రియత్వము స్వల్ప ధనము కల్గును.

**కుజగ్రహ దృష్టివలన –** గొప్ప పరాక్రమము, ఉన్నతభావములు, గొప్ప ఖ్యాతి కల్గును.

**బుధగ్రహ దృష్టివలన –** చపలచిత్తము, దైన్యము, తిరుగాడు స్వభావము కల్గును.



**గురుగ్రహ దృష్టివలన –** పాపకర్మాచరణ, దరిద్ర బాధలు, భార్యకు లొంగియుండుట కల్గును.

**శుక్రగ్రహ దృష్టివలన –** రోషముతో కూడిన వాక్కులు, పాపచింతన, స్త్రీ వ్యామోహము సోదరీవృద్ధి కల్గును.

**శనిగ్రహ దృష్టివలన –** శీలసంపద, స్వల్పాన్నభోజనము, ధనము, సోదరహాని కల్గును.

**రాహుగ్రహ దృష్టివలన –** వీరగుణము, అనేకము, ధనము సోదరవృద్ధి కల్గును.

**కేతుగ్రహ దృష్టివలన –** సద్గుణములు, విక్రమము కల్గును.

**విశేషము :–** తృతీయ భావము – భావకారకుడగు కుజుడు – ఇందు దేవికి బలమధికముగా నుండునో దాని ననుసరించవలెను. భావము బలాధిక్యత నందిన ఆ భావమునందు గల అష్టక వర్గ బిందుసంఖ్యకు సమానమగు సోదరు లుండగలరు. కుజుడు బలాధికుడైన కుజాష్టక వర్గునందు కుజ స్థానమునుండి తృతీయ స్థానమునందుగల బిందు సంఖ్యకు సమానమగు సోదరు లుండగలరు. ఈ బిందువులలో పురుష గ్రహబిందువులవల్ల పురుష సోదరులు, స్త్రీ గ్రహ బిందువులవల్ల స్త్రీ సోదరీలను నిర్ణయించవలెను. నీచ స్థితి శత్రు సిత్థికల్గిన గ్రహ బిందువులు తగ్గించవలెను.

# చతుర్థ (మాతృ) భావ ఫలితములు

చతుర్థ భావము లగ్నాధిగా నాల్గవ భావము. ఈ భావము ద్వారా జాతకుని యొక్క తల్లి, విద్య, గృహము, భూములు, వాహనములు సర్వ సుఖములు భూగర్భ సంపదలు, స్థాన భ్రంశము, బంధుమిత్రులు, సంశము. కృషి మొదలగు విషయములను తెలుసుకొనదగి యున్నది.

చతుర్థ భావముద్వారా తెలుసుకొనదగిన పై విషయములకు చతుర్థ భావ రాశ్యధిపతి భావాధిపతి కాగలడు. పగలు జన్మించిన వారికి శుక్రడు – రాత్రి జన్మించిన వారికి చంద్రుడు మాతృకారక గ్రహము లగుదురు. విద్యకు గురు–బుధులు, గృహములకు గురువు. వాహన సుఖములకు శుక్రుడు భూములు మొదలగు వాటికి కుజుడు. భూగర్భ సంపదలకు గురువు, బంధుమిత్రులకు–బుధుడు అన్యదేశ విద్యలకు స్థానభ్రంశమునకు శని, రాహువులు, వంశమునకు శుక్రుడు. కారగ్రహములు కాగలరు. భావ సంబంధితములగు ఫలితము లన్నిటికీ, సాధారణంగా గురు – శుక్రులాధి పత్యము కల్గియుండగలరు. ప్రతి జాతకునికి లగ్నభావము తరువాత ప్రాధాన్యము గల భావము చతుర్థ భావమని శాస్త్రజ్ఞుల అభిప్రాయము. ఈ భావము తగినంత బలముగా నున్నప్పుడే జాతకుని జీవితము రాణించ గలదు. యెందువల్లననగా ? – మానవ జీవిత పురోభివృద్ధికి – మనుగడకు కావలసిన విద్య – భూగృహ సుఖాదు లీ భావమునకు సంబంధించి యుండుటయే ముఖ్య కారణము.

చతుర్థ భావము–భావాధిపతి, అతడున్న రాశ్యధిపతి– కారకుడు అనువారియొక్క బలాబలములపై ఈ భావ ఫలితముల లాధారపడి యుండ గలవు. పై నాల్గు గ్రహములు – శుభస్థానములందు – (కేంద్ర–కోణములు) ఉచ్ఛ–మూలత్రికోణ, స్వక్షేత్ర–మిత్రక్షేత్ర సిత్థికల్గియుండి, శుభగ్రహ సంబంధము నందుట–స్వకీయ–ఉచ్ఛ–మిత్ర–శుభగ్రహ నవాంశ రాశుల యందుండుట–షడ్వర్గ బలయుక్తులై శుభాధిక దశవర్గ బలము కల్గియుండుట, జన్మనక్షత్రమునకు శుభతారలగు 2–4–6–8–9 నక్షత్రము లందుండుట. భావమునుండి కేంద్రకోణ స్థానాధిపతులతో పరివర్తన జెందియుండుట,



భావాధిపతి, కారకుడు, జన్మలగ్నాధిపతికి మిత్రులై యుండుట ముఖ్యమగు బలములుగా దెలుపబడినవి.

భావము–భావాధిపతి – అతడున్న రాశ్యధిపతి – కారకుడు అనువారు, దుస్థానములగు 6–8–12 స్థానము లందుండుట (లగ్నాధి భావాది) ఆ స్థానాధిపతుల సంబంధము లుండుట. ఆ స్థానాధిపతులు భావము నందుండుట మరియు పై నాల్గు గ్రహములు తమయొక్క నీచ –శత్రుక్షేత్ర, పాపగ్రహక్షేత్రములందు, ఆ నవాంశ రాశులయందు నుండుట. నీచ గ్రహముల–శత్రుగ్రహముల సంబంధములు పొందుట – పాపగ్రహ వీక్షణ–యుతినందుట–అస్తంగతత్వము నందుట, పాపషడ్వర్గులు కల్గి దశవర్గ బలము లోపించుట భావసంధియందుండుట లేక సంధికి ఆరోహణ కల్గుట జన్మలగ్నాధిపతితోటి శత్రుత్వముండుట – జన్మ నక్షత్రము నుండి దుష్ట తారలగు, 3–5–7 తారల యందుండుట. బలరహిత విషయములని గ్రహించవలెను. కొన్ని సందర్భములలో శుభా శుభ మిశ్రమ బలమువల్ల మిశ్రమ ఫలితములు కలుగుచుండగలవు.

1. చతుర్థ భావాధిపతికి భావస్థితికల్గి గురు దృష్టియుండి బుధుడు శుభబలాధికుడై యుండిన యెడల జాతకుడు విద్యా వినయములు గల వాడగును.

2. చతుర్థ భావాధిపతి, గురుడు–బుధుడు అనువారు మిత్రక్షేత్రములందు మిత్ర నవాంశలయందు శుభ సంబంధ బలాధికులై యుండిన యెడల లేక లగ్నాధిగా గానీ భావాదిగా గానీ త్రికోణస్థానములందు శుభ గ్రహసంబంధములుకల్గి బలయుక్తులై యుండిన యెడల గొప్ప విద్యావేత్త, అదృష్టశాలి కాగలడు. బుధుడొక్కడు మాత్రమే బలముగల్గి యుండి ఇతరులు మిశ్రమ బలమునందుండిన విద్యావంతులు కాగలరు. (అదృష్టం దూరంగా వుంటుంది)

3. జన్మలగ్నమునకు కేంద్ర – కోణ స్థానములందు బుధగ్రహము ఉచ్ఛస్థితి కల్గియుండిన గొప్ప విద్యావంతుడై, ధన వాహనములు కల్గియుండ గలడు.

4. చతుర్థ భావాధిపతి లగ్నాధిగా కేంద్ర కోణముల యందైనను లగ్న ద్వితీ యాధిపతులతో యుతినందియుండిన అసమాన విద్యా ప్రతిభ కల్గును.
5. చతుర్థ భావము బలయుక్తమై లగ్నాధిగా కేంద్ర స్థానములందు భావాధిపతి గురు - శుక్రులతో యుతినందిన యెడల గొప్ప విద్య ప్రాప్తించగలదు.
6. బుధుడు శుభస్థానములందు ఉచ్చస్థితి యందుండగా లగ్నాధిగానీ, చంద్ర రాశ్యాదిగాగానీ కేంద్రములందు భావాధిపతి గురువుతోగానీ, శుక్రునితో గానీ యుతి నందియున్న యెడల గొప్ప విద్యా యోగము ప్రాప్తించగలదు.
7. గురుగ్రహము లగ్నాదిగా కేంద్ర-కోణము లందుండి, బుధుడు భావము నకు లాభస్థానము (లగ్నాధి ద్వితీయంలో) నందున్నను లేక శుక్రుడు ఉచ్చలయందున్నను జాతకుడు గణితశాస్త్ర విద్యావంతుడు కాగలడు.
8. చతుర్థ భావమునకు లాభస్థానమునందు శుభగ్రహ యుతిగల్గిన కుజుడుండి కేంద్రస్థితిగల బుధుని దృష్టినందిన గొప్ప గణితశాస్త్రవేత్త కాగలడు.
9. లగ్నాత్ ద్వితీయ భావమునందున్న కుజునికి చంద్రయుతి, బుధ దృష్టికల్గిన యెడల గణిత విద్యా ప్రాప్తికల్గును.
10. ద్వితీయాధిపతియగు బుధుడు ద్వితీయమునందు ఉచ్చస్థితి యందుండి లగ్నభావమునందు గురుడు - అష్టమ భావమునందు శని యుండిన యెడల గణితశాస్త్ర విద్య ప్రాప్తించగలదు.
11. ద్వితీయ భావమున కాధిపత్యముగల రవినిగానీ, కుజునిగానీ గురు-శుక్రులు వీక్షింపుచున్నను-లేక ద్వితీయాధిపత్యముగల ఆ రవి-లేక కుజుడు పారావతాంశయందున్నను తర్క శాస్త్ర విద్యయందు గొప్ప వారగుదురు.
12. ద్వితీయ భావాధిపత్యముగల గురుగ్రహము సంపూర్ణ బలయుక్తుడై శుభస్థానములందుండి రవి-శుక్రుల దృష్టినందిన యెడల వ్యాకరణ శాస్త్రవిద్యా పాండిత్యము కల్గును.



13. విద్యా కారకుడగు గురువు కేంద్ర కోణములయందు బుధ-శుక్రవీక్షితుడై యుండగా శని పారావతాంశయందున్న యెడల వేదాంత శాస్త్రము నంద సమాన ప్రతిభావంతుడగును.
14. ద్వితీయాధిపతియగు బుధుడు ఉచ్చస్థితియందుండగా గురువు సింహాసనాంశయందు, శని గోపురాంశయందు నుండిన వేదాంతశాస్త్ర విద్య కల్గును.
15. ద్వితీయాధిపతియున్న నవాంశాధిపతి, బుధుడు గోపురాంశ యందుండగా శుక్రుడు సింహాసనాంశయందుండి గురువు కేంద్రము నందుండిన యెడల ఆరుశాస్త్రములందు నిష్ణాతుడు కాగలడు. (1తర్క, 2.మీమాంస 3. న్యాయ 4. భాట్ట 5. ప్రభాకర 6. వ్యాకరణ శాస్త్రములు)
16. గురు-శుక్రులు కేంద్రములుండగా ద్వితీయాధిపతియొక్క నవాంశరాశి యందున్న యెడల షట్శాస్త్ర పండితుడగును.
17. చతుర్థ భావాధిపతి దుస్థాన-అస్థానాధిప సంబంధములు కలిగి యున్నను లేక పాపగ్రహ యుతి - వీక్షణాదులు కల్గియున్నను, విద్యా వంతుడు కానేరడు.
18. చతుర్థాధిపతి - కారకగ్రహములు, లగ్నాధిగాగానీ, భావాదిగాగానీ 6-8-12 స్థానములందున్నను లేక నీచ-శత్రుస్థానములందు-ఆ అంశలయందు నున్నను విద్యా విహీనులు కాగలరు. (మిశ్రమ యోగములచే సామాన్య విద్య కల్గును.)
19. చతుర్థ భావాధిపతి బలయుక్తుడై భావమునందుగానీ, భావాంశ యందుగానీ యుండగా గురువు కేంద్రముల యందుండి ఉచ్చనందిన శుక్రునిచే చూడబడిన యెడల వేద విద్యా గ్రేసరుడగును.
20. చతుర్థ భావమునందు బలోపేతుడైన శుక్రుడుండగా భావాధిపతి ద్వితీయమునందు-గురువు లగ్నమునందు - లగ్నాధిపతి బుధయుక్తుడై భావమునందు నుండిన యెడల వేదవిద్యా ప్రావీణ్యత కల్గును.

21. కేంద్రములందుగానీ - ద్వితీయమునందు గానీ బుధ - చంద్రులు ఉచ్చస్థితి యందుండి గురు - శుక్రుల యుతినంది యుండిన వేద విద్యావేత్తయగును.

22. లేశమైనను దోషములేని పరిపూర్ణ బలాధికులగు గురు-శుక్రుల సంబంధము, లగ్న-ద్వితీయ-చతుర్థములకు ప్రాప్తించిన యెడల వైదిక విద్య కల్గును.

**విశేషము:-** వేదవిద్యాప్రాప్తియందు గురు-శుక్రుల బలానుగుణ్యముగ ఉత్తమ మధ్యమ-అధమ ఫలితములు కల్గును.

23. చతుర్థభావాధిపతి తృతీయ మందుండి - సప్తమాధిపతికి చతుర్థ భావస్థితికల్గి, ద్వితీయమందు రాహువున్న యెడల అన్యవిద్యల కొరకై దూరప్రాంతములందు వశింపగలరు.

24. వ్యయభావమునందు రాహు వుండగా సప్తమ భావమున లగ్నాధిపతి గురుయుక్తుడై యుండి, చతుర్థ భావమున ద్వితీయాధిపతి బలయుక్తుడై యుండిన విద్యార్జన కొరకు దూరప్రాంతములందు వశించగలరు.

25. రాహువునకు గురు యుతి కల్గి కోణ స్థానములందుండి, సప్తమ - వ్యయ భావములందున్న శనిదృష్టి కల్గిన యెడల జాతిభ్రష్టులై విద్య నార్జించగలరు.

26. చతుర్థభావము - భావాధిపతి బలముకల్గి యుండగా - కేంద్రకోణము లందున్న గురు-బుధులతో రవ్యాది గ్రహములు యుతి నందుటవలన ఈ క్రింది విధములగు విద్యార్జన లుండగలవు.

లగ్నాధిగా కేంద్ర కోణస్థానములందున్న గురువు లేక బుధునకు రవి యుతి కల్గిన - న్యాయశాస్త్రము - రాజనీతి శాస్త్రము. సనాతన వైద్య శాస్త్రము, జర్నలిజం, ఖగోళశాస్త్రము, కులవిద్యలు, పరిపాలనా నిర్వహణా విద్య. (IAS)

27. చంద్రుని యుతి కల్గుటవలన, రసాయన శాస్త్రము-వ్యాపార గణాంక శాస్త్రము ఆర్థికశాస్త్రము, వినోదవిద్యలు - పశువైద్యశాస్త్రము - ప్రసూతి వైద్యశాస్త్రము సేవికాశిక్షణలు (నర్సులు - కాంపౌండర్ ట్రైనింగ్‌లు) ప్రాథమిక విద్యా బోదనా శిక్షణలు, (ఎలిమెంటరీ విద్యా ట్రైనింగ్)



28. కుజగ్రహ యుతివలన వ్యవసాయ శాస్త్రము-గృహనిర్మాణశాస్త్రము (సివిల్ ఇంజనీరింగ్) విద్యుదుత్పాదన శాస్త్రము-సైనిక-పోలీస్ శిక్షణలు, (ఐ.పి.యస్) యంత్ర పరికరములతో నడచు వాహనములు నడుపు శిక్షణలు-శస్త్ర చికిత్సా శాస్త్రము నీచమగు కుల వృత్తి విద్యలు- లోహముతో ఆయుధ తయారీ విద్యలు.

29. బుధగ్రహ యుతి వలన-గణితశాస్త్రము, జ్యోతిశాస్త్రము, తర్కశాస్త్రము, న్యాయశాస్త్రము, గణాంకశాస్త్రము, యంత్ర విజ్ఞాన శాస్త్రము, (మెకానికల్ ఇంజనీరింగ్) సాహిత్య శిల్ప, వేదాంత శాస్త్రములు- ఉపాధ్యాయ శిక్షణ, వ్యాపార నిర్వహణా విద్య,టైప్ రైటింగ్, మేధస్సునకు సంబంధించిన విద్యలు-దుస్తుల తయారీ-జంతుసంరక్షణ శిక్షణలు.

30. గురు గ్రహ యుతి వలన ఆర్థిక శాస్త్రము, న్యాయశాస్త్రము, మత సంబంధిత విద్యలు,వేదాంతవిద్య, శ్రౌతవిద్య, దేవాలయ సంబంధిత విద్యలుశిక్షణలు, పి.జిలు (పోస్టు గ్రాడ్యుఏషన్) శాస్త్రపరిశోధన గృహోప యోగవస్తు నిర్మాణ శిక్షణలు.

31. శుక్రగ్రహ యుతి వలన - ఆర్థికశాస్త్రము, వ్యాపార గణాంకశాస్త్రము, లలితకళలు, పశుసంరక్షణ శాస్త్రము, నూతన సృష్టి విధానములు, వాహన నిర్మాణ శిక్షణలు, అంతరిక్షయాన విద్యలు, (విమాన చోదకత్వము) వేదవిద్య, భోగోపయోగవస్తు పదార్థ నిర్మాణ శిక్షణలు, స్త్రీలకు సంబంధించిన వైద్య విద్య.

32. శనిగ్రహ యుతి వలన శాస్త్రీయ పరిశోధనా విద్యలు. న్యాయశాస్త్రము, వ్యవసాయ శాస్త్రము, అంతరిక్షయాన వాహనముల తయారీ శిక్షణలు, యంత్రపరికర నిర్మాణ విద్య, గనులు, ఖనిజ సంపదలకు సంబంధిం చిన విద్యలు, ఇంద్రజాల విద్యలు, వేదాంత విద్య-శిథిల వస్తు పరిశోధన విద్యలు.

33. రాహుగ్రహ యుతి వలన రసాయన శాస్త్రము-వైద్య శాస్త్రము, విషద్రవ్య వినియోగముతో కూడిన విద్యలు - వ్యాపార గణాంక శాస్త్రము. (ఆడిటింగ్). మద్యపానీయములు తయారుచేయు శిక్షణ-ఔషధముల



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

తయారీకి సంబంధించిన విద్యలు, విదేశీ విద్యలు - అన్యభాషా విద్యలు. భూత వైద్య విద్య - మారణాయుధముల తయారీ శిక్షణ.

34. కేతు యుతి వలన - మెస్మరిజం, హిప్నాటిజం, ఇతర ఇంద్రజాల విద్యలు. అంతరిక్షపరిశోధనలు, ఖగోళశాస్త్రము, నావికాశాస్త్రము, సముద్రగర్భ పరిశోధనలు, విమాన చోదక శిక్షణ వనమూలికా శాస్త్రవిద్య - మోక్ష విద్య - క్రూరమృగ జంతు శిక్షణా విద్యలు. నీచమగు మత సంబంధిత విద్యలు-క్షుద్ర విద్య, మొదలగునవి.

35. కేంద్ర స్థితిగల్గిన విద్యా కారక గ్రహములతో యుతి సంభవించిన రవ్యాధి గ్రహములకు ఉచ్చ, మిత్రక్షేత్ర, స్వక్షేత్ర స్థితి సంభవించుటవలన లేక భావాధిప, లగ్నాధిపతుల కాగ్రహములు మిత్రులై మిత్ర తారల యందుండుటవలన తమకు సంబంధించిన ఫలితములను పరి పూర్ణముగా నొసంగగలరు. మిశ్రమస్థితి సంబంధాదుల వల్ల మిశ్రమ ఫలితములు-నీచ-శత్రుక్షేత్ర స్థితులవలన అధమ ఫలితముల నొసంగగలదు.

ఒకే విషయమునకు రెండు మూడు గ్రహములు ఆధిపత్యము వహించి యున్న యెడల అందలి బలాధిక గ్రహము ననుసరించి ఫలము యోచించవలెను. తమ ఆధిపత్యమునకు సంబంధించిన విషయము లందు ఆ విషయములకు సంబంధించినంతవరకు పాపగ్రహములు శుభులేయగుదురు. కారక గ్రహములు కేంద్ర కోణములందేగాక లగ్నాదిగా ద్వితీయ-లాభ భావములందు కూడా రవ్యాధిగ్రహముల యొక్క యుతిని పొందినప్పుడు ఆయా గ్రహానుగుణ్య ఫలితముల నొసంగుట అనుభవమునందు కలదు. ముఖ్యముగా భావాధిపతికిగానీ, కారకగ్రహమునకుగానీ శుభస్థానములందు ఉచ్చ, మిత్ర-స్వక్షేత్ర గ్రహ సంబంధములు కల్గుటవల్ల విద్యాప్రాప్తి నందగలరు. అదేవిధముగా నీచ, శత్రు - అస్తంగత, పాప స్థానాధిపతుల సంబంధములు కల్గిన విద్యకు భంగము వాటిల్లగలదు.

36. చతుర్థ భావము బలయుక్తముగా నుండి చంద్ర - శుక్రులు శుభరాశులలో శుభగ్రహ సంబంధము కల్గియుండిన మాతృప్రేమకు పాత్రుడగును-ఆతని తల్లి దీర్ఘాయువు నందగలదు.



37. చతుర్థ భావము బలయుక్తమైన శుభగ్రహమందున్నను భావాధిపతి బలీయుడై శుభగ్రహ సంబంధమునందినను, కారకుడు శుభస్థానము లందు శుభగ్రహ యుతి కల్గియున్నను తల్లికి దీర్ఘాయువు, తల్లి ప్రేమను పొందగలడు.

38. చతుర్థ భావాధిపతియున్న నవాంశాధిపతి లగ్నాధిగా కేంద్ర స్థానము లందు బలము కల్గినను లేక చతుర్థ భావమునుండి కేంద్రము లందు శుభగ్రహము లున్నను తల్లి చిరకాలము జీవించగలదు.

39. చతుర్థాధిపతి దశమ భావము నందుండగా బలయుక్తుడగు దశమాధి పతి లగ్న భావమునందున్న యెడల జాతకుని తల్లి పతివ్రత కాగలదు.

40. శుభస్థానములందు భావాధిపతి శుభగ్రహ యుతినంది రవి దృష్టి నందిన యెడల జాతకుని తల్లి శీలవతి, గుణవతి యగును.

41. చతుర్థ భావాధిపతి బలయుక్తుడై భావము నందుండగా అతనికి లగ్నాధిపతి వీక్షణ కల్గినను లేక శుభగ్రహ సంబంధములు కల్గినను మాతృ వాత్సల్యమును పొందగలడు.

42. చతుర్థ భావాధిపతి నైసర్గిక శుభగ్రహమై కేంద్రకోణములందు గురునితో యుతి నందిన యెడల జాతకుని తల్లి విశేష సుఖములు పొందగలదు.

43. మాతృకారక గ్రహము బలయుక్తమై శుభగ్రహ దృష్టికల్గి శుభాంశల యందున్నను లేక భావమునందు బలముగల శనియుండి శుభగ్రహ దృష్టి నందినను లేక లగ్నాధిగా సప్తమభావము నైసర్గిక శుభగ్రహ రాశియై అందు శుభుడున్నను, జాతకుని తల్లి దీర్ఘకాలము జీవించగలదు.

44. లగ్నాధిగా దుస్థానములందున్న చంద్రునికి తృతీయాధిపతితో యుతి కల్గిన జాతకునికి మాతృ స్తన్యపానము కలుగదు.

45. చతుర్థ భావాధిపతి నీచ-శత్రుక్షేత్ర స్థితి యందుండగా తృతీయ - పంచమ భావములలో పాపగ్రహములుండి చంద్రుడు పాపగ్రహ ములతో కలిసియున్న జాతకుని తల్లి సదా రోగ పీడితురాలగును.

46. చతుర్థ భావాధిపతి షష్ఠాధిపతితో యుతినంది నవమ భావము నందున్నను లేక చతుర్థ–నవమి భావాధిపతులు కలిసి చతుర్థ భావము నందున్నను, జాతకుని తండ్రికి రెండవ సంసారముండగలదు. లేక వ్యభిచారి కాగలదు.

47. చతుర్థ – షష్ఠ – భాగ్య – లగ్న భావాధిపతులు నల్వురు ఏ భావము నందైనను యుతి నందియున్న (కలిపియుండిన) జాతకునితల్లి వ్యభిచారి కాగలదు.

48. చతుర్థ భావమునందు షష్ఠాధిపతి చంద్ర – కుజులతో యుతి నందియున్నను, లేక భావమునందు రవి రాహువు లిర్వురు యుతి నంది (కుజ వీక్షితులైనను) యున్నను జాతకుని తల్లి అన్యపురుష సంబంధము గలదై యుండును.

49. చతుర్థభావము పాపగ్రహ సంబంధము కల్గియుండి – చంద్ర శుక్రులకు కేంద్ర స్థితికల్గి పాపగ్రహ వీక్షణకల్గి యున్న జాతకుడు మాతృగామి కాగలడు. లేక గురుపత్నిని పొందువాడగును.

50. చతుర్థ భావమునకు పాపగ్రహ సంబంధముండి – అదేవిధముగా చంద్రుడు కూడా పాపగ్రహ యుతి నందియుండి – రవి కేంద్ర స్థానములందున్న జాతకుడు మాతృ సమానమగు స్త్రీని పొందును.

51. చతుర్థ భావాధిపతి బలరహితుడై 6–8–12 భావములందుండగా లగ్న భావమునందు పాపగ్రహ స్థితికల్గి, కారకుడు పాప సంబంధాదుల నంది దుస్థానముల యందుండగా జాతకుడు జన్మించిన వెంటనే తల్లికి మృత్యువు కల్గును.

52. చతుర్థ భావమునందు పాపగ్రహములుండగా చంద్రుడు (లేక మాతృ కారకుడు) పాపగ్రహములతో యుతినంది దుస్థానము లందున్న యెడల శీఘ్రముగా తల్లికి మారకము కల్గును. (భావమునకు– కారకునికి నైసర్గిక శుభగ్రహ సంబంధము లుండని యెడల)

53. చతుర్థ భావమునందు పాపగ్రహ వీక్షణ కల్గిన శని యుండగా లగ్నాధిగా అష్టమ భావాధిపతికి నీచ–శత్రుక్షేత్ర స్థితికల్గిన తల్లికి వెంటనే మృత్యువు కల్గును.



54. చతుర్థ భావాధిపతి పాప గ్రహ వీక్షితుడై నీచయందుండగా పాపగ్రహ సంబంధము గల మాతృకారకుడు చతుర్థ భావమునందున్న వెంటనే తల్లి మరణించగలదు.

55. చతుర్థ–భాగ్య, లగ్న భావాధిపతులు ముప్వురు పరస్పర కేంద్ర కోణస్థానము లందున్న యెడల, ఆ గ్రహములయొక్క దశ – అంతర్దాశా కాలములందు తల్లిదండ్రులు మరణించగలరు.

56. చతుర్థ భావాధిపతి ఆ భావమునుండి కోణస్థానములందు–లగ్నాధిపతి లగ్న భావమునుండి కోణస్థానములందుండిన యెడల వారిరువురు స్థితినందిన రాశ్యధిపతులలో ఒకరు లగ్నభావము నందున్న యెడల– తల్లి దండ్రు లిరువురు మృతి నందగలరు.

57. భాగ్య భావమునందు రవియు, చతుర్థ భావమునందు చంద్రుడును స్థితికల్గియున్నను లేక వారాభావములను చూచుచున్నను తల్లిదండ్రు లిరువురు ఒకే సమయమున మరణించగలరు.

58. చతుర్థ భావాధిపతి భావకారకులతో కలిసిన గ్రహములు మరియు భావము నందున్న–భావమునుచూచు గ్రహములతో పాపగ్రహము లేవియో ఆ పాప గ్రహముల దశాంతర్దశలలో మాతృ మరణము ప్రాప్తించగలదు.

59. 1) రవియొక్క స్ఫుటరాశ్యాధినుండి చంద్రుని స్ఫుటరాశ్యాధిని తీసివేయగా మిగిలిన స్ఫుటరాశ్యాది, ఏ రాశి నవాంశలగునో ఆ రాశి నవాంశలయందు గోచార శనిగానీ గురుడుగానీ సంచరించెడు కాలమునందు మాతృ మరణము కల్గును. లేక ఆ రాశి నవాంశ రాశులకు కోణరాశుల యందైనను గోచార శని – గురు సంచార కాలము మాత్రారిష్ట సూచితమగును.

2) చంద్రుడున్న రాశినుండి అష్టమ రాశ్యధిపతియొక్క స్ఫుట రాశ్యాధియందు, యమకంటక గ్రహ స్ఫుటరాశ్యాధిని తీసివేయగా మిగిలిన స్ఫుటమునకగు రాశి నవాంశలయందు గోచార రవి సంచారకాలము మాతృమృతి మాసమని తెలియవలెను.



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

ఉదాహరణ :- 1. రవి స్ఫుట రాశ్యాది 5-23-55
చంద్రస్ఫుట రాశ్యాది 3-13-38 (-)
2-10-17

ఇది మిధున రాశియందు మకర నవాంశ - కావున మిధున - మకర - కుంభ రాశులయందు శని - లేక గురు సంచారకాలము మాతృ మరణము కాగలదని యూహింపవలెను.

2. చంద్రాదష్టమరాశ్యధిపతి స్ఫుట రాశ్యాది 2-18-37
12-0-0 (+)
యమకంటక స్ఫుట రాశ్యాది 14-18-37
7-24-03(-)
4-24-34

ఇది సింహరాశియందు వృశ్చిక నవాంశ-కావున రవి సింహ - వృశ్చిక రాశులందు సంచరించెడి మాసములందు తల్లి మరణము సూచించ బడగలదు.

(తక్కువగల రాశ్యాదినుండి అధిక రాశ్యాధిని తీసివేయవలెనన్న ఆ తక్కువ రాశ్యాదికి రాశిస్థానమునందు 12 రాశులు కలుపుట గణిత సాంప్రదాయము)

60. చతుర్థ భావమునందు వైశేషికాంశ లేక గోపురాంశ గల గురువుండి, ద్వితీయ-లాభ భావములందు మిగిలిన గ్రహములన్నీ యున్న జాతకుడు గొప్ప సుఖవంతుడు కాగలడు.

61. చతుర్థ భావము నైసర్గిక శుభగ్రహ రాశిగా నుండి - శుభగ్రహ సంబంధముగల బలయుక్తమగు గ్రహమందుండి, లగ్నాధిపతి యొక్క సంబంధమునందిన జాతకుడు సుఖవంతుడగును.

62. చతుర్థాధిపతి శుభగ్రహరాశియందు శుక్రునియొక్క యుతిలేక దృష్టి నందియున్న యెడల సుగంధ పరిమళాదులు గల సౌఖ్యములు ప్రాప్తించగలవు.



63. చతుర్థ-లగ్న భావాధిపతులు ఉచ్ఛస్థితి కల్గియుండి - శుక్రునికి పాపగ్రహ సంబంధము లేకుండిన యెడల జీవితాంతము సుఖ సౌఖ్యములు ప్రాప్తించగలవు.

64. జన్మలగ్నమునందు శుక్రుడున్న జీవితం మొదటి భాగంలో సుఖము. లగ్నాధిపతి గురువు కలిసి కేంద్రములందున్న యోవన కాలమందు సుఖము, పంచమ షష్ఠ-సప్తమ-అష్టమ భావములందు శుభగ్రహము లున్న జీవిత మధ్యకాలంలో సుఖము, భాగ్య-రాజ్య- లాభవ్యయ భావములందు శుభగ్రహములన్నియు నున్న జీవితం చివరికాలంలో సుఖము జాతకునికి ప్రాప్తించగలదు.

65. చతుర్థ భావాధిపతికి శుక్ర లేక చంద్ర వర్గులు కలిగి ఆ శుక్ర-చంద్రుల యుతి లేక దృష్టి పొంది నీచ-శత్రు గ్రహ సంబంధములు లేకుండిన యెడల జాతకునికి పశుసంపదలు ప్రాప్తించగలవు.

66. చతుర్థ భావాధిపతి - భావకారకుడు బలయుక్తుడై శుభగ్రహ వీక్షణ నంది యుండిన బంధువులచే కొనియాడబడగలడు.

67. పాపులయొక్క సంబంధములులేని చతుర్థ భావాధిపతి వైశేషికాంశ కల్గి కేంద్ర కోణములందున్న బంధువుల కుపకారము చేయు వాడగనును.

68. లగ్నాధిపతి -చతుర్థాధిపతి బలయుక్తులై పరస్పర మిత్రత్వముకల్గి శుభస్థానములందుండిన యెడల మంచి స్నేహబలముండగలదు.

69. చతుర్థ భావమునందు గురుడు శుభ సంబంధములు కల్గియుండిన చతుర్థ భావాధిపతిని వీక్షింపుచుండిన యెడల బంధుబల మధికముగా నుండగలదు.

70. చతుర్థ భావమునందు పాపగ్రహము లుండినను లేక చతుర్థ భావాధి పతికి నీచ-అస్తంగత, శత్రుక్షేత్ర స్థితి అను దోషములు కల్గినను బంధువులయెడ ద్వేషము కల్గియుండును.

71. చతుర్థ భావాధిపతియున్న నవాంశ రాశ్యధిపతికి సప్తమాధిపతి యొక్క దృష్టి కల్గిన జలగండము ప్రాప్తించగలదు.

72. లగ్నభావమునందు-లగ్న, చతుర్ధ భావాధిపతులకు చంద్రునితో యుతి కల్గిన యెడల అశ్వ (గుఱ్ఱము) వాహన ప్రాప్తి కల్గును.

73. చతుర్ధ భావాధిపతి శుభస్థానములందు లగ్నాధిపతి మరియు చంద్ర శుక్రులతోటి యుతినందియుండిన అశ్వవాహన ప్రాప్తికల్గును.

74. లగ్నభావమునందు-శుక్రునితో చతుర్ధాధిపతికి యుతి కల్గిన గజ వాహనప్రాప్తి.

75. చతుర్ధ భావములేక ద్వితీయ భావము నైసర్గిక శుభగ్రహరాశియై యుండి అందు చంద్రుడు శుభగ్రహములతో యుతి నంది యుండిన అశ్వవాహనప్రాప్తి కల్గును.

76. చతుర్ధ, భాగ్య భావాధిపతులు బలయుక్తులై యుతినంది స్వక్షేత్ర, ఉచ్ఛ, మూల త్రికోణ స్థితినంది గురుదీక్షితులై యుండిన యెడల ప్రభు మూలకముగా వాహనములు ప్రాప్తించగలవు.

77. లగ్న భావాధిపతి-చతుర్ధ-భాగ్య-లాభ భావముల యందుండగా చతుర్ధాధిపతి కేంద్రమునందుండి ఆ కేంద్రాధిపతి లాభ భావము నందున్న యెడల అనేక వాహనము లుండగలవు.

78. చతుర్ధ భావాది ఉచ్ఛస్థితియందు దశమాధిపతితో యుతి నందిన అనేక వాహనముల కధిపతి కాగలడు.

79. దశమ భావాధిపతి చతుర్ధ భావమునందు లాభ భావాధిపతితో యుతి నందిన అనేక వాహనముల కధిపతి కాగలడు.

80. చతుర్ధ భావాధిపతికి ఉచ్ఛస్థితికల్గి చతుర్ధ భావమునందు ఉచ్ఛస్థితి గల గ్రహముండి-చతుర్ధ భావాధిపతియున్న రాశ్యధిపతి కేంద్ర కోణము లందున్న మూడు వాహనములు లుండగలవు.

81. చతుర్ధ భావమునందొక ఉచ్ఛస్థితిగల గ్రహముండగా ద్వితీయాధిపతి లగ్నమునందు, రాజ్యాభావాధిపతి ద్వితీయమునందు నుండిన అనేక వాహనములు ప్రాప్తించగలవు.



82. చతుర్ధ భావాధిపతి శుక్రునితో యుతి నంది కేంద్రకోణము లందుండగా లగ్న భావమునందు గురుడున్న గొప్ప వాహనము ప్రాప్తించును.

83. లగ్న భావాధిపతికి కేంద్రములందు చతుర్ధాధిపతియు, ఆ చతుర్ధాధి పతికి కేంద్ర స్థానములందు భాగ్యాధిపతియు నుండి లగ్నాధిపతి బలయుక్తుడైన యెడల అనేక వాహనములకు అధిపతిగానీ అధికారి గానీ కాగలడు.

84. చంద్రునికి తృతీయమందు శుక్రుడు శుభ సంబంధములు కల్గియున్నను లేక శుభస్థానములందున్న చంద్ర-శుక్రులు పరస్పర వీక్షణ కల్గి యున్నను నిరంతర వాహన సంచారి కాగలడు.

85. ఇతరమగు వాహన ప్రాప్తికిగల గ్రహస్థితి -

1) చంద్ర - చతుర్ధాధిపతు లిర్వురికి లగ్నస్థితి
2) చంద్ర - లగ్నాధిపతు లిద్దరికి లగ్నస్థితి
3) చతుర్ధాధిపతి-గురు లేక శుక్రులకు లగ్నస్థితి
4) లగ్న-దశమాధిపతులకు దశమ-లగ్న భావములందు పరివర్తన
5) చతుర్ధాధిపతి బలయుక్తుడై-చతుర్ధమునందు శుభగ్రహములుండి వీక్షణ కల్గుట.
6) చతుర్ధ భావాధిపతికి భావమునందు బుధయుతి శుభ నవాంశ స్థితి కల్గుట.
7) చతుర్ధాధిపతికి కేంద్ర కోణములందు గురుయుతి కల్గియుండుట
8) చతుర్ధాధిపతికి చతుర్ధ లేక లాభ భావస్థితికల్గి కుజుడు స్వక్షేత్ర లేక లాభ భావస్థితి యందుండుట.
9) చతుర్ధ భావస్థిత గ్రహము-చతుర్ధ భావాధిపతి, భావమును భావాధిపతిని చూచుచున్న గ్రహములు కేంద్ర - కోణములందు లాభ భావమునందు యుండినను, జాతకుడు మంచి వాహనములు కల్గి సుఖము నందగలడు.

86. చతుర్ధ భావాధిపతి దశమ భావమునందుండి శుభగ్రహ యుతినందిన రాజచిహ్నములు ప్రాప్తించగలవు.

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

87. చతుర్థాధిపతి భాగ్యాధిపతి, ఈభావముల యందున్న గ్రహములు శుభవర్గులు కల్గిబలయుక్తులై లగ్నభావముతో ఏదో ఒక సంబంధము కల్గి పరస్పర యుతి, దృష్టి క్షేత్రస్థితి, నక్షత్ర వర్తనములను సంబంధములు కలిగి యుండిన యెడల రాజచిహ్నములు కల్గి గొప్ప సంపదలు, అధికారము, సర్వసుఖములు, దీర్ఘాయువు పొందు వాడగును.

(ఈ యోగమునందు చతుర్థ భావాధిపతిగానీ భావకారకుడుగానీ లగ్నాధిపతికి శత్రువు కాకూడదు)

88. చతుర్థాధిపతి శతుర్దాశి, నీచరాశి, దుస్థానములయందు భాగ్యాధిపతి యొక్క దృష్టినందిన యెడల అతిచెడ్డ వాహనములు కలిగి యుండును.

89. లగ్న, భాగ్య, రాజ్య భావములందున్న శుభగ్రహములు (తమ ఉచ్చభాగలయందు లేక ఉచ్చాంశలయందు నుండి) లగ్నాధిపతి యొక్క దృష్టినంది యుండిన యెడల వాహనమువలన దుఃఖము కల్గును.

90. చతుర్థ భావాధిపతి దుస్థానముల యందుండి పాపగ్రహ దృష్టి నందిన వాహన భంగము కల్గును.

91. చతుర్థ భావాధిపతి అష్టమ భావమునందు, దశమ భావాధిపతి వ్యయభావమునందు, శుక్రుడు షష్ఠ భావమునందు స్థితినంది యుండగా చతుర్థ భావమునందు, పాప గ్రహములున్న యెడల వాహన సంబంధమగు గండములు ప్రాప్తించగలవు.

92. చతుర్థ భావముయొక్క నవాంశ రాశ్యధిపతి శుక్రునితో యుతి నంది అష్టమ భావము నందుండి కుజదృష్టి లేక అష్టమాధిపతి దృష్టినందిన యెడల వాహనములద్వారా మృత్యువు కల్గును.

(శుభగ్రహ సంబంధము లుండరాదు)

93. ఈ క్రింది దెలుపబడిన గ్రహస్థితివలన జాతకునికి సింహాసన యోగము. (అధికారయుతమగు పదవి) ప్రాప్తించగలవు.

1) లగ్న భావమందు శుభగ్రహస్థితి భాగ్యభావమున ఉచ్చగ్రహ స్థితి, ధనాధిపతికి కేంద్ర స్థితి కల్గియుండట.



2) శుభగ్రహయుతిగల ద్వితీయ భావాధిపతికి కేంద్రస్థితి, ద్వితీయ భావమునందు ఉచ్చగ్రహస్థితి యుండగా భాగ్యభావమునకు శుభగ్రహ వీక్షణ యుండుట.

3) లగ్న-చతుర్థ, భాగ్య భావాధిపతులు దశమ భావమునం దుండగా దశమభావాధిపతి లగ్నమునందుండుట లేక చూచుట.

4) లగ్న-చతుర్థ, రాజ్య భావాధిపతులు రాజ్య భావము నందుండగా దశమాధిపతికి లగ్నభావము యొక్క సంబంధ ములు కల్గుట.

5) చతుర్థాధిపతి, దశమభావస్థితి గ్రహము సంపూర్ణ బలయుక్తులై భాగ్యాధిపతియొక్క యుతి, లేక దృష్టినందుట.

ఈ యోగములు జాతకునికి అధికారమును కలిగించగలవు. చతుర్థాధిపతి దశాంతర్దశలో దశమాధిపతి విదశాకాలమునగానీ, దశమాధి పతి దశాంతర్దశలలో చతుర్థాదిపతి విదశాకాలముగానీ లేక చతుర్థాధిపతి దశలో దశమాదిపతి అంతర్దశ - చతుర్థాధిపతి విదశలేక దశమాధిపతి దశలో చతుర్థాధిపతి అంతర్ధశ దశమాధిపతి విదశాకాలములందీ యోగములు ప్రాప్తించగలవు.

94. చతుర్థ భావాధిపతి బలయుక్తుడై కేంద్ర కోణముల యందున్న గృహయోగము.

95. 1. చతుర్థాధిపతి బలయుక్తుడై యుండగా తృతీయభావమున శుభ గ్రహమున్నను,

2. చతుర్థాధిపతి గోపురాంశ యందున్నను, స్వగృహ యోగము కల్గును.

96. ఈ క్రింద దెలుపబడిన గ్రహస్థితివలన గృహము ప్రాప్తించగలదు.

1) లగ్నాధిపతి సప్తమాధిపతితో కలిసి లగ్న లేక సప్తమము లందుండుట.

2) బలవంతుడగు లగ్నాధిపతికి స్వక్షేత్ర - మిత్రక్షేత్ర, ఉచ్చస్థితి కల్గుట.

3) నవమాధిపతి కేంద్రమునందుండగా చతుర్థాధిపతి ఉచ్చ, స్వక్షేత్రములందుండుట, లేక చతుర్థ భావమునందు ఉచ్చ గ్రహముండుట.

4) చతుర్థ-దశమాధిపతులు కలిసి యుండగా శని కేంద్రము నందుండుట.

5) లగ్నాధిపతి-ఉచ్చ, మూలత్రికోణ, స్వక్షేత్ర, మిత్రక్షేత్రము లందు చతుర్థ భావాధిపతితో కలిసియుండి శుభగ్రహ సంబంధము కలిగి యుండుట.

6) చతుర్థ భావాధిపతియున్న నవాంశ రాశ్యాధిపతి కేంద్రస్థానము లందు శుభ సంబంధములు కలిగి యుండుట.

7) దశమ భావాధిపత్యముగల శని చతుర్థాధిపతితో యుతినంది కేంద్రముల యందుండుట.

8) చతుర్థాధిపతిగానీ శుక్రుడుగానీ ద్వితీయాధిపతి లేక లాభాధిపతితో యుతినంది శుభగ్రహ దృష్టినంది శుభస్థానము లందుండుట.

ఈ యోగములు గలజాతకులకు స్వగృహ ప్రాప్తికలుగ గలదు.

97. చతుర్థభావము చరరాశిగానుండి, భావాధిపతి శుభగ్రహ వీక్షణ నంది చరరాశియందుండిన అన్యదేశములందు (ఇతర రాష్ట్రములందు) గృహ ప్రాప్తి కల్గును. కారక గ్రహముకూడా చరరాశియందున్న అనేక ప్రదేశములందు గృహము లుండగలవు.

98. కేంద్ర కోణములందు ద్వితీయ, చతుర్థ, వ్యయాధిపతుల యుతి వల్ల గృహప్రాప్తి-లగ్న-సప్తమాధిపతులకు చతుర్థ భావమునందు యుతివల్ల గృహ యోగము.



99. జన్మలగ్నము-అంశలగ్నము అనువానిలో బలాధిక లగ్నమునకు చతుర్థ స్థానమునందు చంద్ర-శుక్రులున్న ఉన్నత గృహము, శని రాహువులున్న పాషాణ (రాళ్ళచే నిర్మించబడిన) గృహము, కుజ-కేతువులున్న, ఇటుకలచే నిర్మించిన గృహము, గురువున్న కఱ్ఱలచే నిర్మించిన గృహము, రవియున్న గడ్డి-ఆకులచే నిర్మించిన గృహము ప్రాప్తించును.

100. చతుర్థ భావమునందు భావాధిపతి - లగ్నాధిపతితో యుతి నంది యుండగా ఆ భావరాశి వారిలో ఒకరికి ఉచ్చ-మరొకరికి మిత్ర క్షేత్రముగా నుండిన ఆకస్మిక గృహలాభము కల్గును.

101. చతుర్థ భావాధిపతి దుస్థానము లందుండి పాపగ్రహ వీక్షితుడైనను, నీచ-శత్రుక్షేత్ర స్థితిగల రవి లేక కుజుడు చతుర్థ భావము నందున్నను, చతుర్థ భావమున స్థితినందిన గ్రహము పాపాధిక్యత కల్గియున్నను, ద్వితీయ-చతుర్థ వ్యయాధిపతులు తృతీయ షష్ఠ అష్టమ భావము లందున్నను - చతుర్థాధిపతియున్న నవాంశ రాశ్యాధిపతి అష్టమ భావము నందున్నను - భావము - భావాధిపతి. భావకార కుడు, భావస్థిత గ్రహము అనువారు దుస్థానములందు పాపాధిక్యత కలిగియున్నను లేక నీచ-శత్రుక్షేత్ర, అస్తంగతాది దోషములు కలిగి యున్నను జాతకునికి స్వగృహప్రాప్తియుండదు.

102. చతుర్థ భావము నైసర్గిక శుభగ్రహ రాశియై యుండి, భావాధిపతి, కుజుడు శుభగ్రహముల యుతికల్గి బలాధికులై యుండిన యెడల జాతకునికి భూమి-క్షేత్రములు నుండగలవు.

103. చతుర్థాధిపతి-భావకారకుడగు కుజుడు, పాపగ్రహ సంబంధములు గల్గి దుస్థానములందుగానీ, నీచ-శత్రుక్షేత్రములందుగానీ యున్నను, శత్రువర్గులు పొందినను, శూల, కాలాగ్నివంటి షష్ట్యంశలు కలిగి యున్నను జాతకునికి క్షేత్రములు, భూములు నశించగలవు.

104. ఈ క్రింది యోగములు ప్రాప్తించిన జాతకుడు భూములు, స్థలములు గల్గి యుండును.

1) చతుర్థ-దశమాధిపతులకు దశమ-చతుర్థములందు పరివర్తన కల్గి కుజుడు శుభస్థానములందు బలయుక్తుడై యుండుట.

2) చతుర్థ-దశమాధిపతులు బలయుక్తులై పరస్పరము మిత్ర గ్రహము లగుట.

3) చతుర్థాధిపతికి లాభ భావస్థితియందు గోపురాంశ లేక మలిద్యంశ కల్గుట.

4) లగ్న-చతుర్థాధిపతులు బలయుక్తులై శుభగ్రహ దృష్టినంది చతుర్థ - లగ్న భావములందు పరివర్తన కల్గియుందుట.

5) చతుర్థాధిపతి చతుర్థ భావమున కారోహణస్థితియందు శుభ గ్రహదృష్టి కల్గియుండుట.

6) చతుర్థ భావము-భావాధిపతి, కారకుడు అనువారికి ద్వితీయ-లాభాధిపతుల యుతి లేక దృష్టి కల్గుట.

7) చతుర్థ-తృతీయ భావాధిపతులు కేంద్ర కోణస్థానములందు యుతి నంది శుభగ్రహ సంబంధములు కల్గియుండుట.

8) చతుర్థ భావము నైసర్గిక శుభరాశియై యుండి భావాధిపతి లాభస్థితి యందుండగా కుజుడు కేంద్రములందు ఉచ్ఛస్థితి కల్గి యుండుట.

105. చతుర్థ భావమునకు-భావాధిపతికి ఏ భావాధిపతులయొక్క బలయుక్తమగు సంబంధము కల్గునో ఆ భావ కారకత్వముద్వారా భూక్షేత్ర ప్రాప్తికల్గును. (8-12 భావములు కాక)

106. చతుర్థ భావాధిపతి పాపగ్రహ యుక్తుడై ద్వితీయ భావమునందున్నను లేక శత్రు-నీచ అస్తగతాది దోషయుక్తుడైనను-ఉచ్ఛ యందున్నను పాపగ్రహ యుతి కల్గినను భూప్రాప్తియుండదు. ఇదే విధముగా పాప గ్రహయుక్తుడై దశమాధిపతి చతుర్థ భావము నందున్నను, భావము నకు పాపగ్రహార్గళ కల్గినను, భావము-భావాధిపతి-కారకుడు అధిక పాప సంబంధములు కల్గియున్నను, భూక్షేత్ర ప్రాప్తియుండదు.



107. చతుర్థ భావమునందు పాపగ్రహములుండగా భావాధిపతి మాందీ లేక గుళికునితో యుతి నందిన పాపికాగలడు.

108. చతుర్థ భావమునందు స్థితిగల శుక్రునికి బుధుని వీక్షణకల్గిన, లేక శుభగ్రహ అర్గళకల్గి గోపురాంశ యందున్నను పుణ్యాత్ముడు కాగలడు.

109. చతుర్థ భావాధిపతి శుభ బలాధిక్యతనంది లగ్న భావమునందున్న యెడల సంకల్ప సిద్ధి, వాహనప్రాప్తి విద్యావివేకములు, మైత్రీభావము, భూములు, పశువులు సుఖజీవనము కల్గును-పాపబలయుక్తుడైన చతుర్థాధిపతి లగ్నమునందున్న మాతృకష్టము-విద్యాభంగము, క్షుద్రవాహనములు, పిత్రార్జిత ఆస్తులనమ్మి జీవించుట కల్గును-మిశ్రమ బలమునందు మిశ్రమ ఫలములుండగలవు.

విశేషము:- చతుర్థ భావాధిపతియున్న లగ్న భావము చరరాశులైన దూర ప్రాంతములందు స్థిరరాశులైన జన్మస్థలమునందు - ద్విస్వభావ రాశులైన పలు ప్రాంతములందు నివాసము కల్గును.

110. చతుర్థ భావాధిపతిని శుభబలయుక్తుడై ద్వితీయ భావమునందున్న జాతకునికి తల్లి పుట్టినింటివారి యొక్క ధనసంపదలు ప్రాప్తించ గలవు. భూవృద్ధి, వాహనములు కల్గును. ప్రభుత్వమునకు అధిక పన్నులు చెల్లించునంత ఆదాయము ప్రాప్తించును. భోజన సౌఖ్యము-కుటుంబ సౌఖ్యములు ప్రాప్తించగలవు. పాప బలముగల చతుర్థాధిపతివల్ల పై ఫలితములు వ్యతిరేకముగా నుండగలవు.

111. చతుర్థ భావాధిపతి శుభ బలయుక్తుడై తృతీయ భావము నందుండిన భూగృహ సంపదలు స్వల్పముగా నుండగలవు. పిత్రార్జిత భూసంపద అధికముగా నున్నను విక్రయించబడగలవు. సవతితల్లి, సవతి సోదరులు ప్రాప్తించి వారివల్ల ద్వేషించబడగలరు. చతుర్థాధిపతికి పాపబలమువల్ల విపరీత ఫలితములు కలుగగలవు.

112. చతుర్థ భావాధిపతి భావమునందు శుభబలము కల్గియుండిన యెడల సుఖసౌఖ్యప్రాప్తి కల్గును. చతుర్థాధిపతిలో బాటుగా ఆయా కారకులు కూడా బలయుక్తులై శుభస్థానముల యందుండిన భూగృహ, దన

సంపదలు కల్గును. విద్యా-వాహనములు కల్గి ప్రసిద్ధుడై కీర్తి గాంచగలడు. పై గ్రహములకు పాపబలము - పాపగ్రహ సంబంధముల వలన పై ఫలితములు వ్యతిరేకముగా నుండగలవు.

113. చతుర్థ భావాధిపతి శుభ బలాధిక్యతకల్గి పంచమ భావమునందున్న యెడల జాతకునితల్లి పుట్టినింటివారు సంపన్న కుటుంబీకులై యుండగలరు. జాతకుని పుత్రులు ధన సుఖాదులు కలిగి యుండగలరు. పంచమాధిపతికూడా శుభ బలాధికుడై శుభస్థానముల యందుండిన జాతకు దధిక భాగ్యవంతుడై రాజమంత్రి గానీ గ్రామముల కధిపతిగానీ యగును. పైగ్రహములు పాప సంబంధీకులై బలహీనులై యున్న ఫలితములు విపరీత (వ్యతిరేక) ముగా నుండగలవు.

114. చతుర్థ భావాధిపతి బలయుక్తుడై శుభగ్రహ సంబంధమై షష్ఠభావమునందున్న యెడల మేనమామలు ప్రాబల్యము కల్గియుండగలరు. ఈ స్థితియందు ఆయా కారకులు బలయుక్తులై శుభ సంబంధముకల్గి శుభస్థానములందున్న ఆ కారక ఫలితములు సామాన్య స్థితిలో ప్రాప్తించగలవు. చతుర్థాధిపతి కారకులు బలహీనులై యెడల కారక ఫలితములకు భంగము కలిగించగలరు. షష్ఠభావము నందు చతుర్థాధిపతి యుండగా ఆ షష్ఠభావాధిపతి లగ్నమునందున్న దేహపీడ లేక శత్రుపీడలు కల్గును. షష్ఠ భావాధిపతి చతుర్థమునందున్న మాతృపీడ-వాహన భంగములు కల్గును. చంద్రుడు కూడా బల రహితుడైన మాతృ మరణము కల్గును. కుజుడు బలహీనుడై అష్టమాధిపతి దృష్టినందిన జాతకునియొక్క క్రియాశక్తి, మాట మన్నన గౌరవము, భూసంపదలు నశించుటయే గాక పదవీచ్యుతి ప్రాప్తించగలదు. శుక్రుడు బలహీనుడై పాపసంబంధము కల్గియున్న పశుసంపదలు-వాహనములు, సుఖము నశించగలవు. మరియు ఖర (గాడిద) వాహనప్రాప్తి అగౌరవము, మానహాని, అపకీర్తి, వాహన పతనము, అంగలవైకల్యము కంటి దుష్ఫలితములు ప్రాప్తించగలవు.

115. చతుర్థాధిపతి బలయుక్తుడై శుభ సంబంధముకల్గి సప్తమ భావము నందున్న జాతకుడు జీవితాంతము సుఖములు పొందగలడు. ఆ



సప్తమ భావము-చరరాశిగా నున్న దూరదేశమునందు-స్థిరరాశిగా నున్న సమీప ప్రదేశములందు-ద్విస్వభావ రాశిగానున్న దూరప్రాంత ములందు విద్యార్జన-ధనార్జన లుండగలవు. పాప సంబంధములుగల చతుర్థాధిపతి సప్తమ భావము నందున్న బాల్యమునందే మాతృ వియోగము కల్గును. బలహీనుడై పాపసబంధయైన ప్రయాణ కాలమునందు వాహన ప్రమాదము కల్గును.

116. చతుర్థాధిపతి శుభయోగములతో కూడి బలయుక్తుడై అష్టమభావము నందున్న యెడల భూగృహాది సందలన్నియు నశించి దరిద్రుడగును. ఋణపీడలుకల్గును. బలహీనుడై పాపగ్రహ సంబంధములు కల్గియున్న స్వల్పమగు భూములు సంపదలు స్వల్ప వాహనాదులు ప్రాప్తించగలవు.

117. చతుర్థభావాధిపతి బలయుక్తుడై శుభగ్రహసంబంధముకల్గి భాగ్యభావము నందున్న పిత్రార్జిత భూగృహాదుల లుండగలవు. విద్యావాహన సౌఖ్యములు పొందగలడు. పాపగ్రహసంబంధమువలన పైఫలితములు కలుగవు.

118. చతుర్థాధిపతి శుభ సంబంధియై బలముకల్గి యుండిన ఆధిపత్యము, (ఉద్యోగము) కల్గును. భూసంపద మూలముగా ప్రసిద్ధి వహించి-విద్య వలన కీర్తిగాంచి, సుఖము నందగలడు పాపగ్రహ సంబంధాదులవలన ప్రభుత్వ బాధలు శత్రువులచే ఆస్తి-గౌరవ మర్యాదలకు హాని, మొదలగు దుష్ఫలితములు ప్రాప్తించగలవు.

119. చతుర్థ భావాధిపతి బలయుక్తుడై శుభ సంబంధముకల్గి లాభ భావమునందున్న జ్యేష్ఠ సోదరులద్వారా విద్యా వాహన యోగాదులు ప్రాప్తించగలవు. లాభాధిపతి బలయుక్తుడై లగ్నమునందున్న అనేక విదములుగా ధనార్జన గావించి ఖ్యాతి వహించగలడు. పాపగ్రహ సంబంధమువల్ల పై ఫలితములు వ్యతిరేకముగా నుండగలవు.

**విశేషము:-** శుభ యోగాధికుడైన చతుర్థాధిపతి ఏకాదశ భావము నందుండి- చంద్రుడు బలవంతుడైన యెడల విశేష మాతృభాగ్యము ప్రాప్తించగలదు. పశువ్యాపారము-తండ్రికి అధిక కళత్రములు కల్గును.

120. చతుర్థ భావాధిపతి శుభయోగ బలాదులుకల్గి వ్యయ భావము నందున్న జాతకుడు దరిద్రుడు కాగలడు. భూగృహాదులు నిలువవు. పాప

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

సంబంధముకల్గి వ్యయ భావమునందున్న బాల్యమందే మాతృ వియోగముకల్గి అతికష్టములు పొందగలడు.

121. చతుర్థ భావమునుండి దుస్థానములగు 6-8-12 స్థానములందు పాపగ్రహ స్థితి కల్గియుండగా ఆ దుస్థానాధిపతులు చతుర్థ భావము నందున్న యెడల - వారున్నరాశి అంశ, నక్షత్రములందు గోచార శని సంచారకాలమునందు భావఫలితములకు హాని నొసంగును. అట్టి దుస్థానాధిపతి దశ భావ నాశన కారణమగును.

## 4.చతుర్థ భావస్థిత గ్రహ ఫలితములు

చతుర్థ భావముయొక్క కారకత్వము కలుగని ఏ ఇతర గ్రహ సంబంధములు లేని దుస్థానాధిపత్యములుండని రవ్యాది గ్రహములు చతుర్థ భావమునందు స్థితి నందుటవల్ల కల్గు ఫలితములు సంగ్రహముగా దెలుపబడుచున్నవి.

1. రవి గ్రహ స్థితివలన-పితృ వ్యతిరేకత, బంధువులు లేకుండుట, అస్థిర నివాసము భూగృహక్షేత్ర హీనత, స్వల్ప సుఖ భోగములు, మాతృసౌఖ్య లోపము హృద్రోగపీడ సామాన్య ప్రభుత్వోద్యోగములు ప్రాప్తించ గలవు.
2. చంద్ర గ్రహస్థితి వలన - మంచి మిత్రులు, మాతృ సౌఖ్యము, విద్యా వినయ సౌశీల్యములు, దాతృత్వము, దృఢశరీరము - బలము, ఆయువు, విద్యా వాహన గృహ సౌఖ్యములు కల్గును.
3. కుజగ్రహ స్థితివలన - దుర్భలత్వము-మూర్ఖత్వము బంధు ద్వేషము, విద్యాటంకములు, పరగృహ భోజనము, భూగృహ వాహనమాతృ సుఖలోపములు, రోగపీడలు కల్గును.
4. బుధగ్రహ స్థితివలన-హాస్య వచనములు, విద్యా పాండిత్యములు. గీతావాద్య విద్యలు మాతృసౌఖ్యము మిత్రులు. భూమి-ధనము-ఐశ్వర్యము, సంతోషము కల్గును.
5. గురు గ్రహ స్థితివలన-రాజానుగ్రహము-భూవిద్యా గృహవాహన లాభములు పశుసంపద భార్యాపుత్రులు-ధనధాన్య సంపదలు-సేవకా జనములు కల్గును.



6. శుక్రగ్రహ స్థితివలన- ఉన్నతములగు గృహవాహనములు, సర్వజన ప్రియత్వము, లలితకళలు, వస్తు వస్త్రాభరణ సుగంధాలంకారములు, అధిక కామాసక్తి కల్గును.
7. శనిగ్రహ స్థితివలన-బాల్యమునందు రోగము, అస్థిరత్వము, నివాసగృహము కొరకు ఇబ్బందులు మాతృసౌఖ్యహాని, భూగృహ వాహన లోపము-సుఖహీనత, భూనష్టము, తల్లిని పీడించుట కల్గును.
8. రాహుగ్రహ స్థితివలన-అల్పాయువు, నీచస్నేహములు, శిధిల గృహనివాసము, మతి భ్రమణము, మూర్ఖత్వము-దుఃఖము, వాహన రాహిత్యము, మాతృపీడ, స్వల్ప భూవసతి కల్గును.
9. కేతువు స్థితివలన-స్వస్థానచ్యుతి. తొందరపాటు, భూ-గృహవాహన, మాతృసుఖములు లోపించుట, పరధనాపేక్ష పిత్రార్జితనష్టములుకల్గును.

## చతుర్థ భావమునకు గ్రహదృష్టి ఫలితములు

దుస్థానాధిపత్యములు - ఇతర గ్రహ సంబంధములు కలుగని రవ్యాది గ్రహములు చతుర్థ భావమును చూచుటవల్ల కల్గు ఫలితములు సంగ్రహముగా దెలుపబడుచున్నవి.

| | |
|---|---|
| రవి దృష్టివలన | క్రూరత్వము - హృద్రోగము |
| చంద్ర దృష్టివలన | విద్య సంపద - పరస్త్రీలోలత |
| కుజ దృష్టివలన | శౌర్యము-భార్య విధేయత |
| బుధ దృష్టివలన | జ్ఞాన ధన పాండిత్యములు |
| గురు దృష్టివలన | రూప బల ధన సుఖములు |
| శుక్ర దృష్టివలన | సుఖ యశో విద్యాధనములు |
| శని దృష్టివలన | కపటము - మాతృక్లేశములు |
| రాహు దృష్టివలన | భార్య బంధు విరోధము |
| కేతు దృష్టివలన | పరుల బాధించు స్వభావము |

మాందీ-గుళికలు చతుర్థ భావమునందున్నను - భావమును చూచినను, భావాధిపతి - కారకులతో యుతి పొందిన ఆ భావము యొక్క ఫలితములకు హాని చేయగలరు.



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

# 5. పంచమ (పుత్ర) భావ ఫలితములు

పంచమ భావము లగ్నాధిగా ఐదవ భావము - ఈ భావము ద్వారా జాతకునియొక్క పుత్రులు సంతానవృద్ధి, మనస్సు, బుద్ధి, ఆలోచనలు ఆత్మశక్తి, పాండిత్యప్రతిభ, యాత్రలు, దైవోపాసన, మంత్రదీక్షలు, దానము, క్షేమము, అధికారము, రహస్యవిషయములు, కార్యవిఘ్నములు మొదలగు విషయములను తెలుసుకొనదగియున్నవి.

పంచమ భావముద్వారా గ్రహించవలసిన పై విషయములందు పంచమభావ రాశ్యధిపతి బావాధిపతి కాగలడు. పుత్రులు సంతాన విషయములకు దానములకు, దైవోపాసన, మంత్రదీక్షలకు, గురుగ్రహము కారకుడు మనస్సు-బుద్ధి ఆలోచన, యాత్రకు చంద్రుడు కారకుడు. ప్రజ్ఞ పాండిత్య ప్రతిభలకు బుధుడు కారకుడు. అధికారమునకు రవి-శుక్రులు కారకులు. రహస్య విషయములకు శని-రాహువులు కారకులు కాగలరు. పంచమభావంతో బాటుగా కొన్ని విషయములకు చతుర్థ-ద్వితీయ, రాజ్య, వ్యయ భావములుకూడా ప్రాధాన్యత వహించి యుండగలవు.

పంచమ భావము, భావాధిపతి, అతడున్న రాశ్యధిపతి లేక నవాంశాధి పతి కారకుడు అనువారి బలాబలముల ననుసరించి భావ సంబంధిత ఫలితములు కలుగ గలవు. పైన దెల్పిన ప్రధాన గ్రహములు శుభస్థానము లందు ఉచ్చ-మూలత్రికోణ స్వక్షేత్ర-మిత్రక్షేత్ర స్థితికల్గి శుభగ్రహ సంబంధము కల్గియుండుట తమయొక్క ఉచ్చ-మిత్రగ్రహ, స్వక్షేత్రశుభగ్రహ నవాంశల యందుండుట-స్వకీయ షడ్వర్గులుకల్గి శుభాధిక దశవర్గ బలము కల్గియుండుట, భావాధిపతి- కారకుడు జన్మలగ్నాధిపతికి మిత్రులై యుండుట, భావమునుండిగానీ, లగ్నమునుండిగానీ కేంద్ర-కోణస్థానాధిపతులతో పరివర్తనజెంది యుండుట. జన్మ నక్షత్రమునకు శుభతారలగు 2-4-6-8-9 తారల యందుండుట-శుభ నవాంశలుకల్గి ఉచ్చ స్థితియందున్న గ్రహములతో యుతి నంది యుండుట అనునవి ముఖ్యమగు బలములుగా దెలుపబడినవి.

పంచమభావము, భావాధిపతి, అతడున్న రాశి - నవాంశాధిపతులు కారకుడు అనువారు దుస్థానములగు 6-8-12 స్థానములందుండుట, దుస్థానాధిపతలు సంబంధములు కల్గుట పుత్ర భావమునందు షష్ఠాష్టమ వ్యయాధిపతు లుండుట, మరియు వీక్షించుట - పైన దెల్పిన ప్రధాన



గ్రహములు తమ నీచ-శత్రుక్షేత్ర, పాపగ్రహ రాశులయందు-వాటి నవాంశ రాశులయందు నుండుట, నీచ గ్రహ-పాపగ్రహ-శత్రు గ్రహములయొక్క యుతి దృష్టి నందుట, అస్తంగతత్వము నందుట, పాప షడ్వర్గులుకల్గి దశవర్గ బలము తరగి యుండుట, భావసంధులయందుగానీ ఆ భావ సంధులకు ఆరోహణ యందుగానీ యుండుట, జన్మలగ్నాధిపతికి శత్రుగ్రహములై యుండుట, జన్మనక్షత్రమునకు దుష్టతారలగు 3-5-7 తారల యందుండుట బలహీనమగు విషయములుగా దెలుపబడినవి. శుభ బలాధిక్యతవల్ల భావ ఫలములు సంపూర్ణ శుభప్రదమై యుండగలవు. పాపబలాధిక్యతవల్ల దుష్ఫలితముల నొసంగగలవు. శుభాశుభ మిశ్రమ బలములవల్ల ఫలితములు కూడా మిశ్రమ ఫలదాయకములుగా ప్రాప్తింపుచుండగలవు. ముఖ్యముగా భావము భావాధిపతి, భావకారకుడు. భావమునందున్న గ్రహము బలయుక్తులై యుండిన పూర్ణఫలము కల్గును. ముగ్గురు మాత్రమే బలయుక్తులై 3/4 వంతు ఇద్దరి బలమువల్ల 1/2 ఫలము, ఒక్కరి బలమువల్ల 1/4 వంతు ఫలము ప్రాప్తించగలదు.

1. పంచమ భావము బలయుక్తముగా నుండి శుభబలము గల్గిన బుధ గురు శుక్రులలో ఏ ఇద్దరైనను భావస్థితినందియున్న పుత్రసంతతి ప్రాప్తించగలదు.
2. పంచమ భావాధిపతి బలయుక్తుడై యుండి లగ్నాధిపతియొక్క యుతి లేక దృష్టినంది శుభ స్థానములందున్న సంతానప్రాప్తి కల్గును.
3. మేష-సింహరాశి-వృశ్చిక రాశులలో నొకరాశి పంచమ భావమై యుండి అందు బలయుక్తుడైన కుజునికి స్థితికల్గి గురుని యుతి లేక దృష్టి ప్రాప్తించిన యెడల పుత్ర ప్రాప్తి కల్గును.
4. పంచమ భావము శుభగ్రహముల మధ్య యందుండగా భావము నందు బలయుక్తుడగు భావాధిపతి శుభగ్రహ దృష్టి కల్గియుండిన సంతాన ప్రాప్తికల్గును.
5. రవి-కుజ-గురువులలో నెవ్వరికైనను పుత్ర స్థానాధిపత్యముకల్గివారు పురుష గ్రహ రాశి-నవాంశయందు బలయుక్తులై యుండిన యెడల పుత్రులు కలుగగలరు.



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

6. పంచమ భావాధిపతి పరమోచ్చస్థితికి కలిగియుండగా ఆ భావము నందు శుభగ్రహములుండి పాపసంబంధములు లేక యుండిన పుత్ర సంతాన ప్రాప్తి కల్గును.

7. పంచమ భావాధిపతి బలయుక్తుడై శుభగ్రహ దృష్టినంది శుభస్థానము లందు స్థితికల్గి దుస్థానాధిపతుల సంబంధములు లేకుండిన యెడల పుత్రులు పౌత్రులు కూడా కలుగ గలరు.

8. పంచమ భావమునందు బలయుక్తుడగు లగ్నాధిపతి యుండగా భావాధిపతి, గురువు శుభగ్రహ సంబంధిత బలయుక్తుడైన యెడల పుత్రుడు కల్గును.

9. పంచమ భావమునకు కధిపతియగు గ్రహము – గురువు వైశేషికాంశ యందుండగా పంచమ భావమునకు భాగ్యాధిపతి దృష్టికల్గిన యెడల పుత్రుడు కల్గును.

10. పంచమ భావాధిపతి గురువైయుండి పరిపూర్ణబలయుక్తుడై లగ్నాధిపతి యొక్క దృష్టినంది శుభస్థానములందున్న సంతానము ప్రాప్తించగలదు.

11. పంచమ భావామునందు బలయుక్తుడగు ద్వితీయాధిపతి యుండి గురుదృష్టి నందిన యెడల పుత్ర ప్రాప్తి కల్గును.

12. లగ్న–పంచమాధిపతులు బలయుక్తులైయుండి పరస్పర యుతి– దృష్టి భావపరివర్తనల నందియుండిన పుత్రసంతాన ప్రాప్తియుండ గలదు.

13. పంచమ భావాధిపతియున్న అంశరాశ్యధిపతి పాప సంబంధములు లేక శుభగ్రహములతో కలిసినను, జూడబడినను పుత్ర సంతాన ప్రాప్తి యుండగలదు.

14. లగ్నాధిపతి సప్తమ భావమునందు, భాగ్యాధిపతితో కలిసి బలయుక్తుడై యుండగా ద్వితీయాధిపతి లగ్నభావమునందున్న యెడల సంతానప్రాప్తి కల్గును.

15. పంచమ భాగ్యాధిపతు లిర్వురు బలయుక్తులై లాభ భావమునందున్న యెడల సంతాన ప్రాప్తి కల్గును–(వీరికి దుస్థానాధిపతుల సంబంధ ముండరాదు)



16. పంచమ భావమునకు శుభగ్రహ సంబంధము కల్గియుండగా భాగ్య భావమునందు శుక్రుడు–తృతీయ భావమునందు రవి స్థితినంది యుండిన వివాహాంతరము స్వల్ప కాలంలోనే పుత్ర సంతానము కలుగగలదు.

17. పంచమ భావాధిపతి లేక లగ్నాధిపతి బలయుక్తులై ద్వితీయ లేక తృతీయ భావములందున్న యెడల మొదట పురుష సంతతికల్గును. (సంతాన యోగమున్నప్పుడు)

18. పంచమ భావాధితియున్న రాశికి 5–7–11రాశులలో లగ్నాధిపతి యున్న యెడల మొదట పురుష సంతానము కల్గును.

19. పంచమ లేక సప్తమ భావములందు బలయుక్తులైన రవి – శనులు యుతి నందియున్న యెడల మొదట పురుష సంతాన ప్రాప్తికల్గును.

20. తృతీయ భావమునందు బలయుక్తమగు పురుష గ్రహస్థితికల్గి పూర్ణ చంద్రుని దృష్టినందియున్న యెడల మొదట స్త్రీసంతతి ప్రాప్తించగలదు.

21. పంచమ భావాధిపతి స్త్రీ గ్రహసంబంధితుడై చతుర్ధ భావము నందున్న యెడల మొదటి పుత్రిక జన్మించగలదు.

22. పంచమభావమునందు బలయుక్తులగు చంద్ర – శుక్రులు యుతి నందియుండగా లాభ భావమునందు పాపగ్రహము లున్నయెడల మొదటి స్త్రీ సంతతి కల్గును.

23. పంచమ భావాధిపతిగానీ, భాగ్య భావాధిపతిగానీ, మేషాదిగా సరి రాశియగు సప్తమ భావమునందుండి చంద్రుని లేక శుక్రుని దృష్టి నందిన యెడల స్త్రీ సంతాన మధికముగా నుండగలదు.

24. పంచమ భావాధిపతిగానీ, నవమ భావాధిపతిగానీ బలయుక్తులై పురుష గ్రహరాశియగు సప్తమ భావమునందుండి, లేక సప్తమ భావము నందధిక పురుష గ్రహవర్గులతో నుండి పురుష గ్రహములగు రవి, కుజ, గురువుల యొక్క దృష్టి కల్గియుండిన యెడల పురుష సంతాన మధికముగా నుండగలదు.

25. పంచమ భావము శుక్రవర్గులు లేక చంద్రవర్గు (షడ్వర్గులు) కల్గియుండగా – పంచమ భావమునకు పాపగ్రహ సంబంధములు



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

లేకుండిన-శుక్ర చంద్రులలో ఏ ఒక్కరైనను భావస్థితియందున్న యెడల లేక భావమును వీక్షింపుచున్నను, అధిక సంతతి కల్గును.

26. లగ్న భావమునుండిగానీ - చంద్రస్థిత రాశి నుండిగానీ పంచమ - సప్తమ భావములకు శుభగ్రహముల యుతిగానీ, దృష్టిగానీ కల్గియుండినను లేక ఆ పంచమ సప్తమ భావాధిపతులు శుభగ్రహ సంబంధములుకల్గి ఆ భావములందున్నను జాతకుడు తాను అగ్ని సాక్షిగ వివాహమాడిన భార్యద్వారా సంతతి నందగలడు. ఏ జాతకము నందు పైన దెల్పిన గ్రహస్థితికి విరుద్ధముగా ఆ జాతకుడు స్వస్త్రీవలన సంతాన ప్రాప్తి యుండదు.

27. పంచమ భావాధిపతికి స్వక్షేత్ర స్థితికల్గిన పుత్రులు తక్కువ-మిత్రక్షేత్ర స్థితియందు స్వనవాంశ యందున్న యెడల ఏకపుత్ర సంతానములు కల్గును.

28. పంచమ భావాధిపతి బలయుక్తుడై శుభగ్రహ రాశులగు కేంద్ర త్రికోణములందు శుభగ్రహ యుతి కల్గియుండిన అతి తక్కువ వయసునందే పుత్రుడు కల్గును.

29. జన్మలగ్నము గురు గ్రహ రాశులైయుండి ఆ గురువు తనకుచ్చ స్థానమగు కర్కాటకమునందు స్థితికి కల్గియుండిన సంతతి కలుగదు. నీచాంశను జెందియున్న ఏకపుత్ర ప్రాప్తి.

30. పంచమ భావమునందుగానీ, స్వక్షేత్రమగు కర్కాటకమునందుగానీ బలయుక్తుడగు చంద్రుడున్న యెడల స్వల్ప స్త్రీసంతతి మాత్రమే కల్గును.

31. లగ్న-పంచమ భాగ్యాధిపతులు దుస్థానములగు 6-8-12 భావము లందుండి శుభగ్రహ సంబంధములు కల్గియుండిన యెడల బహు కాలమునకు సంతానము కల్గును.

32. కొన్ని సంతాన యోగములు కల్గియుండి పంచమ భావమునందు శని స్థితియుండిన బహుకాలమునకు సంతానము ప్రాప్తించగలదు.

33. పంచమభావము బలహీనముగానుండి - కారకుడు బలయుక్తుడై యుండగా ఏకాదశ భావమునందు రాహువున్న యెడల వార్ధక్య దశయందు సంతాన ప్రాప్తి కల్గును.



34. లగ్న భావమునకు సప్తమంలో కుజుడుండి, కన్యారాశికి పంచమంలో బుధుడుండి గురువు మేషరాశి యందున్న యెడల దత్తపుత్ర యోగము కల్గును.

35. జన్మలగ్నము మకరమై యుండగా పంచమ భావమునందు శని-కుజులు యుతినంది యుండిన దత్తపుత్ర ప్రాప్తియుండగలదు.

36. లగ్న - పంచమ భావాధిపతులు దుస్థానములందుండి శుభ గ్రహములచే వీక్షింపబడుచుండిన దత్తపుత్రు డుండగలడు.

37. పంచమ భావాధిపతి భాగ్య భావము నందుండగా లగ్నాధిపతికి త్రికోణస్థితికల్గి - చంద్రుడు పాపక్షేత్ర - నవాంశల యందుండిన దత్తపుత్ర ప్రాప్తి కల్గును.

38. ద్విస్వభావ రాశులలో నొకటి జన్మలగ్నమై యుండగా పంచమాది పతికి చతుర్థ భావస్థితి కల్గినను లేక శని నవాంశ యందున్నను దత్తపుత్ర ప్రాప్తి కల్గును.

39. పంచమాధిపతికి రవితో యుతికల్గి యుండగా బుధుడు శని రాశుల యందుగానీ, ఆ నవాంశ యందుగానీ యుండిన దత్తపుత్రుడు కల్గును.

40. పంచమ భావమునందు బలయుక్తమగు గ్రహముండగా పంచమ భావాధిపతికి ఏ గ్రహముయొక్క దృష్టి లేకుండిన యెడల వాత్సల్య (పెంపుడు) పుత్రుడుండగలడు.

41. పంచమ భావము శని-బుధులయొక్క ఆధిపత్య రాశులైయుండి - భావమునందు శని గుళికులు యుతి నందినను, వీక్షించినను దత్త పుత్రప్రాప్తి కల్గును.

42. పంచమ భావాధిపతి, భావమును వీక్షించు గ్రహము, భావము నందున్న గ్రహము కారకుడు అనువారు శుభ సంబంధములు కల్గి బలయుక్తులై యుండిన యెడల సంతానము ప్రాప్తించగలదు.

43. పైన దెల్పిన నాల్గుగ్రహములు బలహీనులై దుస్థానములయందున్న యెడల సంతానము కలుగదు.

44. ఏ జాతకమునందైనను సంతానము కలుగక పోవుటకు

బలవత్తరములగు కారణములు గల గ్రహస్థితి ఈ దిగువ విధముగా నుండగలదు.

1) వ్యయాధిపతి ఏ నవాంశయందుండునో ఆ నవాంశ రాశ్యధి పతియొక్క ద్రేక్కాణాధిప పగ్రహము పంచమ భావాధిపతిని వీక్షించుట.

2) పంచమాధిపతి పాప గ్రహములతో కలిసి–భావమునకు పాపదృష్టి యుండగా గురుడు పంచమ భావమునందు స్థితి కల్గి యుండుట.

3) పంచమ భావాధిపతికి నీచస్థితి, పాపనవాంశ స్థితి, షష్ఠాష్టమ ద్వాదశ భావస్థితి పాపగ్రహ వీక్షితుడగుట.

4) లగ్నాధిపతికి బుధునితో యుతి కల్గి యుండగా చతుర్థ భావము నందు పాపగ్రహములు సప్తమభావమునందు శుక్రుడు, దశవ భావమునందు చంద్రుడు లేకుండుట.

5) పాపగ్రహములన్నియు లగ్నాధిగా 5–8–12 భావములందుండి శుభ సంబంధములు లేకుండుట.

6) లగ్న భావమునందు గురు–చంద్రులకు యుతికల్గి – చతుర్థ భావము పాప సంబంధమై సప్తమ భావమునందు లగ్నాధిపతి లేక శని స్థితి కల్గియుండుట.

7) పంచమ భావమునందు గురువు–చతుర్థమున పాపగ్రహము, సప్తమభావమునందు – బుధ–శుక్రుల యుతి కల్గియుండగా చంద్రుని కష్టమ రాశియందు పాపగ్రహముండుట.

8) పంచామాధిపతి బలవంతుడై యుండగా – భావమునందు లగ్నాధిపతి, చతుర్థమునందు చంద్రుడు, లగ్నమునందు పాపగ్రహము లుండుట.

9) పంచమాధిపతి–కారకుడు బలహీనులై లేక పాపగ్రహ సంబంధము కల్గి దుస్థానము లందుండగా, పంచమభావంలో శని లేక రాహువుండి పాపగ్రహ దృష్టి నందుట.

10) దశమ–వ్యయాధిపతులకు పరస్పర భావ పరివర్తన కల్గి యుండగా పంచమ భావాధిపతి పాపార్గళగల్గి శుభ సంబంధరహితుడై యుండుట.



11) పంచమాధిపతికి గురు–కుజుల యుతి కలిగి యుండగా దుస్థానములందు లగ్నాధిపతి రాహు యుతి నందియుండుట.

12) పంచమ భావంతో గురునికి స్థితికలిగి భాగ్య భావమునందు పాపగ్రహము లుండుట.

13) గురు–రాహువులు యుతి నందియుండగా పంచమాది కుజు దున్న నవాంశాధిపతితో యుతినంది యుండుట.

14) పంచమ భావాధిపతికి రాహువుతో యుతి కలిగి యుండగా భావమునందు చంద్ర దృష్టిగల శని యుండుట.

15) లగ్నభావంలో రవి–సప్తమ భావంలో శనియున్నను, లేక సప్తమ భావంలో రవి శనులు యుతి నందగా దశమ భావమునకు గురు దృష్టి లేక స్థితి కల్గియుండుట.

16) అష్టమ భావంలో చంద్రుడుండగా పంచమ–నవమాధిపతుల 6–8–12 భావము లందుండుట.

17) సింహ–మకర–కుంభ రాశులతో నొకరాశి అష్టమ భావమై యుండి అందు రవిగానీ శనిగానీ స్థితి కల్గి యుండుట.

18) లగ్న భావమునందు శని సప్తమ భావంలో పాపగ్రహయుతిగల శుక్రుడు స్థితి నందియుండగా దశమ భావము నందు గురుని దృష్టి లేక స్థితి కల్గి యుండుట.

19) పంచమ భావమునకు మూడు పాపగ్రహములయుతి లేకవీక్షణ కల్గుట.

20) పంచమ భావాధిపతి యొక్క శత్రుగ్రహముచేత పంచమ భావము వీక్షించ బడుట లేక పంచమ భావాధిపతి–కారకులు దుస్థానములగు శత్రు గ్రహ నవాంశల యందుండుట. ఈ యోగములే జాతకము నందున్న ఆ జాతకునకు సంతానప్రాప్తి యుండదు.

45. పంచమ భావంలో స్థితినందిన రాహువు బలహీనుడై యుండగా బలయుక్తుడైన సప్తమ భావాధిపతి కారకునితో యుతినంది చర రాశుల యందుండిన అన్య పురుషునివల్ల సంతానము కల్గును.

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

46. చతుర్థ – లగ్నాధిపతులు పరస్పర భావ పరివర్తనులై వారిలో ఒక్కరికి రాహు – కేతు సంబంధముల కల్గిన సోదరుని వలన (తత్సమానుని వల్ల) సంతాన ప్రాప్తి కల్గును.

47. అంశ చక్రమునందు కేతువునకు బుధ శుక్రుల ఇర్వురి దృష్టి కల్గి యుండిన సేవకుని ద్వారా సంతాన ప్రాప్తి కల్గును.

48. శుక్రునికి పాప గ్రహ సంబంధము కల్గి వ్యయ భావస్థితి కల్గి – అంశ చక్రమునందు కేతు దృష్టి నందియుండిన సేవకుల ద్వారా సంతాన ప్రాప్తి కల్గును.

49. లగ్న భావమునందు క్షీణచంద్రు డుండగా అష్టమ భావమునందు గురునికి రవి యుతి కల్గి పంచమ–నవమ భావములందు పాప గ్రహములున్న యెడల పుత్ర ముఖము చూచుట కలుగదు.

50. పంచమ భావమునందు బుధునికి స్థితికల్గి లగ్న–చతుర్థ–పంచమ–నవమ భావములందు పాపగ్రహ స్థితి యుండిన యెడల పుత్రుని ముఖము చూడజాలదు.

51. గురు–రవి–చంద్రులయొక్క స్ఫుట రాశ్యాదులను కలిపి ఆ మొత్తమున కగు స్ఫుట రాశ్యాది కేరాశియగునో ఆ రాశియందలి గతించిన నవాంశలు యెన్నియో అందరు సంతతి యుండును.

52. చతర్థ–పంచమ–భాగ్య భావాధిపతుల స్ఫుట రాశ్యాదిని కలిపి ఆ మొత్తమున కేర్పడు రాశియందలి గతించిన నవాంశలు యెన్నియో అంతమంది సంతానము జాతకునికి కల్గుదురు.

53. లగ్న–పంచమాధిపతుల స్ఫుట రాశ్యాదిని కలిపి ఆ మొత్తమున కగు స్ఫుటరాశి లేక దానియొక్క నవాంశ రాశులయందుగానీ, ఆ రెండు రాశులయొక్క త్రికోణ రాశులయందుగానీ గోచార గురుని సంచార కాలమునందు సంతానము కల్గును.

54. లగ్నము నుండియు, చంద్రుని నుండియు, గురుస్థిత రాశినుండియు పంచమ–నవమ రాశులు సంతానప్రదమగు రాశులుగా దెలుపబడినవి. ఈ పుత్ర పద రాశ్యధిపతులయొక్క దశాంర్దశల యందు సంతాన ప్రాప్తి కల్గును.



55. పంచమ–సప్తమ భావాధిపతుల స్ఫుట రాశ్యాదిని కలిపి ఆ మొత్తమునకు ఏర్పడు నక్షత్ర దశాధిపతి దశయందు – పంచమ సప్తమాధిపతులతో యుతి, దృష్టి సంబంధములుగల గ్రహాంతర్దశల యందు సంతాన ప్రాప్తి కల్గును. లేక పంచమ – సప్తమాధిపతులతో కలిసిన – వారిని చూచెడు గ్రహములయొక్క దశలలో పై నక్షత్ర దశాధిపతి అంతర్ధశకూడా సంతతి నివ్వగలడు.

56. పంచమ భావము–పంచమాధిపతి యున్నరాశి, పంచమ భావమును వీక్షించు గ్రహమున్నరాశి, కారకుడన్న రాశులలో గోచార శని సంచార కాలమునందు సంతాన నష్టము లుండగలవు.

57. జాతకమునందు చతుర్థభావ మధ్యమమునుండి దశమభావ మధ్యమ వరకు (దృశ్యార్ధచక్రము) గ్రహములన్నియు నుండిన యెడల శీఘ్రముగా సంతాన ప్రాప్తి కలుగ గలదు. (యోగములవారికి) దశమ భావ మధ్యమునుండి చతుర్థ భావ మధ్యము వరకు (అదృశ్యార్థ చక్రము) గ్రహములన్నియు స్థితినందియుండిన యెడల సంతాన ప్రాప్తియందు కాల విలంబముండగలదు.

58. పంచమాధిపతి దుస్థానములందున్నను లేక అదృశ్యార్థ భాగల యందున్నను, జాతకుడు మందబుద్ధి గలవాడగును. ఈ విధముగా పంచమాధిపతి యుండగా రాహువు చతుర్థ భావమునందున్న యెడల మతిభ్రమణము కల్గును.

59. పంచమాధిపతి బలహీనుడై యుండగా పంచవ భావంలో పాపగ్రహ దృష్టికల్గిన రవి–చంద్రులుయుతి నందిన చంచలమగు బుద్ధి కలుగును.

60. ద్వితీయ భావమునందు శుభగ్రహములు స్థితి నందియుండ పాపగ్రహ దృష్టి నందిన యెడల చపల చిత్తులు కాగలరు.

61. ఏ భావమునందైనను చంద్రునికి రవి–కుజుల దృష్టి కల్గిన మూర్ఖత్వము అధికము. లగ్నభావమునందున్న చంద్రునికి రవి–కుజుల దృష్టి కల్గిన బుద్ధి కుశలత లోపించగలదు.

62. లగ్నాధిగా కేంద్ర స్థానములందు శని-చంద్ర-గుళికులు ముగ్వురు యుతి నందిన యెడల బుద్ధి మాంద్య మేర్పడగలదు. ఈ విధమగు గ్రహస్థితియందు పంచమ భావమునందు కుజుడు స్థితి నంది యుండిన యెడల గొప్ప అహంకారి కాగలడు.

63. పాపగ్రహ సంబంధములు గల గురువు పంచమ భావమునందు స్థితికల్గియున్నను లేక బలహీనుడై పాపగ్రహ దృష్టినందినను తెలివి తేటలు శూన్యమగును.

64. పంచమ భావాదిప-చంద్రులకు లేక తృతీయ భావాధిపతి-చంద్రులకు షష్టాష్టక స్థితికల్గియుండిన మతిలేనివాడై యుండగలడు.

65. రాశిచక్రమునందు అంశ చక్రమునందు కూడా చంద్రుడు నీచస్థితి నందియున్నను లేక పంచమ భావమునందు గానీ దశమ భావము నందుగానీ చంద్రునికి రాహు-కేతువులతోగానీ, మాందీ గుళికులతో గానీ యుతి కల్గినను నిరంతర ఆందోళనలతో మనశ్శాంతి లోపించ గలదు.

66. పంచమ భావము నందున్న క్షీణచంద్రునికి కుజునికి దృష్టి కల్గిన కఠిన స్వభావము కల్గును. దుష్టబుద్ధికల్గి దయాహీనుడై ప్రవర్తించ గలడు.

67. బలవంతుడగు పంచమాధిపతి కేంద్ర కోణములందు బుధునితో లేక గురునితో యుతినంది శుభగ్రహదృష్టి నందియున్న ఇంగిత జ్ఞానముగల మేధావి కాగలడు.

68. పంచమాధిపతి బలవంతుడై శుభ సంబంధములు కల్గి యుండగా చంద్రుడు శుభస్థానములందు శుభ సంబంధియై యున్నను లేక గోపురాంశయందున్నను మంచి ఆలోచనాపరుడై - సద్బుద్ధి కల్గి యుండును.

69. పంచమ భావము బలయుతమై శుభ సంబంధము నందియుండగా గురువు గోపురాంశనంది శుభస్థానములందున్నను లేక స్వనవాంశ ఉచ్చాంశ. శుభాంశల యందుండి శుభగ్రహ వీక్షితుడైనను - మృద్వాది షష్ఠ్యంశలయందున్నను జాతకుడు విశేష విజ్ఞాన సంపన్నుడు జ్యోతిశ్శాస్త్రవేత్త మేధావి కాగలడు.



70. పంచమభావాధిపతి శుభ నవాంశల యందుండి కేంద్రస్థానములందు శుభగ్రహ యుతి కల్గిన కుజుడుండిన యెడల అన్నదాన రతుడగును.

71. పంచమ భావము బలముకలగి యుండగా భాగ్యభావమునందు శని చంద్రులు యుతి నందియున్న అధికమగు ధర్మకార్యముల నాచరించ గలరు.

72. పంచమ భావాధిపతి బలయుక్తుడై భాగ్య భావము నందుండగా భాగ్యా-రాజ్యాధిపతు లిర్వురు లగ్నభావమునందు యుతినంది గురు దృష్టి నందిన యెడల ప్రజోపకరమగు అనేక పనుల నాచరించి ధర్మాత్ము లుగా కీర్తి నందగలరు.

73. లగ్న భావమునకు గానీ లగ్నాధిపతికి గానీ ద్వితీయాధిపతి దృష్టి కల్గినను లేక భాగ్యాధిపతి ద్వితీయమునందుండి-ద్వితీయాధిపతికి లగ్నమునందు లగ్నాధిపతితో యుతి కల్గినను ఉన్నతములగు దాన ధర్మముల నాచరించగలరు.

74. చతర్థ భావమునందు భాగ్యాధిపతి యుండగా లగ్న-సప్తమ- దశమ భావములందు రాజ్యాధిపతి యుండి-వ్యయాధిపతికి గురుదృష్టి కల్గిన యెడల విపరీతములగు దానముల నాచరించి ప్రసిద్ధివహించ గలరు.

75. భాగ్య భావాధిపతి కుంభ నవాంశ యందుండగా (జలరాశి నవాంశ లలో) పూర్ణచంద్రుడు లగ్న భావమునందుండిన యెడల ప్రజలకు జలవనరుల నేర్పాటుచేసి కీర్తినందగలరు.

76. పంచమ భావాధిపతి బలయుక్తుడై యుండగా సప్తమ భావమునందు చంద్రుడుండి వ్యయ భావమునందు కేతువుండిన యెడల తీర్థ యాత్రలు గావించగలడు.

77. స్వక్షేత్రమగు వ్యయభావమునందు చంద్రుడు రాహు యుక్తుడై యుండగా లగ్నమందు గురువుండి సప్తమాధిపతి ఏకాదశ భావమునందున్న యెడల తీర్థయాత్రలు గావించగలడు.

78. సప్తమ భావము జలరాశులలో నొకటిగానుండి అందు పూర్ణ చంద్రుడుండగా దశమ భావమునందు గురువుండి శుభగ్రహ సంబంధి



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

యైనను లేక ఆదశమాధిపతి సప్తమ స్థిత చంద్రునితో కూడి గురు దృష్టి నందినను సమస్త తీర్థయాత్రలు చేయగలడు.

79. దశమ భావాధిపతి సప్తమ భావమునందు ఉచ్చ నందియుండగా జలరాశులయందున్న చంద్రదృష్టి ఆ దశమాధిపతికి కల్గిన తీర్థయాత్ర లుండగలవు.

80. పంచమాధిపతి ఉచ్చ-మిత్ర స్వక్షేత్రములందు శుభగ్రహ సంబంధియై యుండగా కేంద్ర స్థానములందు చంద్రుడు బలయుక్తుడై శుభగ్రహ దృష్టి నంది యుండిన భూత భవిష్యత్ వర్తమాన కాలమునందలి విషయములు గుర్తించగల ప్రతిభ కల్గును.

81. బలయుక్తమగు పంచమ భావమునందు పూర్ణబలము కలిగి శని-చంద్రులు యుతి నంది యుండిన యెడల దైవ రహస్యములు గుర్తించగల మేధావులగుదురు.

82. పంచమ భావము బలయుక్తమై యుండగా కేంద్ర కోణములయందు స్థితి దుస్థితినందిన గురువు బుధుని వీక్షింపుచుండిన యెడల వేదాంత శాస్త్ర ప్రతిభ కల్గును.

83. శని రాశులగు మకర-కుంభములలో నొకటి ద్వితీయ భావమై యుండి అందు బుధ - కుజులు యుతి నంది రవి దృష్టి నందిన విద్వాంసుల తోటి వాదించగల ప్రతిభ కల్గును.

84. అంశలగ్నమునకు ద్వితీయ రాశి ఏది యగునో రాశి చక్రమందా రాశిలో గానీ ద్వితీయ భావాంశయగు రాశిలో గానీ స్వక్షేత్ర స్థితిగల గురువుండి రవి - శుక్రుల దృష్టినందిన యెడల వ్యాకరణ శాస్త్ర ప్రతిభ కల్గును.

85. అంశ చక్రమునందు లగ్నాధి 2-3-5 స్థానములలోగానీ, లేక రాశి చక్రంలో 2-3-5 భావములయొక్క నవాంశ రాశులలోగానీ గురు-బుధులు యుతినంది యుండిన మీమాంస శాస్త్ర ప్రతిభ కల్గును.

86. ద్వితీయ-తృతీయ- పంచమ భావ నవాంశలయందు చంద్ర గురువులు యుతినందినను లేక అంశచక్రమునందు లగ్నాధిగా 2-3-5



స్థానములలో గురు-చంద్రు లిర్వురు కలిసియున్నను, యోగశాస్త్ర ప్రతిభ కల్గి యుండగలరు.

87. అంశ చక్రమునందు సప్తమ-పంచమ భావములందు గురు చంద్రు లిర్వురు పాపగ్రహ యుక్తులై యుండిన గ్రంధములు రచించి ప్రతిభ గాంచగలరు.

88. అంశ చక్రమునందు లగ్నాదిగా 2-3-5 స్థానములందు బుధ-గుగు కేతువులు కలిసియున్నను లేక గురు కేతువులుండి బుధ దృష్టి నందినను గణిత శాస్త్రమునందు ప్రతిభ కల్గును.

89. జన్మలగ్నాధిగా ద్వితీయ భావమునందు గురువు ఉచ్చనంది యుండగా ద్వితీయాధిపతి బలవంతుడైన యెడల జ్యోతిష శాస్త్ర ప్రతిభకలుగును.

90. లగ్నాధిగా ద్వితీయ లేక తృతీయ భావములందు బుధ - శుక్రులు యుతినంది యుండిన జ్యోతిష విద్యా ప్రతిభ కల్గును.

91. జన్మలగ్నమునందు గురువు మిత్రక్షేత్ర స్థితికల్గి యుండి ద్వితీయ భావమునందు బుధుడు, స్వక్షేత్రము లేక ఉచ్చస్థితి కల్గియుండిన జ్యోతిష పాండిత్య ప్రతిభ కల్గును.

92. పాప గ్రహ సంబంధములు లేని బుధుడు పంచమ-ఏకాదశ భావములందు ఉచ్చ-మిత్ర-స్వక్షేత్ర స్థితికల్గి యుండి ద్వితీయాధిపతి దృష్టి నందిన యెడల జాతకుడు జ్యోతిష విద్యా ప్రతిభను పొందగలడు.

93. చంద్రస్థితి రాశికి కోణ రాశులందు గురునకు స్థితికల్గి బుధస్థిత రాశికి పంచమ-నవములలో కుజ స్థితికల్గి యుండిన అనేక విద్యల యందు పాండిత్య ప్రతిభ కలుగ గలదు.

94. ద్వితీయ భావాధిపత్యముగల గురు-శుక్రులకు రవి కుజులయొక్క యుతి, దృష్టి సంబంధములు కల్గిన తార్కిక వేత్తగా ప్రతిభ గాంచగలడు.

95. పంచమ లేక నవమ భావములందు గురువుగానీ శుక్రుడుగానీ ఉచ్చ స్థితి కల్గి యుండిన తార్కిక ప్రతిభ కల్గును.

96. రాశి చక్రమునందు శుభగ్రహములతోడను, అంశచక్రమునందు పాపగ్రహములతోడను యుతి కల్గిన రవి రాహువుల స్థితి విష వైద్య చికిత్సా ప్రతిభ నివ్వగలదు.

97. రాశిచక్రమునందు చంద్ర బుధ శుక్రులకు యుతి కల్గి అంశచక్రము నందు వారికి పరస్పర దృష్టి కలిగిన యెడల గొప్ప వైద్యుడుగా ప్రతిభ గాంచగలడు.

98. ద్వితీయ భావమునందు సంపూర్ణ బలముగల గురునికి స్థితికలిగి భాగ్యాధిపతి యొక్క నవాంశ ప్రాప్తించిన యెడల వేద విద్యా పాండిత్య ప్రతిభ కల్గును.

99. బలయుక్తులగు ద్వితీయ–భాగ్యాధిపతులకు పరస్పర భావ పరివర్తన కల్గి దశమ భావమునందు ఉచ్చ, మిత్ర–స్వక్షేత్ర స్థితిగల గురువుండిన యెడల వేద విద్యా ప్రతిభ యుండగలదు.

100. ద్వితీయాధిపత్యముగల గురువు ద్వితీయమునందు భాగ్యాధిపత్యము గల శుక్రుడు భాగ్యమునందు నుండగా లగ్నాధిపతి బలయుక్తుడైన యెడల వేద విద్యా ప్రతిభ కలుగును. అట్టి స్థితియందు అష్టమ భావమునందు బలహీనులగు పాపులుండిన చపలచిత్తము కల్గును. షష్ఠభావంలో కుజుడుండిన కఠిన చిత్తుడు కాగలడు. తృతీయము నందు మాందీ గుళికులున్న వాక్పారుష్యము ప్రాప్తించగలదు.

101. శుభగ్రహ సంబంధము (శుభ వర్గాధికత) గల పంచమ భావము నకు బలయుక్తమగు రవి, కుజ, గురుల సంబంధము కల్గుటవల్ల పురుష దేవతోపాసన ప్రాప్తించగలదు. స్త్రీ గ్రహములగు చంద్రశుక్ర–రాహువుల సంబంధములు కల్గుటవలన స్త్రీ దేవతోపాసన కల్గును. నపుంసక గ్రహములగు బుధ–శని–కేతువుల సంబంధము వలన నిర్గుణోపాసన ప్రాప్తించగలదు.

102. పంచమ భావమునకు గల నక్షత్రము లేక భావమునకు సంబంధించి యున్న గ్రహము స్థితినందిన నక్షత్రము తన జన్మ నక్షత్రమునకు శుభ తారలగు 2–4–6–8–9 నక్షత్రములుగా నుండిన ఉపాసనవల్ల దేవతానుగ్రహము పొందవి అభీష్టసిద్ధి నందగలరు. అట్లుగాక 1–3–5 తారలుగా నుండిన ఫలసిద్ధి యుండక ప్రయాసలు దేహబాధలు కష్ట నష్టములు ప్రాప్తించగలవు. 7వ తారగానున్న మరణము కల్గును.

103. పంచమ భావము–భావమునకు సంబంధించిన గ్రహము చరరాశుల యందుగానీ, చారాంశలయందుగానీ యుండిన ఉపాసనయందు విఘ్నము లధికమై సిద్ధి లభించుట దుర్లభమగును. స్థిరరాశులు – స్థిరరాశ్యంశలయందుగానీ యుండిన ఇంద్రియములను జయించి మంత్రసిద్ధి నందగలరు. ద్విస్వభావ రాశులు –ఆ రాశ్యంశల యందున్న సాధన–సిద్ధి–ద్వైవిధ్యమగు ఫలితములు కలిగియుండగలవు.

104. పంచమ భావాధిపతి జన్మలగ్నాధిపతికి మిత్రగ్రహముగా నుండిన యోగ్యుడగు గురువు ప్రాప్తించగలడు. సముడైన యెడల, సాధారణ అర్హతలు గల గురువు దొరుకును, శత్రు గ్రహమైన యెడల దుష్టుడగు గురువు ప్రాప్తించగలడు.

105. పంచమ భావమునందు బలయుక్తులగు రవి, కుజుల యుతి వారికి గురు దృష్టి కల్గిన యెడల లేక భావాధిపతి రవి కుజులతో కలిసి భావమును వీక్షింపుచున్న యెడల ఉగ్ర పురుష దేవతోపాసనయు, పైవిధముగా పంచమ భావమునందు బలయుక్తులగు శుక్ర కుజుల యుతి వారికి చంద్ర దృష్టి కల్గిన ఉగ్ర స్త్రీ దేవతోపాసన కలుగ గలవు.

106. పంచమ భావము బలయుక్తమై యుండి బలవత్తరములగు రవ్యాది గ్రహములా భావమునందు స్థితికల్గి యుండుట వలన కల్గు దేవతోపాసనలు దెలుపబడుచున్నవి.

1) రవి స్థితివలన శివోపాసన–మరియు శైవ సంబంధిత–సూర్య మంత్రోపాసనలు

2) చంద్రుని స్థితిచే గౌరి లలిత, పార్వతి–ఆమె యొక్క అంశలు యక్షిణీ దేవతలు–మాతృకలు.

3) కుజుని స్థితివలన–కుమారస్వామి – వీరభద్ర, భైరవ, భేతాళాది వీర దేవతలు.

4) బుధుని స్థితివలన–దక్షిణామూర్తి, హయగ్రీవుడు, సరస్వతి, ఆమెయొక్క అంశలు తదితర విద్యాధిష్ఠాన దేవతలు.

5) గురుగ్రహ స్థితివలన – విష్ణువు, మరియు వైష్ణవ పరమగు తదితర బ్రహ్మదేవతలు.

6) శుక్రుని స్థితివలన–చండీ, దుర్గ, కాళీ, భువనేశ్వరి, తార–మొద లగు తంత్ర దేవతలు.

7) శని స్థితివలన – ఇతరులకపకార మొనర్చగల దేవతలు.

8) రాహు స్థితివలన–భూత, ప్రేత, పిశాచాది శాబిర దేవతలు.

9) కేతు స్థితివలన–పరపీడాకర శక్తులు – ఇంద్రజాల విద్యలు–కృత్యా తంత్రములు.

107. నవాంశ లగ్నరాశినుండి (రాశి చక్రంలో) 5–9 స్థానములందు పాపగ్రహ స్థితియున్నను లేక పాపగ్రహ దృష్టి యున్నను భూతప్రేత పిశాచాది దుష్టగ్రహ బాధలను నివారించగల శక్తి కల్గును. (భూత వైద్యము)

108. లగ్నాధిగా కేంద్ర – కోణస్థానములందు – శుభ నవాంశలు కల్గిన మంత్రకారక గ్రహము బుధ–శుక్రుల దృగ్యోగాదులు కల్గియుండిన ఉపాసనా బలము అధికముగా నుండి సమస్త విషయములు తెలిసిన వారగుదురు.

109. పంచమ భావాధిపతికి నీచస్థితికల్గి నవమ భావమునందు పాపగ్రహ స్థితి కలిగి, మంత్రకారక గ్రహము శత్రుక్షేత్రము నందుండిన యెడల మంత్ర–తంత్రములుచే పరులను హింసించువాడగును.

110. పంచమ–భాగ్య భావములు రెండిటియందు దుస్థానాధిపతు లుండగా లగ్నాధిపతి మంత్ర కారకగ్రహముతో కలిసి అష్టమ భావము నందున్న ఇతరుల మంత్రశక్తి వలన హాని జెందగలడు. (ప్రాణములు పోగలవు)

111. పంచమాధిపతిగానీ భాగ్యాధిపతిగానీ నీచనంది లేక శత్రుక్షేత్ర శత్రు నవాంశల యందుండగా మంత్ర కారకగ్రహము రాహుయుక్తుడై దుస్థానముల యందుండిన పరమంత్రశక్తి వలన పీడితుడు కాగలడు.

112. చతుర్థ–దశమ, వ్యయ భావములందు–పంచమ భాగ్య భావాధిపతులు స్థితికల్గి యుండగా ఆ చతుర్థ దశమ వ్యయాధిపతులు పాపగ్రహ



దృష్టినంది పంచమ నవమ భావము లందుండిన యెడల మంత్రము లచే హాని సంభవించగలదు. ఈ పై గ్రహస్థితి యందు మంత్ర స్థానాధిపతి లగ్నాధిపతికి శత్రుగ్రహమై యుండి లగ్నాధిపతి శత్రు భావమునందున్న తన మంత్రములే తన కపకారమొనర్చగలవు.

113. పంచమ భావాదిపతి శుభయోగ బలాదులు కల్గి లగ్న భావమునందున్న యెడల సేవకు లధికముగా నుండి ప్రభుత్వాధికారమును పొందును (న్యాయాధిపతి) లేక మంత్రి పదవి లభించగలదు. మరియు అపారమగు దైవకృపవలన శత్రువులు లేనివాడై సర్వజనులకు గౌరవనీయుడు కాగలడు. పుత్ర సంతతి స్వల్పము పాపయోగాదులు కల్గియుండిన అపుత్రకుడై క్షుద్ర దేవతల నారాధింపుచు దుర్మార్గ వర్తనుడు కాగలడు.

114. పంచమ భావాధిపతి శుభయోగ బలాదులు కల్గి ద్వితీయ భావము నందున్న యెడల అనుకూల రూప శీలాది గుణములు గల భార్య ప్రాప్తించి సంపన్న కుటుంబీకుడగును. ప్రభు వర్గ మూలముగా ధనార్జన కల్గును. దైవానుగ్రహ ప్రాప్తికల్గి వాక్సిద్ధిగల దైవజ్ఞుడు కాగలడు. పాప బలాదులు కల్గి ద్వితీయము నందున్న – కుటుంబ చిక్కులు గల్గి దరిద్రుడగు. కుటుంబ సంరక్షణ గావించలేని అసమర్థత కల్గును. లేక శివార్చకుడై శివద్రవ్యముచే కుటుంబ పోషణము గావించువా డగును.

115. పంచమ భావాధిపతి బలయుక్తుడై శుభ సంబంధముకల్గి తృతీయ భావము నందున్న యెడల వివాహానంతరము శీఘ్రకాలముననే పుత్రులు కలుగగలరు. సోదరులు ప్రాబల్యము కల్గి యుండగలరు. పాప బలములుకల్గి యుండిన సోదర కష్టము. పుత్ర పీడలు కల్గును.

116. పంచమ భావాధిపతి శుభ బలయుక్తుడై చతుర్థ భావము నందున్న యెడల ఏకపుత్ర సంతతి యుండగలదు లేక దీర్ఘాయువుగల పుత్రిక యుండగలదు. పాప యోగాదులుకల్గి యుండిన అపుత్రకుడగును మిశ్రమ యోగములవల్ల మృతపుత్రులు కలుగ గలరు.

117. పంచమ భావాధిపతి బలయుక్తుడైన శుభగ్రహ సంబంధములు కల్గి పంచమ భావమునందున్న యెడల సద్బుద్ధి. ఆలోచనాశక్తి కార్యకుశలత మేధాశక్తి సంతాన ప్రాప్తి కలుగ గలదు. పాప గ్రహ సంబంధియై యుండిన ఫలితములు వ్యతిరేకముగా నుంటవి.

118. పంచమ భావాధిపతి బలయుక్తుడై శుభ సంబంధములు కల్గి షష్ఠభావము నందున్న యెడల పుత్రుడు పరమశత్రువు కాగలడు. మిశ్రమ బలములు కలిగి యుండిన భార్యకు సంధ్యాదోషములు ప్రాప్తించుటవలన సంతతి కలుగదు. పాపగ్రహ సంబంధాదులు కలిగి యుండిన అపుత్రకుడై రాజవర్గము వారితో విరోధములు ప్రాప్తించగలవు.

119. పంచమ భావాధిపతి బలయుక్తుడై శుభ సంబంధములుకల్గి సప్తమ భావము నందున్న యెడల జాతకుని కుమారునికి దేశాంతరస్థితి ప్రాప్తించగలదు. ప్రసిద్ధి, కీర్తి, రాజానుగ్రహములు ప్రాప్తించగలవు. పాప సంబంధములు కల్గియుండిన సంతాన నష్టములు దేశాంతరము నందు పుత్ర మరణము ప్రాప్తించగలదు.

120. పంచమ భావాధిపతి బలయుక్తుడై అష్టమ బావమునందున్న యెడల సంతాన నష్టము. పిత్రార్జితమగు భాగ్యమంతము తరగిపోయి ఋణ గ్రహస్థుడగును. పాపగ్రహ సంబంధములు కలిగి యుండిన దరిద్రుడై హీనజీవనము గావించగలడు.

121. పంచమ భావాధిపతి శుభయోగ బలములుకల్గి నవమ భావము నందుండిన దైవభక్తి ఆచార వ్యవహారములు-తపస్సు, జ్ఞానము కలవాడగును. సంపదలు ప్రాప్తించగలవు. పాపగ్రహ సంబంధములు కల్గి యుండిన-భాగ్యనష్టము, పుత్ర కష్టములు కల్గును.

122. పంచమ భావాధిపతి బలయుక్తుడై శుభగ్రహ సంబంధములు కల్గి దశమ భావము నందున్న యెడల అధిక భూప్రాప్తి కల్గును. సత్కర్మల నాచరింపుచుండగలడు. గురుదృష్టి నందిన దైవశక్తి కలిగి భాగ్య సంపదలు కలవాడగును. బలయుక్తుడగు రవి దృష్టి నందియున్న రహస్యములను వెలికి దీయు నుద్యోగి కాగలడు - మిశ్రమ బలములు



కలిగియుండిన పౌరోహిత్య - అర్చకత్వము వంటి వృత్తులచే జీవించును లేక ధర్మసత్రములు, ఇతర ధార్మిక సేవా సంస్థల మూల మున జీవించువాడగును. పాప బలయుక్తుడై యుండిన-దైవ ఆ గ్రహము వల్లగానీ, ప్రభు కోపము వల్లగానీ, లేక తన పుత్రునివల్లగానీ సకలభాగ్యసంపదలు కోల్పోవగలడు.

123. పంచమ భావాధిపతి బలయుక్తుడై శుభ సంబంధములంది ఏకాదశ భావమునందున్న యెడల ప్రయత్న కార్యములన్నియు సిద్ధించ గలవు. పుత్రులద్వారా ధనవృద్ధి ప్రాప్తించగలదు-మిశ్రమ బలముచే మిశ్రమ ఫలితములు, పాపగ్రహ సంబంధమువల్ల పై ఫలితములకు వ్యతిరేకమగు ఫలితములు ప్రాప్తించగలవు.

124. పంచమ భావాధిపతి బలయుక్తుడై శుభగ్రహ సంబంధము కల్గి ద్వాదశ భావము నందున్న యెడల పుత్రుడుకల్గి కొంత కాలమునకు నశించగలడు-విరక్త భావములు కల్గి తత్వవిచారము చేయుచు మోక్షగామియై సంచరించగలడు. పాపబలము కలిగి యుండిన భిక్షా టనము చేయుచు అస్థిరుడై తిరుగుచుండగలడు.

శ్లో॥ **ద్వాదశే శుభయోగేషు సదా బ్రహ్మ విచారవాన్ ।**
**శయ్యాసుఖీ విరక్తస్స్యాత్ అంత్యే బ్రహ్మ పదం వ్రజేత్ ॥**

అని సత్యా చార్యులవారు దెల్పుటవలన ప్రారంభంలో గృహస్థుగా నుండి వివిధ సుఖానుభూతులను పొంది సంసారముపై విరక్తికల్గి సన్యసించి-లేక వానప్రస్థాది ఇతర ఆశ్రమ వర్తనుడై బ్రహ్మవిచారమును జేయుచు అంత్యమందు బ్రహ్మపదమును జేరి కైవల్యమందగలడని దెలియుచున్నది.

125. 1) పంచమ భావము కర్కాటక రాశియై అందు రవిస్థితి కలిగి యుండుట.

2) కర్కాటక రాశి పంచమ భావమై అందు కుజుని స్థితి కల్గుట.

3) శుక్రుడు పంచమ భావమగు కర్కాటక రాశిలో స్థితి కలిగి యుండుట.

ఈ మూడు విధములగు గ్రహ స్థితులయందు ఏ ఇతర గ్రహ సంబంధములు లేకుండిన యెడల రెండవ భార్యవలన సంతాన ప్రాప్తిని పొందగలరు.

126. కర్కాటక రాశి పంచమ భావముగా నుండగా అందు బుధుడున్న యెడల స్వల్ప సంతానము కల్గును. గురుడు మాత్రమే యున్న పుత్ర సంతతి యుండదు. శనియుండిన పుత్ర సంతాన మధికము చంద్రుడున్న స్వల్ప సంతానము కల్గును. (ఈ విధమగు గ్రహస్థితి యందే ఇతర గ్రహ సంబంధములు నుండకూడదు)

127. 1) పంచమ భావము వృషభ, సింహ, కన్య, వృశ్చికము లందొక టిగా నుండి (అల్పసంతాన రాశులు) ఆ భావమునందు రవి యుండగా లగ్నమునందు కుజుడు అష్టమ భావమునందు శనియుండిన యెడల బహుకాలమునకు సంతానము కల్గును.

2) పై విధముగా పంచమ భావరాశియుండి లగ్న భావమందు శని అష్టమ భావమునందు గురుడు వ్యయ భావమునందు కుజుడున్న యెడల బహుకాలమునకు సంతానము ప్రాప్తించగలదు.

3) చంద్రుడు వ్యయ భావమునందుండగా – లగ్న భావమునందు గురుడున్న రాశికి ఐదవ రాశియందు పాపగ్రహము లున్న యెడల చిరకాలమునకు సంతాన వంతులు కాగలరు.

128. 1) లగ్నాధిగా చతుర్థ భావమునందు పాపగ్రహము, సప్తమ భావమునందు శుక్రుడు దశమ భావమునందు చంద్రుడు స్థితికల్గి యున్నను.

2) లగ్న, పంచమ, అష్టమ, ద్వాదశ భావములు నాల్గింటియందు పాపగ్రహముల స్థితి యున్నను

3) లగ్నాధిగా చతుర్థ భావమునందు పాపగ్రహములు, పంచమ భావమందు గురువు, సప్తమ భావమునందు, బుధు – శుక్రులిర్వురు స్థితి కల్గియున్నను.



4) పంచమ భావమునందు చంద్రుడుండగా లగ్న, అష్టమ, వ్యయ భావములు మూడింటియందు పాపగ్రహము లున్నను.

ఈపై నాల్గు యోగములలోనే యొక్క యోగమున్నను వంశ వృద్ధి నొసంగెడు పుత్ర సంతతి కల్గును.

129. పంచమ భావము మిధున–కన్య–మకర, కుంభములలో నొకటిగా నుండి శని, లేక మాందీ గ్రహములా భావమునందున్నను, చూచి నను దత్తపుత్ర యోగము.

**శ్లో॥ పుత్రభావే బుధక్షేత్రే మందక్షేత్రేऽథవా పునః ।**
**మందే మాందీ యుతై దృష్టే తదా దత్తాదయః సుతాః ॥ (బృ॥పరాశరం)**

130. స్త్రీలయొక్క జాతకమునందు గురు – కుజ చంద్రుల యొక్క స్ఫుట రాశ్యాదులను కలుపగా నేర్పడు స్ఫుటరాశ్యాది, మేషాదిగా సరిరాశి – సరి నవాంశల యందున్న అట్టి స్త్రీకి సంతానోత్పత్తి యుండగలదు. రాశి–అంశలు ఖేదించిన యెడల కొంతకాలమునకు కష్టము మీదసంతాన ప్రాప్తి కల్గును.

131. పురుషుల జాతకమునందు రవి, గురు, శుక్రుల స్ఫుట రాశ్యాదిని కలువగా నేర్పడు స్ఫుట రాశ్యాది–పురుష రాశి పురుషరాశి నవాంశలైన యెడల సంతానము కల్గుటకు తగిన బీజ (వీర్య) బలము కలిగియుండగలరు–రాశ్యంశలు స్త్రీ–పురుష మిశ్రమముగా నున్న యెడల ఔషధాదులవలన సంతాన నోత్పదన శక్తి లభించగలదు, ఆ రాశి–అంశలు నపుంసక గ్రహాధిపత్యములకు సంబంధించినదైన సంతానాభావముండగలదు.

**శ్లో॥ పుత్రా భావ నిదానమేవ కథయేత్ తత్ఖేచరాక్రాన్త–భ**
**ప్రోక్తై దేవత భూరుహై రపి మృగైః సన్తానహేతుంవదేత్॥ (మంత్రేశ్వర)**

సంతాన భావము – భావాధిపతి, కారకుడు–పంచమ స్థిత గ్రహము దోష భూఇష్టులై యుండగా సంతానము కల్గుట కాటంకములు లేర్పడగలవు. నీచ–శత్రుక్షేత్ర అస్తంగత–దుస్థానస్థితి లేక సంబంధాలు దోషప్రదము లగుటవలన అట్టి దోష ప్రదమగు గ్రహములు గత జన్మయందు గావించిన సాఫల్యమును ఈ జన్మయందు సంతాన

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

దోషరూపంలో కలుగజేయు చుండగలరు. కావున ఆ దోష ప్రదమగు నక్షత్ర. రాశి, గ్రహములను గుర్తించి వాటికి దెలుపబడిన దేవతా-వృక్ష, జంతువులను పూజించుటవలన గత జన్మపాపము తొలగిసంతాన ప్రాప్తి కవకాశము లేర్పడ గలవు.

132. సంతానము కలుగపోవుటకు ఏ గ్రహము దోషప్రదుడో ఆ గ్రహ సంబంధితమగు గత జన్మయందలి పాపదోషములు దెలుపబడు చున్నవి. (సంగ్రహంగా)

1) రవి దోషప్రదుడైన-పితృదేవతల కోపము, ఈశ్వర ద్రోహము గరుడ ద్రోహములు గత జన్మయందు కల్గుటవలన సంతానము కలుగదు.

2) చంద్రుడు దోషప్రదుడైన-మాతృహింస,సుమంగళీశాపము పూజనీయ స్త్రీశాపము.

3) కుజుడు దోషప్రదుడైన - జ్ఞాతులు, శత్రువుల శాపము, గ్రామ దేవతాపచారము, సుబ్రహ్మణ్య ద్రోహములు.

4) బుధుడు దోషప్రదుడైన - పసిపిల్లలను హింసించుట, గ్రుడ్లను పొడచుట (చితుపుట) పక్షుల గూళ్ళు పాడుచేయుట-శిశు హత్యలు.

5) గురుగ్రహము దోషప్రదుడైన - బ్రాహ్మణ శాపము. వంశ పురోహితుని అవమానించుట, లేక హింసించుట - విద్వాంసు లగు జ్ఞానుల నవమానించుట-ఫలవృక్షములను నరకుట-గురు ద్రోహము.

6) శుక్రుడు దోషప్రదుడైన-పవిత్ర స్త్రీకి హానిజేయుట - గౌరవ నీయులగు వారికి హాని జేయుట - పాలుగుడుచు దూడలను లాగుట- బాలింతగానున్న పశువునుకసాయి వారికప్పగిం చుట. పశువులను హింసించుట, పుష్పభరిత వృక్షమును నరకుట.

7) శని దోషప్రదుడైన-పితరులకు ఉత్తరక్రియలు సరిగా నిర్వర్తిం చక పోవుట, యమధర్మరాజు యొక్క శాపము, అశ్వత్థ (రావి చెట్టు) వృక్షమును నరకుట.



8) రాహువు దోషప్రదుడైన - సర్పములను వధించుట - హింసించుట

9) కేతువు దోషప్రదుడైన - బ్రాహ్మణులను పీడించుట - యాచకు లకు బాధకలిగించుట, వాగ్దానము గావించిన దాన - ధర్మ ముల నివ్వకుండుట, కన్యల యొక్క ఉసురు.

10) మాందీ గ్రహము దోషయుక్తమైన-తన కారణముగా అకాల మృత్యువును జెందిన జీవులయొక్క వేదన శాపముగా మార గలదు.

11) మాందీ దోషయుక్తుడై శుక్ర-చంద్రులు కలిసిన యెడల-వయ సునందున్న యువతిని హత్య జేయుట-గోవులను జంపుట.

12) మాందీ దోషయుక్తుడై గురు - కేతువులతో కలిసిన బ్రహ్మ హత్య - మార్జాలహత్య.

ఈ గ్రహములు పంచమ భావమునందు నీచ-శత్రు, స్థితి కల్గిగానీ అస్తంగత దోషమువల్లగానీ, పాపషడ్వర్గులు కల్గి బలహీనుడై యుండిన దోషప్రదులగుదురు.

**శ్లో॥ ఏవంహి జన్మసమయే బహు పూర్వ జన్మ ।**
**కర్మార్జితం దురిత మస్య సదంతి తజ్ఞాః**
**తత్త ద్గ్రహోక్త జపదాన శుభ క్రియా ।**
**క్షిస్తద్దోష శాంత మహాశం సతు పుత్ర సిద్ధ్యై ॥**

**శ్లో॥ సేతుస్నానం కీర్తనం సత్కథాయాః**
**పూజాంశంభో ।శ్రీపతేః సద్వ్రతానిః**
**దానం శ్రాద్ధం కర్జ నాగం ప్రతిష్ఠాం ।**
**కుర్యాదౌతైః ప్రాప్నుయాత్సస్తతింసః ॥ (మంత్రేశ్వరః)**

## పంచమ భావ స్థిత గ్రహ ఫలితములు

పంచమ భావ కారకత్వము కలుగని ఏ ఇతర గ్రహ సంబంధములు లేని దుస్థానాధిపత్యము లుండని రవ్యాది గ్రహములు పంచమ భావమునందు

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.

స్థితి నందియుండుటవల్ల ప్రాప్తించు ఫలితములు సంగ్రహముగా దెలుపబడు చున్నవి.

1. **రవిగ్రహస్థితివల్ల :-** అరణ్య సంచారము-జ్ఞానము-పుత్రహీనత - సుఖరాహిత్యము, అధికకోపము-మోసబుద్ధి-దుఃఖప్రదమగు బాల్య దశ కల్గును.
2. **చంద్రగ్రహ స్థితివల్ల :-** పుత్రీ-పుత్రులు, మేధస్సు, ఠీవి - ధన సుఖములు, మాతృపీడ కల్గును.
3. **కుజ గ్రహ స్థితివల్ల :-** దూకుడు స్వభావము - అధిక కోపము, పగ, కఠిన వర్తనములు కల్గును.
4. **బుధగ్రహ స్థితివల్ల :-** పుత్రులు విద్యా శౌర్య సుఖములు, ఉపాయము, యుక్తి, విమర్శనాశక్తి.
5. **గురుగ్రహ స్థితివల్ల :-** మేధావి, మంత్రాలోచన, మంచిమిత్రులు, నిర్మలహృదయము, దైవభక్తి, ఐశ్వర్యము, పుత్ర క్లేశము, కీర్తి ప్రతిష్టలు కల్గును.
6. **శుక్రగ్రహ స్థితివల్ల :-** ఐహిక సుఖ భోగములు - ధన సమృద్ధి, అధికారము, సంతానము, శాంతము, సద్గుణములు, దాతృత్వము కల్గును.
7. **శనిగ్రహ స్థితివల్ల :-** అజ్ఞానము - దురభిమానము, కార్యాటంకములు, సుత-ధనహీనత.
8. **రాహు గ్రహ స్థితివల్ల :-** దీనత్వము-అస్థిరబుద్ధి, మృత లేక రోగ సంతానము, మనోవేదన, కఠినచిత్తము, గర్భవ్యాధి పీడ కల్గును.
9. **కేతు స్థితివల్ల :-** దుర్బుద్ధి, పితృద్వేషము, వైరాగ్య చింతన - సంతాన నష్టము, పిశాచబాధలు-జనకలహములు కల్గును.
10. **మాందీ గ్రహ స్థితివల్ల :-** సంతాన హీనత లేక నష్టము- భావఫల హాని కల్గును.

## పంచమ భావమునకు గ్రహదృష్టి ఫలితములు

దుస్థానాధిపత్యములు ఇతర గ్రహ సంబంధములు కలుగని రవ్యాదిగ్రహములు పంచమ భావమును వీక్షించుటవల్ల కల్గు ఫలితములు సంగ్రహముగా దెలుపబడుచున్నవి.

| | |
|---|---|
| **రవి దృష్టి కల్గిన-** | చంచల బుద్ధి, రాజప్రియత్వము, సంచారము లందు ప్రీతి. |
| **చంద్రుని దృష్టి కల్గిన-** | దయా హృదయము, ఉన్నతభావములు, ధనము |
| **కుజుని దృష్టి కల్గిన-** | క్రూర స్వభావము - సాహసము చపలచిత్తము, భోగము |
| **బుధుని దృష్టి కల్గిన-** | ఆలోచనాశక్తి, విద్య, కీర్తి, పుత్రకళత్రములు |
| **గురుని దృష్టి కల్గిన-** | మంత్రాంగము, స్వల్ప సంతతి, సుగుణములు - వైభవ జీవితము |
| **శుక్రుని దృష్టి కల్గిన-** | మంచి రూపము-సత్పుత్రులు, మిత్రులు ధన సంపదలు |
| **శని దృష్టి కల్గిన-** | అమాయాకత్వము-కష్టజీవనము, చపలచిత్తము ధర్మబుద్ధి |
| **రాహు దృష్టి కల్గిన-** | భయస్వభావము, దయాగుణము, నిర్ధనము |
| **కేతు దృష్టి కల్గిన-** | మూర్ఖత్వము-నీటిప్రమాదములు, రోగపీడలు |

పై విధముగా స్థిత -దృష్టిగల గ్రహములకు ఇతర గ్రహ సంబంధము లుండుట వలన దెలుపబడిన ఫలితములలో మార్పులు సంభవించ గలవు. ఆయా గ్రహములతో భావాధిపతి - కారకుడు యుతి నందినప్పుడు కూడా పై ఫలితములలో కొన్ని ప్రాప్తించుట కవకాశము లున్నవి.

# 6. షష్ఠ (శత్రు) భావ ఫలితములు

షష్ఠ భావము లగ్నాధిగా ఆరవ భావము, ఈ బావముద్వారా జాతకునియొక్క శత్రువులు, జ్ఞాతులు (దాయాదులు) మేనమామలు ఋణములు, రోగములు, బాధలు, వ్యసనములు, కలమములు, ఆపదలు, చోరవిషయములు, కారాగృహము, అంగవైకల్యము మొదలగు విషయములను తెలుసుకొనదగియున్నవి. దుస్థానములందు మొదటిది ఈ షష్ఠభావము.

షష్ఠభావముద్వారా గ్రహించదగిన పై విషయములందు షష్ఠభావ రాశ్యధిపతి భావాధిపతి కాగలడు. శత్రువులు జ్ఞాతులు, ఋణములు, రోగములకు ప్రధానకారకుడు కుజగ్రహము, వ్యసనములు, చోరవిషయములకు రాహువు, కుజుడు ఆపదలు, బంధనము, జూదాదులు, అంగవైకల్యములకు కుజ–శని–రాహువులు కారకులు కాగలరు. ప్రధాన భావ కారకుడు కుజుడు, రోగాదుల విషయంలో రోగస్వరూపము ననుసరించి రవ్యాది గ్రహములు కుజునితోబాటుగా కారకులు కాగలరు. షష్ఠ భావఫలితములకు కొన్ని సందర్భములలో లగ్న, పంచమ, అష్టమ, లాభ, వ్యయ భావములు కూడా పరిగణించవలసి వుంటుంది.

షష్ఠభావము–భావాధిపతి, అతదున్న రాశ్యధిపతి, లేక నవాంశాధిపతి కారకుడు అనువారి బలాబలముల ననుసరించి భావమునకు సంబంధించిన ఫలితములు ప్రాప్తించగలవు. షష్ఠభావాధిపతి లగ్నాధిపతికంటె అధిక బలయుక్తుడై యుండుట మంచిదికాదు. లగ్నాధిపతి మరియు ఇతర కేంద్రాధిపతులు అధిక బలోపేతులై యుండి షష్ఠాధిపతి బలహీనుడై యుండుట శ్రేయస్కరము భావమునందు నైసర్గిక పాపగ్రహము లుండుట–భావాధిపతి –కారకుడు బలము కల్గియుండుట భావముకూడా బలయుక్తమై యుండుట. భావ ఫలితముల నొసంగుటకు దోహదపడగలవు. భావాధిపతి ఏ భావమునందున్న ఆ భావమునకు హాని కల్గును–భావము నందే గ్రహమున్న ఆ గ్రహ సంబంధిత భావమునకుహాని. షష్ఠాధిపతి ఏ గ్రహ సంబంధము లేక అష్టమ–వ్యయ భావము లందుండుట – లేక నీచ–శత్రుక్షేత్ర స్థితి కల్గుట. అస్తంగతు దగుటవలన భావ సంబంధింత



దుష్ఫలితములు పరిహారము కాగలవు. షష్ఠభావమునందు శుభగ్రహము లున్నను–భావము శుభ గ్రహాంశలు పొందినను–షష్ఠాధిపతి కంటె బలాధికుడగు లగ్నాధిపతి శుభగ్రహ రాశులయందు– లేక వారి అంశలయందు నుండి – చతుర్థ భావాధిపతి శుభగ్రహ సంబంధములు కల్గి కేంద్ర–కోణస్థానములందున్నను–షష్ఠభావముద్వారా ప్రాప్తించు దుష్ఫలితములు అంతరించగలవు. ఇదే ప్రకారంగా షష్ఠాధిపతికంటెను బలముగల రవి ఏ ఇతర గ్రహ సంబంధములు లేక భావమునందున్న యెడల శత్రురోగ ఋణాది బాధలను అంతమొందించగలడు.

1. షష్ఠ భావాదిపతిలో యుదినందిన గ్రహమునకు సంబంధించిన భావము. 2. షష్ఠాధిపతి స్థితినందిన భావము. 3. షష్ఠ భావమునందు స్థితిగల గ్రహమునకు సంబంధించిన భావము. 4. బలముగల షష్ఠాధిపతి యొక్క వీక్షణనంది భావము మరియు గ్రహము (ఏ ఇతర శుభగ్రహ దృష్టి లేకుండి) జాతకునికి శత్రుసమానమై యుండగలవు. లగ్నాధిపతికంటె బలవంతుడగు షష్ఠాధిపతి లగ్నాధిపతితో యుతి నందుట లగ్నభావము నందుంట – కేంద్రము లందుండుట – పాపగ్రహ యుతి. దృష్టి మొదలగు సంబంధములు కల్గియుండుట వల్ల దుష్ఫలితములు ప్రాప్తించగలవు. శుభగ్రహ సంబంధములు కూడా కల్గిన మిశ్రమ ఫలితములు కలుగ గలవు.

1. షష్ఠ భావమునందు రవికి నీచ–లేక శత్రుక్షేత్ర స్థితి కల్గి యుండిన యెడల– ఆ షష్ఠ భావము లగ్నాధిపతికి శత్రుస్థానమైన తండ్రికి సంబంధించిన శత్రువులుండి పీడించగలరు. షష్ఠభావము లగ్నాధిపతికి మిత్రక్షేత్రమైనను, షష్ఠభావాధిపతి మిత్రుడైనను–తండ్రికి సంబంధించిన శత్రువులతో జాతకుడు కలిసి యుండగలడు.
2. షష్ఠభావాధిపతి లేక ఆ భావమునందున్న గ్రహము నీచ – శత్రుక్షేత్ర స్థితికల్గి వక్రించిగానీ – అస్తగతుడైగానీ యుండిన యెడల దాయాదులు అధికముగా కల్గి యుండును. శరీరము నందనేక గాయ చిహ్నాము లుండగలవు.
3. షష్ఠ భావమునందు పాపగ్రహస్థితి యున్నను లేక భావమునకు పాపగ్రహ వీక్షణము కల్గినను (శుభసంబంధము లేకుండినను) శత్రువులవల్ల అనేక నష్టములు ప్రాప్తించగలవు. మరియు ప్రణబాధలు,

వాటి తాలూకు చిహ్నములు నుండగలవు.

4. షష్ఠభావాధిపతి. భావస్థిత గ్రహము, భావమును జూచు గ్రహములు మూడు, పాపగ్రహములై దుర్బలులై యుండిన యెడల రోగబాధలు–శత్రుపీడలు, పశునష్టములు ప్రాప్తించగలవు. పై మూడు గ్రహములు శుభులై బలాధికులై యుండిన పశుసంపద ఆరోగ్యము– శత్రు నాశనములు కల్గును.

5. పైన దెల్పిన మూడు గ్రహములలో రెండు గ్రహములు పూర్తిగా శుభులై కేంద్ర–కోణస్థానములందున్న యెడల జాతకునికి సంభవించు రోగములు సత్వరముగా నివారణకాగలవు. శత్రువులున్నను ఆపద లుండవు. తుదకొక్క గ్రహమైనను శుభుడై బలయుక్తముగా శుభస్థానము లందున్న యెడల శత్రు రోగపీడలు అతిస్వల్పముగా నుండగలవు.

6. షష్ఠభావాధిపతి బలరహితుడై పాపగ్రహ వీక్షణ నందినను, లేక పాపగ్రహ కర్తరి యందున్నను విశేష శత్రు బాధలు పీడించగలవు.

7. షష్ఠ – లగ్న భావాధిపతులు పరస్పర భావములందు పరివర్తన జెంది, షష్ఠాధిపతికి శని లేక గుళిక యుతి కల్గిన శత్రువృద్ధి అధికముగా నుండగలదు.

8. షష్ఠ భావాధిపతి భాగ్య భావమునందు పాపగ్రహ యుతి కల్గి యుండిన యెడల విశేష శత్రు ప్రాబల్యముండగలదు.

9. షష్ఠ – లాభ భావాధిపతులు పరస్పర భావములందు పరివర్తనులై యుండిన 21 నుండి 24 సంవత్సరముల వయసునందు శత్రువుల మూలముగా ధన నష్టము కల్గును.

10. షష్ఠ భావమునందు స్థితిగల లగ్న భావాధిపతికి షష్ఠభావాధిపతి దృష్టి కల్గినను లేక లగ్న, షష్ఠ భావాధిపతులిర్వురు లగ్నభావము నందు యుతి నందినను జ్ఞాతులవలన బాధలు ప్రాప్తించగలవు.

11. షష్ఠ భావాధిపతితో యుతి నందియున్న గురు–శుక్ర–లగ్నాధిపతులకు శని–రాహు కుజులలో నెవ్వరి దృష్టి కల్గినను దాయాదుల వలన బాధ లేర్పడగలవు.

12. శత్రు భావాధిపతి బలయుక్తుడై శుభస్థానము (శుభ గ్రహరాశి) నందు, శుభగ్రహయుతి, దృష్టికల్గియుండిన శత్రువులతో మైత్రికల్గి యుండగలదు.



13. షష్ఠ భావమునందు పూర్ణచంద్రుడుగానీ లేక శుభగ్రహముగానీ స్థితికల్గి యుండగా లగ్నాధిపతి బలయుక్తుడై, గురుడు కేంద్ర స్థానములందున్న యెడల జాతకుడు తన దాయాదులతో కలిసి మెలిసి జీవించగలడు.

14. భావ కారకుడగు కుజుడు పాపగ్రహ వీక్షితుడై నవమి లేక దశమ భావములందు స్థితి కల్గి యుండిన మేనమామ లుండరు.

15. షష్ఠ భావమునకు శుభగ్రహ వీక్షణ కల్గి యుండిన యెడల మేనమామలు వుండరు. ఉన్నను వారి ప్రేమాప్యాయతలు పొందలేరు.

16. జాతక చక్రమునందు బుధుడేరాశి యందుండునో ఆ రాశికి ఆరవ రాశిలో పాపగ్రహముల స్థితి యుండిన మేనమామ లుండరు.

17. షష్ఠ భావాధిపతి బలయుక్తుడై భావమునందున్న యెడల నమ్మకస్థులైన మంచి సేవకు లుండగలరు.

18. షష్ఠ భావమునకు గల గ్రహ సంబంధాదులచే కల్గు పదార్థముల యందలి ప్రీతిని తెలియు గ్రహ స్థితి వివరించ బడుచున్నది.

   1) గోపురాంశకల్గిన గురులేక శుక్రుడు షష్ఠ భావమునందున్న మధుర పదార్థ ప్రీతి కల్గును.
   2) షష్ఠ భావస్థితిగల శుక్రునికి శుభగ్రహ యుతి, దృష్టి లేక శుభాంశ, శుభ షష్ఠ్యంశలవంటి శుభ సంబంధముల కల్గిన మధుర పదార్థ ప్రీతి కల్గును.
   3) షష్ఠమ భావము పాపగ్రహ రాశిగా నుండి పాప సంబంధ ములు కల్గి యుండిన తీపి పదార్థముల యందు ఇష్టత కల్గును.
   4) షష్ఠ భావాధిపతి రవి, రాహు, కేతు యుతి నందిన మధుర పదార్థ ఇష్టత కల్గును.
   5) షష్ఠ భావాధిపతి శుభగ్రహముచే వీక్షింపబడుచు కుజునితో యుతి నంది కుజ రాశుల యందుండిన ఘృత ప్రియుడగును (నేతియందిష్టము)
   6) షష్ఠ భావము బుధలేక గురు నిరాశులై యుండి మృద్వంశ కల్గినను లేక భావమునందు గురుడుగానీ, బుధుడుగానీ స్థితి నంది యుండినను ఉపదంశ ప్రీతి కల్గును. (వడియాలు, అప్పడాలు, ఆవకాయలవంటి నంచుకొను పదార్థ ప్రీతి)

7) షష్ఠ భావమునకు, భావాధిపతికి ఏ విధమగు శుభగ్రహ సంబంధము లున్నను ఉపదంశప్రీతి కల్గును.

19. షష్ఠ భావమునందు భాగ్య భావాధిపతి యుండగా షష్ఠ భావాధిపతికి శని లేక కుజుని యొక్క యుతి కల్గిన యుండిన అగ్నివలన, దొంగల వలన ప్రమాదములు ప్రాప్తించ గలవు.

20. షష్ఠ భావాధిపతి నీచ-శత్రుక్షేత్ర - వ్యయభావ స్థితి యందున్న శత్రు నాశనమగును.

21. షష్ఠ భావమునందు గురుడుండి అగ్న షష్ఠ వ్యయ భావాధిపతుల యుతి నందిన యెడల పుత్రుడే పరమ శత్రువు కాగలడు.

22. షష్ఠ భావమునకు, లేక భావాధిపతికి శని-కుజులయొక్క యుతి లేక దృష్టి కల్గిన యెడల మద్యపాన వ్యసనము ప్రాప్తించగలదు.

23. షష్ఠ భావాధిపతి దశమ భావము నందున్నను-లేక వీక్షించినను పలు విధములగు వ్యసనములు ప్రాప్తించగలవు.

24. వ్యయ భావాధిపతి తృతీయ భావము నందుండగా కేతువు అంశ లగ్నమునందున్న యెడల చోరుడు కాగలడు.

25. షష్ఠ భావమునందు చంద్రుడుండగా దశమ భావంలో కుజుడున్న భూ సంబంధముగను 6-8-12 భావాలలో గురుడున్న వాహన - వస్త్రాభరణములవల్లను 7-5-9 భావాలలో గురువున్న సంతానమువల్లను 5-9- భావములలో రవియున్న తండ్రివల్ల, బంధువులవల్ల. 5-7 భావములలో శుక్రుడున్న ప్రయాణముల నిమిత్తము గాను మనో వ్యధలు కల్గుచుండుగలవు.

26. లగ్నాధిపతి రాహు లేక కలిసి కేంద్ర కోణస్థానము లందు షష్ఠ లేక అష్టమాధిపతితో యుతి నందిన కారాగృహ ప్రాప్తి కల్గును.

27. షష్ఠ భావాధిపతికి రాశి చక్రమునందు, అంశ చక్రమునందు గూడా కేతు సంబంధము కల్గియుండిన కారాగృహ ప్రాప్తి కల్గును.

28. షష్ఠ భావాధిపతి బలయుక్తుడై యుండగా లగ్న భావమునందు అష్టమ భావాధిపతి లాభదాయకమునందు శని, షష్ఠభావమునందు రాహువు లేక కేతువు స్థితి కల్గి యుండిన యెడల కారాగృహ ప్రాప్తికల్గును.



29. కారాకాంశ రాశ్యాధిపతి నుండిగానీ, జన్మ లగ్నాధిపతి నుండి గానీ 2-12, 3-11, 4-10, 5-9, 6-12, రాశులలో ఒకటి అంతకు మించిగానీ పాపగ్రహములు స్థితినంది యుండిన శృంఖలాబంధన ప్రాప్తి కల్గును.

30. షష్ఠభావమునందు చంద్రుడు స్థితి నందియుండగా అష్టమభావంలో రవి, వ్యయభావంలో శని, ద్వితీయ భావంలో కుజుడు నుండినయెడల గ్రుడ్డితనము కల్గును.

31. లగ్న, అష్టమ భావాధిపతు లిర్వురు అష్టమ భావమందు యుతి నందిన యెడల ఎడమ కంటికి హాని కల్గును.

32. షష్ఠ భావమందుగానీ, అష్టమ భావమందుగానీ శుక్రుడు స్థితి కల్గి యుండిన కుడి కంటికి హాని కల్గును.

33. వ్యయ భావమునందు రవి-చంద్రులు యుతి నందినయుండిన రెండు నేత్రములకు హాని కల్గును.

34. శత్రగ్రహము బలహీనుడై యుండగా శత్రు-నీచ-అస్తంగతాది దోషయుక్తుడగు శని గ్రహము లగ్న-ద్వితీయ భావాధిపతులతో యుతి నంది, శుభగ్రహ దృష్టిలేక యుండిన యెడల పుట్టుకతోడనే గ్రుడ్డితనము కల్గును.

35. షష్ఠ, అష్టమ, వ్యయ భావముల నెందేని లగ్న-ద్వితీయ భావాదిపతులుండగా పాపగ్రహ సంబంధములుగల కుజుడు లగ్న భావమునందున్న నేత్ర రోగము కల్గును.

36. మకర, కుంభ, మీన, నవాంశ రాశులయందు పాపగ్రహము లుండగా రాశిచక్రంలో చంద్రుడు ఉచ్ఛస్థితినందియుండిన మూగ తనము ప్రాప్తించగలదు.

37. షష్ఠ భావాధిపతి గురునితో యుతి నంది షష్ఠాష్టమ వ్యయ భావములందుండిన యెడల మాటలు రావు.

38. షష్ఠభావాధిపతి బుధునితో యుతి నంది లగ్నభావమునందుండిన యెడల మూగతనము కల్గును.

39. ద్వితీయ భావాధిపతి గురునితో యుతినంది షష్ఠాష్టమ వ్యయభావము లందు స్థితికల్గిన యెడల మూకత్వము ప్రాప్తించగలదు.

40. షష్ఠ, లాభ, తృతీయ భావాధిపతులు యుతినంది లగ్న, పంచమ, నవమ భావములయందు స్థితినందియుండిన బధిరత్వము (చెవుడు)
41. షష్ఠ భావాధిపతి శత్రుక్షేత్ర స్థితి కల్గియుండగా వ్యయభావమునందు బుధుడుండిన యెడల చెవిటితనము ప్రాప్తించును.
42. నవాంశ చక్రమునందు పాపగ్రహ దృష్టినందిన కేతువు లగ్నము నందుండిన యెడల చెవికి హాని కల్గును.
43. షష్ఠ భావమునందు శుక్రుడుండగా లగ్నభావమునందు కుజుడుండిన యెడల ముక్కుకు హాని కల్గును.
44. లగ్నభావాధిపతి బుధుడు కుజగ్రహాధిపత్య రాశులయందుగానీ ఆ నవాంశలయందుగానీ యుతి నందియుండిన నోటి సంబంధమగు రోగములు కల్గును.
45. లగ్నభావాధిపతి–కుజుడు కలిసి బుధాధిపత్య రాశులయందుగానీ ఆ నవాంశలయందుగానీ యుండిన యెడల ముఖ వ్యాధులు ప్రాప్తించ గలవు.
46. ద్వితీయ భావాధిపతి నైసర్గిక పాపగ్రహములతో యుతినంది షష్ఠాష్టమ వ్యయ భావములందున్న యెడల నోటి దుర్గంధము కల్గును.
47. షష్ఠభావమునందు ద్వితీయ భావాధిపతి రాహువుతో యుతి నంది యుండిన యెడల దంత సంబంధిత వ్యాధులు పీడించగలవు.
48. షష్ఠ భావమునందు నైసర్గిక పాపగ్రహములన్నియు స్థితినంది యుండిన యెడల కుంటితనము ప్రాప్తించగలదు.
49. షష్ఠ భావమునందు క్షీణచంద్రుడు రాహు–లేక కేతు యుక్తుడై స్థితి నందియుండి కుజ–శనుల వీక్షణ పొందిన యెడల కుంటితనము కల్గును.
50. షష్ఠ భావమునుండి ద్వితీయంలో కుజుడు, పంచమంలో చంద్రుడు, నవమంలో రవి స్థితి కల్గియుండిన యెడల అంగవైకల్యము కల్గును.
51. రవి స్థితిరాశినుండి రెండవ రాశిలో శనియు, సప్తమ రాశిలో కుజుడు, దశమరాశిలో చంద్రుడు స్థితినందియుండిన అంగవైకల్యము ప్రాప్తించును.
52. వ్యయ భావాధిపతి బలహీనుడై నీచాంశయందుగానీ పాపాంశ యందుగానీ యుండిన యెడల అంగవైకల్యము కల్గును.
53. వ్యయభావాధిపతికి పాపగ్రహ యుతి కలిగి బలహీనుడైనను, లేక వ్యయాధిపతి బలహీనుడై యుండగా వ్యయ భావమునందు పాపగ్రహ స్థితి యున్నను అవయవ లోప మేర్పడును.
54. కేంద్ర స్థానములగు లగ్న, చతుర్థ, సప్తమ, దశమ స్థానములందు నైసర్గిక పాపగ్రహము లన్నియు స్థితి నంది యుండిన యెడల వికలాంగుడు కాగలడు.
55. షష్ఠ భావమునకు పంచమస్థానమునందు (దశమభావంలో) బుధ–శని–రాహువులు యుతినంది యుండిన యెడల చేతులకు హాని కలుగును.
56. షష్ఠ భావమునుండి ద్వితీయ భావమునందు క్షీణచంద్రుడు రాహువుతో యుతి నంది యుండగా లగ్న భావమందు శని దశమ భావమునందు శుక్రుడు నుండిన యెడల కాళ్ళు–చేతులు గొప్ప ప్రమాదమునకు లోనుకాగలవు. (తెగిపోగలవు)
57. లగ్న భావమునందు షష్ఠాధిపతి చంద్ర–రాహువులతో యుతి నంది యుండిన పురుషాంగమునకు శస్త్రచికిత్స ప్రాప్తించగలదు. కుజదృష్టి యుండిన తెగిపోగలదు.
58. షష్ఠ భావాధిపతి శనితో యుతినంది లగ్నభావము నందుండగా కుజుని వీక్షణ కలిగినయెడల పురుషాంగమునకు శస్త్రచికిత్స లేక నరకబడుట ప్రాప్తించును.
59. షష్ఠ భావాధిపతి పాపగ్రహములతో యుతినంది లగ్న, అష్టమ భావస్థితి కలిగియున్న బాల్యము నుండియు వ్రణ (కురుపులు) ములు పీడించగలవు.
60. షష్ఠ భావాధిపతి అష్టమ భావాధిపతితోడను లేక నైసర్గిక పాపగ్రహముల తోడను యుతి నంది యుండి లగ్నభావమునుగానీ, భావాధిపతినిగానీ వీక్షింపుచుండిన యెడల బాల్యము నుండియు వ్రణ బాధలుండగలవు.

61. షష్ఠ భావాధిపతికి చంద్రునితోడను లేక ద్వితీయ భావాధిపతితోడను యుతి కలిగి లగ్న లేక అష్టమ భావములందు స్థితి నందియుండిన నోటియందు వ్రణబాధలు కల్గును.

62. లగ్న లేక అష్టమ భావములందు స్థితినందిన షష్ఠభావాధిపతికి పై విధముగా కుజునితో యుతికలిగ్ని యెడల కంఠమునందు వ్రణ బాధలు, శుక్రుని యుతివల్ల నేత్రములందు గురుని యుతివలన నాభి (బొడ్డు) యందు, బుధుని యుతి వలన పొట్టయందు, రాహు–కేతువుల యుతివల్ల దేహావయవములు లేక పెదవులందు – రవి యుతి వలన శిరస్సునందు, శనియుతివలన రహస్యాంగము లందు వ్రణబాధలు ప్రాప్తించగలవు.

63. దశమ భావమునందు దుస్థానాధిపతులుండి వారికి నైసర్గిక పాపగ్రహ దృష్టి సంబంధములు కల్గియుండిన వ్రణబాధలు పొందగలరు.

64. షష్ఠ భావమునందు బుధుడుండగా లాభ భావమునందు చంద్రుడు, వ్యయ భావమునందు గురువు స్థితినందియుండిన గుదభాగమునందు (మల విసర్జన ప్రదేశము) వ్రణబాధ లుండగలవు.

65. షష్ఠ – లగ్న భావాధిపతులిర్వురు కలిసి కుజాధిపత్య రాశులందు గానీ ఆ నవాంశలయందుగానీ యుండి పాపవీక్షితులైన యెడల మూల వ్యాధి (మొలలు) పీడకల్గును.

66. లగ్న భావాధిపతి, కుజ–బుధు లిర్వురితో యుతినంది మిధున కన్యారాశులయందుగానీ ఆ నవాంశలయందుగానీ యుండిన మూలవ్యాధి పీడితులు కాగలరు.

67. షష్ఠ అష్టమ, వ్యయ భావములయందేని రాహు లేక కేతువుతో యుతి కల్గిన లగ్నాధిపతి యుండిన మూలవ్యాధి అతి తీవ్రతరమై ప్రాణాపాయ స్థితి కల్గించును.

68. షష్ఠ భావాధిపతి భాగ్యభావమునందున్నను లేక ఆ భావమును వీక్షించినను గుహ్య రోగపీడితులు కాగలరు. (మలవిసర్జన స్థానము నందు)

69. షష్ఠ భావాధిపత్యము శనికికలిగి, అష్టమ భావాధిపత్యము కుజునికి కలిగి వారిరువురు ఒకరి నొకరు వీక్షింపుకొనుచుండిన (పరస్పర దృష్టి) అండవ్యాధి కల్గును.



70. అష్టమ భావమునందు కుజ–శుక్ర రాహువులకుగానీ లేక కుజ శని రాహువులకుగానీ యుతికల్గిన అండరోగ పీడితులగుదురు. (బుడ్డ వ్యాధి)

71. కుజాధిపత్యము గల రాశులయందు చంద్ర–కుజులకు యుతి సంభవించి శని వీక్షణ నందిన అండవ్యాధి పీడితులు కాగలరు.

72. అష్టమ భావమునందు లగ్నాధిపతి–శని యుతి నంది పాపగ్రహ సంబంధము కల్గియుండిన మధ్యవయసునందు వాతవ్యాధి పీడితులు కాగలరు.

73. షష్ఠ భావధిపతికి శనియొక్క షడ్వర్గులు ప్రాప్తించి లగ్నాధిపతితో యుతినంది యుండిన వాతవ్యాధి పీడితులు కాగలరు. (షష్ఠాధిపతి లేక శని దశాకాలములందు)

74. షష్ఠ భావాధిపతి దుస్థానములందుగానీ దశమ భావమునందుగానీ లగ్నాధిపతితో యుతి నందియుండి శనియొక్క సంబంధములు కల్గిన యెడల వాతాధిక్యతవలన పలువిధములగు దేహ బాధలకు గురి యగుదురు.

75. 1) షష్ఠ భావాధిపతి కుజదృష్టినంది అష్టమ భావమునందున్నను. 2) షష్ఠ–లగ్న భావాధిపతులిర్వురు కుజునితో యుతినంది దుస్థానముల యందు లేక లగ్న భావమునందున్నను, స్ఫోటకము (పెద్దమ్మవారు) కల్గును.

76. వ్యయభావమునందు కుజుడుండగా అష్టమ భావమునందు శనియుండి లగ్నాధిపతి బలహీనుడైన యెడల స్ఫోటక ప్రాప్తికల్గును.

77. షష్ఠ–లగ్న భావాధిపతులు బలహీనులై యుండి వారికి మాందీ – రాహు – కేతు సంబంధములు కల్గి చంద్రుడు క్షీణస్థితి యందున్న యెడల సర్వబాధ లేక జ్వరము, మశూచికము కల్గును.

78. షష్ఠ భావమునందు గురుడుండి పంచమ భావంలో క్షీణచంద్రుడుండి వారిరువురు పాపగ్రహ సంబంధములనందిన గర్భశూల కల్గును. (కడుపునొప్పి వగైరా)

79. షష్ఠ భావమునందు శనియున్నను, భావమును వీక్షించినను, లేక షష్ఠభావమునందున్న గురునకు శని–రాహువుల వీక్షణ కల్గినను గర్భశూల ప్రాప్తించగలరు.

80. సప్తమ లేక అష్టమ భావములలో నెందేని బలహీనులగు శని – గురువులు యుతి నందియున్న రక్తకోశవ్యాధి కల్గును. రవికూడా కలిసియున్న క్షయవ్యాధి కల్గును.
81. షష్ఠ భావమునందు పాపగ్రహాంశల బుధుడు కుజునితో యుతినంది, చంద్ర శుక్రుల దృష్టినంది క్షయవ్యాధి పీడితులు కాగలరు.
82. రవి–చంద్రులు ఒకరి రాశులయందు మరియొకరు పరివర్తనజెంది ఏ ఇతర శుభగ్రహ సంబంధములేని యెడల క్షయవ్యాధి కల్గును.
83. కుంభరాశియందు చంద్రుడుండి ఏ ఇతర గ్రహ సంబంధములులేక యుండిన క్షయవ్యాధి పీడితులు కాగలరు.
84. చతుర్థ భావమునందుగానీ లేక వ్యయ భావమునందుగానీ లగ్నాధిపతి కుజు–బుధు లిర్వురితో యుతినందియుండిన అపానవాయు రోగము లేక పాండు వ్యాధి జనించగలరు.
85. చంద్రుడు–బుధుడు, లగ్నాధిపతి అను ముప్వురు కలిసి రవి – రాహువులతో యుతినందినను లేక వారి ముగ్గురు రవి నవాంశ యందున్నను – నలుపురంగు గల్గిన మేహవ్యాధి శరీరమునకు ప్రాప్తించగలదు.
86. షష్ఠ భామునందు చంద్ర బుధ లగ్నాధిపతులు ముప్వురు రాహువుతో యుతినంది వారికి రవి దృష్టి కల్గినయెడల మేహవ్యాధి పీడితులు కాగలరు.
87. లగ్నభావము రవి రాశియై అందు షష్ఠాధిపతి గానీ అష్టమాధిపతిగానీ స్థితికల్గి యుండి, క్షీణచంద్రుడు రాహువుతో యుతినంది వ్యయభావము నందుండిన మేహ వ్యాధి పీడితులు కాగలరు.
88. షష్ఠమ భావమునందు శుక్రుడు సప్తమ భావాధిపతితో యుతి నంది యుండి పాపగ్రహ సంబంధములు కల్గినను, షష్ఠ భావాధిపతి బుధుడై నవమ భావమునందు సప్తమ భావాధిపతి మరియు శుక్రులతో యుతి నందినను భార్య సంతానమునకు అనర్థూరాలు కాగలదు.
89. బలహీనుడగు రవి లగ్నభావమునందుండగా లగ్నాధిపతి బలరహితుడై షష్ఠాధిపతి బలయుక్తుడై యుండిన హృద్రోగము ప్రాప్తించగలదు. (గుండెపోటు)



90. బలహీనమగు లగ్నభావమునందు క్షీణచంద్రునికి బలయుక్తడగు షష్ఠబావాధిపతి యొక్క యుతి ప్రాప్తించిన హృద్రోగము.
91. చతుర్థ భావమునందు గురు, కుజ శనులకు యుతికల్గి షష్ఠాధిపతి సంబంధము కల్గిన హృద్రోగము.
92. పంచమ భావస్థితి కల్గిన బలయుక్తుడగు షష్ఠాధిపతికి గురు–కుజ శనులు ముప్వురి దృష్టికల్గిన హృద్రోగము కల్గును.
93. షష్ఠభావాధిపతి బలయుక్తుడై లగ్నభావ స్థితి నందియుండగా చతుర్థ భావస్థితి శనికి, పంచమభావస్థితి కుజునికి, షష్ఠ భావస్థితి గురునికి కల్గిన హృద్రోగ ప్రాప్తి.
94. షష్ఠ భావమునందు స్థితినందిన చంద్రునికి పాపగ్రహ దృష్టి–పాపగ్రహ నవాంశ స్థితికల్గిన వాతాధిక్యతవలన హృద్రోగము ప్రాప్తించగలదు.
95. బలహీనుడైన షష్ఠ భావాధిపతి లేక కుజుడు లగ్న భావమునందు స్థితినంది యుండిన అజీర్తి వ్యాధి ప్రబలి గుల్మ–ముఖ–మూలవ్యాధులు ప్రాప్తించగలవు.
96. షష్ఠ భావము జలరాశిగా నుండి అందు చంద్రుడున్నను, లేక షష్ఠాధిపతి జలరాశులయందుండి బుధ వీక్షితుడైనను మూత్రకుచ్ఛ రోగము కల్గును.
97. మేషరాశి (షష్ఠభావమై) యందు బుధుడుండగా దశమ భావమునందు చంద్రుడు కుజ శనులతో యుతినందిన యెడల కుష్ఠువ్యాధి ప్రాప్తించ గలదు.
98. చంద్ర–శుక్రులకు పాపగ్రహ వీక్షణ కల్గి పాపాంశల నంది – జలరాశుల యందుండిన యెడల కుష్ఠువ్యాధి పీడితులు కాగలరు.
99. కారకాంశ లగ్నమునకు నాల్గవ రాశియందు కుజునిచే వీక్షించబడు చంద్రుడుండి రాహు సంబంధములేక కేతు సంబంధము కల్గిన మహాకుష్ఠువు కల్గును.
100. 1) షష్ఠ భావమునందు క్షీణచంద్రుడుండగా లగ్న భావమునందు రాహు వున్నను
2) అష్టమ భావమునందు చంద్రుడు రాహువుతో యుతినందినను

3) కేంద్ర స్థానములందు చంద్ర-శుక్రు లుండగా అష్టమభావంలో పాపగ్రహమునున్నను

4) చంద్ర శనులు యుతినందిన కుజుని వీక్షణ నందినను పై నాల్గు గ్రహ స్థితులయందు అపస్మారము కల్గును(కోమా)

101\. 1) షష్ఠ భావమునందు శనికి కుజుని యుతికల్గి రవి లేక రాహు దృష్టి కల్గినను

2) బలహీనుడైన లగ్న భావాదిపతి రాహు యుతి నందు కుజ-శనులదృష్టి నందినను, జాతకుడు దీర్ఘవ్యాధిచే పీడించబడును. (నిత్యరోగబాధలు)

102\. శుభగ్రహములన్నియు చర రాశుల యందుండగా శనికి సప్తమ భావస్థితికల్గి, చంద్రుడు పాపగ్రహ దృష్టి కల్గియున్న దుష్టగ్రహ పీడలు బాధించగలవు.

103\. షష్ఠ భావమునందు రాహుగానీ కేతువుగానీ స్థితినంది పాపగ్రహ నవాంశలను జెంది పాపగ్రహముల వీక్షణ నందిన దుష్ట గ్రహపీడలు కల్గును.

104\. షష్ఠ భావాధి బలయుక్తుడై-లగ్నాధిపతి బలరహితుడై యుండగా షష్ఠ భావము మేషాదిగా ఏ రాశిగా నుండిన ఏ విధమగు రోగములు ప్రధానముగా పీడించగలవో ఈ దిగువ దెలుపబడుచున్నవి (వ్యాధి కారక గ్రహముయొక్క శుభపాప సంబంధములు - వర్గ బలములు కూడా దృష్టి యందుంచుకొనవలెను.)

1) మేషరాశి :- మెదడు-శిరస్సు నేత్రములు-కారకులు గురు-రవి-చంద్రులు

2) వృషభరాశి :- కంఠము, మలకోశము, మూత్రకోశము కుజ, శని, చంద్రులు

3) మిధునరాశి :- శ్వాసకోశము, ఊపిరితిత్తులు, నాడీవ్యవస్థ రవి - చంద్ర - శనులు

4) కర్కాటకరాశి :- జీర్ణకోశము, ఉదరము (పొట్ట) - గురువు

5) సింహరాశి :- హృదయము, కంఠము, మలకోశము రవి - కుజ - శనులు



6) కన్యారాశి :- అజీర్తి,మలబద్ధకము,జిగటలేక రక్తవిరేచనములు గురువు - శని - బుధుడు

7) తులారాశి :- మూత్ర పిండములు, మధుమేహము శుక్రుడు - రవి - చంద్రులు

8) వృశ్చికరాశి :- వాపులు, ఉబ్బులు, రహస్యాంగవ్యాధులు చంద్ర - శని - కుజులు

9) ధనూరాశి :- రక్తహీనత, లివర్, నరముల బలహీనత చంద్రు - గురు - శనులు.

10) మకరరాశి :- చర్మము, కీళ్ళు, రక్తము, శీతలవ్యాధులు బుధ - శని - చంద్రులు

11) కుంభరాశి :- నరములు, నేత్రములు, మనస్సు శని - రవి - చంద్రులు

12) మీనరాశి :- వ్రణములు, కంతులు, వణకు కుజ - చంద్ర - రాహు - శనులు

105\. అవయవ కారకత్వములు :-

శిరస్సు - మేషరాశి - రవిగ్రహము
ముఖము - వృషభరాశి - చంద్రుడు
కంఠము - వృషభరాశి - కుజుడు
భుజములు - మిధునరాశి - కుజుడు
నేత్రములు - మేషరాశి - శుక్రుడు - రవి
హృదయము - కర్కాటకరాశి - రవి - చంద్ర
పొట్ట - సింహరాశి - బుధుడు
నడుము - కన్యారాశి - శని
పొత్తికడుపు - నాభి - తులారాశి - గురు - శుక్రులు
రహస్యాంగములు - వృశ్చికరాశి - కుజుడు - రాహువు
తొడలు - ధనూరాశి - శని - గురువులు
మోకాళ్ళు - పిక్కలు - మకరరాశి - శని
మడములు - కుంభరాశి - బుధ - చంద్రులు
పాదములు - మీనరాశి - శని

106. జన్మలగ్న భావ ద్రేక్కాణములవల్ల ప్రాప్తించు రోగపీడ లీ క్రింది విధముగా నుండగలవు.

1) **మేషలగ్నము :-** ద్వితీయ ద్రేక్కాణము-7 సం॥ వరకు వ్రన బాధలు

2) **వృషభలగ్నము :-** ప్రథమ ద్రేక్కాణము - 7 సం॥వరకు వ్రణ బాధలు
ద్వితీయ ద్రేక్కాణము-బాల్యంలో మృత్యు సమానపీడలు
మూడవ ద్రేక్కాణము-5నెలల వరకు అరిష్టములు

3) **మిధున లగ్నము :-** మొదటి ద్రేక్కాణమైన 6 మాసముల వరకు 2వ ద్రేక్కాణమైన 3-1/2 సం॥వరకు.
3వ ద్రేక్కాణమైన 4 సంవత్సరముల వరకు విపరీత రోగ లక్షణములు లుండగలవు.

4) **కార్కటక లగ్నము :-** మొదటి ద్రేక్కాణమైన 6 మాసముల వరకు, 2వ ద్రేక్కాణమైన 7 సం॥ వరకు ప్రాణాంతకమగు వ్యాధి పీడ లుండగలవు.

5) **సింహలగ్నము :-** కర్కాటక లగ్నమువలెనే దోషము లుండగలవు.

6) **కన్యాలగ్నము :-** ఏ ద్రేక్కాణమైనను దోషములు లేవు. (2వ ద్రేక్కాణం దోషము)

7) **తులాలగ్నము :-** మొదటి ద్రేక్కాణమైన 9 మాసములు శూలరోగబాధలు 2-1/2 సం॥ వరకు తీవ్రగండము కల్గును.

8) **వృశ్చికలగ్నము :-** మొదటి ద్రేక్కాణమై 5 సం॥ వరకు రోగపీడలు కల్గును.

9) **ధనుర్లగ్నము :-** మొదటి ద్రేక్కాణమైన 1సం॥ 10 మాస ములు రోగాది గండములు. 2వ ద్రేక్కాణమైన 12 సం॥ వరకు రోగబాధలు. 3వ ద్రేక్కాణమైన 4 వ సం॥నందు మరణతుల్య పీడ.



10) మకరలగ్నము :- మొదటి ద్రేక్కాణమైన 1సం॥వరకు తీవ్ర రోగములు. 2వ ద్రేక్కాణమైన 2వ సం॥నందు రోగపీడ 3వ ద్రేక్కాణమైన తండ్రికి విశేషపీడ-గండము.

11) కుంభలగ్నము :- మొదటి ద్రేక్కాణమైన 10 మాసముల వరకు శరీరబాధలు, 2వ ద్రేక్కాణమైన 6 మాసముల వరకు రోగములు. 3వ ద్రేక్కాణమైన 7 సం॥ వరకు వివిధ రోగబాధలు కల్గును.

12) మీనలగ్నము :- తృతీయ ద్రేక్కాణమైన 1 సం॥వరకు శరీర నలతలు కల్గును.

107. షష్ఠ భావాధిపతి బలయుక్తుడై శుభ సంబంధములు కల్గి లగ్న భావమునందు స్థితి నందియుండిన మేనమామను పోషించువాడగును. మరియు జాతకుడు. ముద్రాధికారము కల్గియుండుట లేక సేనా నాయకుడు (కెప్టెన్-కమాండర్) లేక చెరసాలకు అధికారికాగలడు. మిశ్రమ బలమువల్ల సైనికుడు-రక్షక భటుడు కాగలడు, పాప బలమువల్ల వ్యాధిగ్రస్తుడగును. లేక చౌర్య వృత్తి కల్గును.

108. షష్ఠ భావాధిపతి బలయుక్తుడై శుభసంబంధములు కల్గి ద్వితీయ భావము నందుండినను, ఎగుడుదిగుడు దంతములు, దృష్టిలోపము చెప్పిన మాటనే పలుమారులు చెప్పుట కల్గును. మరియు జాతకుని కుటుంబ జీవితము అనేక అవకతవకలు గల్గి అశాంతికరముగా నుండగలదు. ఈతి బాధలు, శత్రువులవల్ల ధన నష్టములు కలుగ గలవు. మిశ్రమ బలమువల్ల మిశ్రమ ఫలితము లుంటవి. పాపబలము పాప సంబంధములవల్ల ఆ పాపగ్రహ దశాభుక్తులందు భార్యకు హాని కలుగగలదు. శుక్రుడు కూడా బలరహితుడై యుండిన జీవిత మంతయు ఆకలివేళ అన్నము దొరకనంతటి దరిద్రుడు కాగలడు.

109. షష్ఠ భావాధిపతి శుభయోగ బలముకల్గి తృతీయ భావమునందుండిన మేనమామ-సోదరుడు శత్రువులై సాధింపుచర్యలు చేపట్టగలరు. లేకున్న సోదరుడు తీవ్ర వ్యాధిగ్రస్థుడగును. మిశ్రమ బలమువల్ల మిశ్రమ ఫలము పాపగ్రహ సంబంధ యోగాదులవల్ల జాతకుని తరువాత సోదరులు నశించగలరు.

110. షష్ఠభావాధిపతి బలయుక్తుడై శుభ సంబంధముకల్గి చతుర్థ భావమునందున్న యెడల - కష్టజీవులైన పలువురు మేనమామ లుండగలరు. తల్లికి రోగపీడలు-విద్యాభంగము. శిథిలగృహ నివాస ములు కల్గును. మిశ్రమ బల సంబంధములు కల్గియున్న కుత్సితవృత్తి. నివాసగృహ భంగము, తల్లితో నిరంతర కలహములు ప్రాప్తించగలవు. పాపగ్రహ సంబంధములవల్ల పిత్రార్జిత భూగృహాదులు ఋణగ్రస్తమై నష్టముండగలవు. తల్లికి అపకీర్తి కల్గును. పరిచారక వృత్తి కల్గి జీవితమంతయు దుఃఖమును పొందును, కారాగృహప్రాప్తి కల్గును.

111. షష్ఠభావాధిపతి బలయుక్తుడై శుభయోగ సంయుక్తుడై పంచమ భావము నందున్న ఇతరులకు దత్తత (మేనమామ) వెళ్ళుట ద్వారా భాగ్యవంతు డగును. మిశ్రమ బలమువల్ల మిశ్రమఫలితములు కల్గును. పాపగ్రహ సంబంధములవల్ల పుత్ర దుఃఖము గానీ రోగ పీడిత పుత్రుని పొందుట గానీ జరుగును.

112. షష్ఠ భావాధిపతి శుభగ్రహమై బలయుక్తుడై శుభగ్రహ సంబంధములు కల్గి షష్ఠ భావమునందుండగా కారకగ్రహము కూడా బలయుక్తమై యుండిన యెడల మేనమామకు గొప్ప యోగస్థితి ప్రాప్తించగలదు. మిశ్రమ సంబంధముచే మిశ్రమ ఫలము. షష్ఠభావాధిపతి నైసర్గిక పాపగ్రహమైనను, పాపగ్రహ సంబంధములు బలముగా నున్నను, శత్రువృద్ధితో బాటుగా జాతకుడు గొప్పవ్యాధి పీడితుడు కాగలడు.

113. షష్ఠ భావాధిపతి బలయుక్తుడై శుభయోగ సంబంధములు కల్గి సప్తమ భావము నందున్న మేనమామ కుమార్తె లేక మేనమామల వంశమునకు జెందిన వధువు భార్య కాగలదు మేనమామలు సిరిసంపదలు గలవారగుదురు. దూరప్రాంతములందుండి జాతకునికి సహాయపడగలరు. మరియు జాతకుని భార్య భర్తను తన చెప్పుచేతల యందుంచుకొని యాజమాన్యము వహించగలదు. మిశ్రమ బల సంబంధమువల్ల మిశ్రమ ఫలితములు కలుగగలవు. పాపగ్రహ సంబంధాదులవల్ల జాతకునికి స్త్రీ సౌఖ్యహీనత కల్గును. లేక జాతకుడు భార్యను త్యజించుట (వదలివేయుట) లేక భార్య మరణించుట కల్గును.



షష్టభావాధిపతి పాపయోగ సంబంధములు కల్గి సప్తమ భావమునందు క్లీబరాశి-అంశల యందుండిన (మిధున కన్యా-మకర-కుంభములు క్లీ బరాశులు) యెడల జాతకుని భార్య వంధ్యయగును. లేక సంసారమునకు అయోగ్య మగురోగపీడిత యగును. (ఇట్టి స్థితిగల షష్ఠాధిపతి దశయందు కళత్రమృతి కల్గును) షష్ఠ భావాధితోబాటు లగ్న భావాధిపతి కూడా క్లీబరాశుల యందున్న యెడల జాతకుడు నపుంసకుడు కాగలడు.

114. షష్ఠ భావాధిపతి బలయుక్తుడై శుభ సంబంధములు కల్గి అష్టమ బావమునందున్న జాతకునికి మధ్య మాయువు ప్రాప్తించగలదు. (50 60 సం॥ మధ్య) మిశ్రమ బలాదులవల్ల ఋణములద్వారా ధన ప్రాప్తి అల్పాయువు కల్గును. (25-30 సం॥మధ్య) పాపగ్రహ సంబంధాధిక్యత నందియుండిన బాలారిష్టము కల్గును. (బాల్యమరణము) దైవ వశాత్ జీవించియుండిన వ్యాధిపీడితుడు కాగలడు.

115. షష్ఠ భావాధిపతి బలయుక్తుడై శుభ సంబంధ యోగాదులు కల్గి నవమ భావమునందున్న జాతకుని తండ్రి న్యాయాధికారి లేక న్యాయవాది కాగలడు. తండ్రితో శత్రుత్వముండగలదు. మేనమామలు సంపన్నులై యుండగలరు. మిశ్రమ యోగమునందు మేనమామ లేక తండ్రి న్యాయస్థాన సంబంధిత వృత్తికల్గి సామాన్యజీవనులై యుండగలదరు. ఫలితములు మిశ్రమము, పాపగ్రహ సంబంధాదులవలన శత్రువులు లేక జ్ఞాతులవల్ల సంపదలు నశించ గలవు. గురుద్రోహ మొనర్చగలడు. దైవభక్తి ఆధ్యాత్మిక విశ్వాస హీనుడై ధర్మచ్యుతుడు కాగలడు.

116. షష్ఠ భావాధిపతి శుభయోగబలాదులు కలిగి లాభ భావమునందున్న అగ్ర సోదరుడు గొప్ప ఉద్యోగి కాగలడు (శిక్షాధికారి) దుష్టకార్యసక్తి పాపకార్యాచరణుడు-వైదిక వృత్తులు కలవాడునగును. మిశ్రమ సంబంధ బలాదులవల్ల అగ్ర సోదరునికి కొంతకాలము తరువాత జీవన (ఉద్యోగ) భంగమగును. జాతకుడు వృత్తి యందు శత్రువులు గలవాడై చిక్కుల నందగలడు. పాపయోగ సంబంధాదులు కలిగి

యుండిన నీచమగు పనులచే జీవించుట లేక జీవనోపాధి యేమియు లేక భిక్షుకవృత్తి యాచనలు గావింపుచుండుట ప్రాప్తించగలవు.

117. షష్ఠ భావాధిపతి బలయుక్తుడై శుభయోగ సంబంధము కలిగి వ్యయ భావము నందుండిన నిరంతరము దుష్టకర్మల నాచరింపు చుండును. చెడుమార్గముల ద్వారా (వ్యసనములవల్ల) ధనవ్యయము గావించు వాడగును. మిశ్రమ బలమువల్ల మిశ్రమ ఫలములు కల్గును పాప సంబంధాదులవల్ల నరకప్రాప్తి కలుగును.

118. షష్ఠ భావాధిపతి శుభయోగ బలాదులు కలిగి దశమ భావమునందున్న యెడల అనేక సేవకా జనములు కలిగి వాహనములు ధనసంపదలు కలిగి యుండగలడు. దండనాధికారము కలుగును. మిశ్రమ ఫలము కలుగును, పాపగ్రహ సంబంధాదులవలన జాతకునికి సేవాకావృత్తి ప్రాప్తించగలదు. మరియు వాహన ప్రమాదములు, శిక్షించబడుట కలుగును.

## షష్ఠ భావ స్థిత గ్రహ ఫలితములు

ఇతర గ్రహసంబంధములు, భావ కారకత్వము కలుగని రవ్యాది గ్రహములు షష్ట భావ స్థితి కల్గి యుండుటవల్ల ప్రాప్తించు ఫలితములు సంగ్రహముగా దెలుపబడుచున్నది.

1 **రవిగ్రహ స్థితివల్ల :-** సౌఖ్యము, సద్బుద్ధి, ఖ్యాతి ధన సంపదలు రాజమాన భోగములు, శత్రునాశనము, కులముఖ్యత్వము కల్గును.

2. **చంద్రగ్రహ స్థితివల్ల :-** కోపము, దయాహీనత, శత్రువృద్ధి, దైన్యము, అజీర్ణవ్యాధులు ఉదరశూల కల్గును. (పూర్ణచంద్రుడైన శుభము)

3. **కుజగ్రహ స్థితివల్ల :-** అధికకోపము, స్నేహశీలత, అధికమగు ఆకలి, శత్రు నాశనము, అధిక కామప్రకోపము కీర్తి కల్గును.

4. **బుధ గ్రహ స్థితివల్ల :-** వివాదములయందు ప్రీతి. క్రోధ గుణము నేర్పు, అలసట కఠిన హృదయము, శత్రుబాధలు, వ్యాకులత్వము కల్గును.



5. **గురు గ్రహస్థితివల్ల :-** నిరుత్సాహము, రోగ రాహిత్యము, కీర్తి కాంక్ష. ప్రారబ్ధ కర్మానుభవము-శత్రు రాహిత్యములు కల్గును.

6. **శుక్ర గ్రహ స్థితివల్ల :-** శత్రు నాశనము,సౌఖ్యము విచారగ్రస్త ముఖము, యువతులచేత మోసగించబడుట, శత్రువృద్ధి భయము, అధిక వ్యయము, శత్రువులకు వశపడియుండుట కల్గును.

7. **శనిగ్రహ స్థితివల్ల :-** దుశ్చరిత్ర, అధిక తిండిపోతు, ధన సంపదలు, శత్రువులచే పరాజయము, ఋణరాహిత్యము, నీచజనుల వల్లభయము, వాతరోగ పీడలు కల్గును.

8. **రాహుగ్రహ స్థితివల్ల :-** శత్రువులచే బాధలు, గ్రహబాధలు, ధన భాగ్య సంపదలు సౌఖ్యము, మలవిసర్జన స్థానమునందు రోగపీడ కల్గును, (కొందరు శాస్త్రవేత్తలు శత్రునాశనము - యోగ్యమగు భార్య, రోగ రాహిత్యము విద్య - దీర్ఘాయువులు ప్రాప్తించగలవని దెల్పియున్నారు)

9. **కేతు స్థితివల్ల :-** శత్రురోగ ఋణబాధలు, చంచల స్వభావము, అవమానము - ధైర్యము, కుటిలస్వభావము, చోరబుద్ధి, రోగ పీడలు పశు సంపదలు కల్గును.

మంత్రేశ్వర పండితులు :

శ్లో॥ **ఔదార్య ముత్తమగుణాం ప్రసిద్ధి ।**
**షష్ఠే ప్రభుత్వ మరిమర్దన మిష్ట సిద్ధిం ॥**

అని దెల్పుటచే - ఔదార్యము, ఉత్తమగుణములు, ప్రసిద్ధి, ప్రభుత్వోద్యోగము, శత్రునాశనము, ఇష్టసిద్ధి ప్రాప్తించగలవని భావము.

## షష్ఠ భావమునకు గ్రహ దృష్టి ఫలితములు

దుస్థానాధిపత్యములు, ఇతర గ్రహ సంబంధములు కలుగని రవ్యాది గ్రహములు షష్ఠ భావమును వీక్షించుటవల్ల ప్రాప్తించు ఫలితములు సంగ్రహముగా దెలుపబడుచున్నవి.

**1. రవి గ్రహ దృష్టి కల్గిన :-** శూరత్వము, అభిమానము, రాజపూజ్యత, ఖ్యాతి, ధనము, కాముకత్వములు కల్గును.

**2. చంద్రగ్రహ దృష్టి కల్గిన :-** ఆయుర్వర్ధనము, భోగము, సౌఖ్యానందములు కల్గును.

**3. కుజగ్రహ దృష్టి కల్గిన :-** శత్రునాశనము, బలము, కీర్తి, ధనము, స్థిర సంపదలు కల్గును.

**4. బుధగ్రహ దృష్టి కల్గిన :-** కలహ ప్రియత్వము, విద్య, వినోదాసక్తి, శీల సంపద బంధూపకారములు చేయ కుండుట కల్గును.

**5. గురు గ్రహ దృష్టి కల్గిన :-** శత్రుజయత్వము, శరీర దుర్బలత్వము కామాధిక్యతులు కల్గును.

**6. శుక్ర గ్రహ దృష్టి కల్గిన :-** తిండిపోతుతనము, శోక సంతానముల, అపవాదులు పొందుట కల్గును.

**7. శని గ్రహ దృష్టి కల్గిన :-** అధిక ఆహార ప్రియత్వము, శత్రుభీతి, ధన వృద్ధి, వావివరుసలు గణింపని కామ వ్యాపారములు కల్గును.

**8. రాహు గ్రహదృష్టి కల్గిన:-** కులాచారములు, చిరాయువు, శత్రు జయత్వము, సుఖము కల్గును.

**9. కేతు గ్రహ దృష్టికల్గిన :-** ఉదారగుణము, విద్యార్జన, కీర్తి ప్రతిష్టలు బంధూపకార గుణము, దయాశీలతకల్గును

**విశేషము :-** నైసర్గిక శుభ గ్రహములు షష్ఠభావము నందుండుట చూచుట శుభప్రదము. నైసర్గిక పాప గ్రహములు శుభుల సంబంధము జెంది శుభము నివ్వగలరు. షష్ఠ భావాధిపతి నైసర్గిక శుభుడై యుండి శుభగ్రహ సంబంధములు కలిగి ఏ భావము నందున్నను ఆ భావ కారకత్వములకు శుభము కలిగించగలడు. ఈ సూత్రము భావ కారకునికి - నైసర్గిక పాప గ్రహమగు భావాధిపతికి వర్తించదు.



### 7. సప్తమ (కళత్ర) భావము

వివాహము-భార్యయొక్క రూప గుణాదులు - బహుభార్యా యోగములు-వివాహ కాలనిర్ణయము. దాంపత్య సౌఖ్యము, స్త్రీ ధనాదైశ్వర్య ప్రాప్తి, అన్యోన్య ప్రీతి - భార్యా నష్టకాలము - పర స్త్రీ సంబంధములు వివిధ దోషములు, వాటివల్ల కల్గు అరిష్టములు మొదలగు విషయములు.

### 8. అష్టమ (ఆయు) భావము

బాలారిష్టములు, పూర్ణ - మధ్యమ, అల్పాయువులు, ఆయుర్దాయ నిర్ణయము-వివిధ ఆయురారోగ్యములు-అరిష్టములు, గండములు, మరణ కారణములు, ఆయుర్నిర్ణయ గణితములు మొదలగు విషయములు.

### 9. భాగ్య (ధర్మ) భావము

కీర్తి ప్రతిష్టలు, ధర్మకార్యాచరణలు, తండ్రి తాతల ఆస్తులు, దత్తత స్వీకారాదులు, వారసత్వపు ఆస్తులు - తండ్రితోటి సంబంధబాంధవ్యములు పితృమరణము - అపకీర్తి, సన్యాసము, వైరాగ్యాది విషయములు.

### 10. రాజ్య (కర్మ) భావము

వృత్తి - వివిధ ఉద్యోగకారణములు, పదవులు, గౌరవము విశిష్ట స్థానము - అధికారము, వృత్తి ఉద్యోగ వ్యాపారాదులకు సంబంధించిన అనేక విషయములు.

### 11. లాభ భావము

లాభా లాభములు, జ్యేష్ఠ సోదర సోదరిమణులు - వారికి సంబంధించిన విషయులు, ప్రయాణములు, బ్యాంక్ నిల్వలు, ఇతర ఆర్థిక లాభ లాభాది విషయములు.

### 12. వ్యయ భావము

కష్ట సుఖములు నష్టములు దూరప్రాంత నివాసములు (విదేశస్థితి) దుఃఖ విషయములు, వ్యయము కారణములు మొదలగు విషయములు.

*జ్యోతిష భావఫల చంద్రిక రెండవ భాగమునందు గలవు.*

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు,వైద్య, మంత్రశాస్త్రాది గ్రంధములకు మోహన్‌పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి.